తరాలు మారేయి-సమాజమే మారింది-ఈ
సమాజానికి ఓ కొత్తబాణీ పత్రిక కావాలి-ఆ
అవసరం తేటతెల్లంగా కనిపిస్తోంది. ఆ కొత్త
తరం అభిలాషను పూర్తి సంతృప్తినిచ్చే పత్రిక

# వెరయిటి

ప్రతి పేజీ ఉత్కంఠతో
చదివించే సవాలుతో
కొత్త రీతిలో
ఆధునికులకై తీర్చిదిద్దిన
వెరయిటీ అంశాలతో
మరో బాణీకి రేపటి
అనేక పత్రికలు అనుసరించే
ప్రథమ సంకేత మాస పత్రిక!




**కమెండో సంస్థ నుండి వెలువడుతున్న**
**విభిన్న తరహా సామాజిక తెలుగు మాసపత్రిక**

# వెరయిటి

**మొదటి సంచిక మార్కెట్లో వుంది.**

# లోకంపోకడ * డేశిమెన్











**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938 1972]

శుక్రవారం : 5-6-'81

దుర్మతినామ సం. జ్యేష్ఠ శు. తదియ

**సంపుటము 74 : సంచిక 33**

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 67-60

ఆరు మాసాల చందా రు. 33-80

విడిప్రతి వెల రు. 1-25 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**

గాంధీనగరం. విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :

హిం...టి ...మన్నా

(ఫోటో : జగ్ మోహన్)

**కథలు :**



**సీరియల్ కథలు :**



**వ్యాసాలు, శీర్షికలు :**

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యంవిందే గట్టి పళ్ళు



## కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన అపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

**నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!**




DC.G.74 TL

# ఉత్తరాలు

## ముఖచిత్రం

శోభన్‌బాబు, జయసుధల ముఖచిత్రముతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఎంతో ఆకర్షణీయంగా ఉంది. దీనిలోని మూడు కథలు చాలా బాగున్నాయి. కార్టూన్లు బాగున్నాయి. సినిమా విశేషాలు కూడా బాగానే ఉన్నాయి.

మాకర్ల వెంకటేశ్వరరావు (మచిలీపట్నం)

## కథలు

"మూరు చచ్చిపోయింది" మాకు బాగా నచ్చింది. హిందువులకు, ముస్లింలకు మధ్య జరిగిన యుద్ధాల వలన జరిగిన రక్తపాతం గురించి మన చరిత్ర చెబుతోంది. తన మతమే గొప్పదని, ఇతర మతాలను దూషిస్తూ, ఇతర మతస్థులను హింసలకు గురిచేసిన ఔరంగజేబు చరిత్ర అందరికీ తెలిసినదే. చరిత్ర పుటలు తిరగవేస్తే ఇటువంటి ప్రభువులు ఎంతమందో? మనది కులమత ప్రశక్తి లేని లౌకిక రాజ్యమే అయినప్పటికీ కుల మత పరమైన యుద్ధాలు ఇంకా జరుగుతుండటం దురదృష్టకరం. ఒకగ్లాసు విషంలో ఎన్ని పాలచుక్కలు వేసినప్పటికి అవి పాలుగా మారవు. కానిఒకగ్లాసుపాలను ఒక్కవిషపుచుక్కఆపాల్నిటిని విషముగామార్చేస్తుంది—అన్న రచయిత్రివాక్యాలు అక్షర సత్యాలు. కుల, మతాలకు అతీతంగా మానవులంతా హిందువులైనా లేక ముస్లిములైనా లేక ఏమతస్థులైనా సహోదరులుగా మెలగిననాడు కాని ఈ కులమత యుద్ధాలు సమసిపోవు.

టి. వి. శ్రీనివాసరావు, టి.సత్య ప్రసాదరావు
[అండలూరు]

* * *

'ముందడుగో ముళ్ల కంపో' కథ ఆలోచింపచేలా ఉంది. విధవ అయిన వసుంధరను భార్యను పోగొట్టుకున్న శంకరం పునర్వివాహం చేసుకొన్నాడు. కాని అదివరకే ఈ ఇద్దరికి పెరిగి పెండ్లి అయిన పిల్లలున్నారు. వసుంధర కూతురు సుజాత, అల్లుడు నాగేష్ ఈ వివాహ విషయమై ఘర్షణ పడ్డారు. శంకరం కొడుకు ఆస్తిని పంచి వివాహం చేసుకుంటే బాగుండేది అని ఉత్తరం వ్రాశాడు. శంకరం కూతురును అత్త మామలు గెంటివేశారు. ఇలాంటి వివాహాలు జరగడం మన దేశంలో అట్టడుగున పడి వున్న అలగా జనంలో మామూలే కాని విద్యా వంతులైన మధ్య తరగతి ఉన్నత కుటుంబాల్లో చాలా అరుదు. స్త్రీల చెడు ప్రవర్తన వలన పురుషులను అవహేళన చేసే దౌర్భాగ్యం మన సంఘం నుండి తొలగిపోనంతవరకు ఇటువంటి వివాహాలు దుష్ఫలితాల్నే కలిగిస్తాయి. అందువల్ల ఇట్టి వివాహాలు ముందడుగు కాదు ముండ్ల కంప అని హెచ్చరించిన రచయిత్రి అభినందనీయురాలు.

చింతల నారాయణ (కరీంనగరం)






అతడు నన్నుచూస్తూనే ముసిముసిగా నవ్వుతాడు! అంటే — అతడు నాకేమీ మేనమామ కొడుకు కాదు, నేనతనికి మేనత్త కొడుకునూ కాదు. పలకాబలపం పట్టిన చిన్ననాటి నుండి ప్రక్కన ప్రక్కన కూర్చుని చదువుకొన్న సహ విద్యార్థి కాదు. సమయా సందర్భాల్లో ఆదుకొనే స్నేహితుడు అసలే కాదు.

అయినా అతడు నన్ను చూస్తూనే చాలా తమాషాగా నవ్వుతాడు!— అలా నన్ను చూచి అతడు నవ్వాడంటే — ఆ రోజు నాకో మనియార్డరు ఉందని అర్థం. అందులో ఓ పావలావరకా తనదని అతడి స్వార్థం. ఇదీ అతడి నవ్వులోని అంతరార్థం!

ఒక్కొక్క రోజు ముభావంగా చూస్తాడు, అంటే—ఏదో ఓ ఉత్తరం మాత్రం ఉంటుం దన్నమాట! మరొక్క రోజు మహా హడావిడిగా నన్నుచూచీ చూడనట్లు చూస్తాడు. ఆరోజు ఉత్తరం కానీ — మనియార్డరు కానీ — ఏదీ ఉండదు.

ఇప్పుడు అతడెవ్వరో పరిచయం చేయవలసిన అవసరం లేదనుకొంటాను. ఆ రోజు నేను ఏదో పనిమీద బజారు వెళ్తూ మరో వీధిలో ప్రవేశించబోతున్నాను. అనుకోని విధంగా అతడు మా వీధి మొగదల్లోనే కనుపించాడు. ముభావంగా నావైపుచూశాడు.

అతనివద్ద నుండి నేను ఓ ఉత్తరాన్ని అందుకొన్నాను!

ఉత్తరాల్ని ఆతురతగాచింపి ఊహాలోకాల్లో విహరిస్తూ చదివే వయస్సులు కాకపోయినా— ఉత్తరాలంటే అదొక వెర్రి వ్యామోహం. ఎవరికైనా ఎప్పుడైనా! అడుగు అటుయిటు కదపకుండా అక్కడే నిలబడి చదివాను! చదువుతూ ఆలోచించాను. ఆలోచిస్తూ ఆనందపడ్డాను.

జిల్లా పౌరసంబంధ శాఖాధికారి నుండి వచ్చిన ఉత్తరం అది. ఉత్తరం అందిన వెంటనేవెళ్ళి ఆ అధికారిని కలుసుకోవాలట! ముఖాముఖి మిగతా విషయాలు ముచ్చటించుకోవచ్చునట!! ఓ జిల్లా అధికారి నాతో ముచ్చటించవలసిన విషయాలేముంటాయని సందేహంలో పడ్డాను. తినబోతూ రుచి అడగడ మెందుకని సందేహంలో నుండి సమాధానంలోపడి అటుపై ఒక్క అడుగులో యింట్లోపడ్డాను.

అది యిల్లు!

ఎండవానల నుండి కాపాడుతూ ఉంది. శీతా తప బాధల నుండి రక్షిస్తూ ఉంది.

## పాత 'తుక్కు' నుంచి రైలింజన్

హౌరా ఎలక్ట్రిక్ రైలింజన్ల షెడ్‌లో పనిచేసే లోకో సిబ్బంది, పాత చెడిపోయిన యింజన్ల తుక్కుసామాను అంతా చేరదీసి అందులో పనికివస్తా యనుకున్న ముక్కల్ని; రైలుయింజన్ల విడి భాగాల్ని కలిపి ఒక ఎలక్ట్రిక్ రైలింజన్ తయారు చేశారు అని తూర్పు రైల్వే జెనరల్ మేనేజరు శ్రీ ఆర్. పి. సింగ్ ప్రకటించారు.

కాలిపోయినందువల్ల అవతల పారేద్దామని అట్టే పెట్టిన విద్యుత్ రైలు పెట్టె నొకదాన్ని తెచ్చి అందులో యీ విడి భాగాలు బిగించి దాన్ని ఒక కొత్త విద్యుత్ రైలింజన్‌గా మార్చిన యీ లోకో సాంకేతిక సిబ్బంది మొత్తం 25 మందిని కూడా అధికారులు ప్రశంసించారు. ఎందుకంటే యీ పాత తుక్కు నుంచి వీళ్ళు చేసిన యింజన్‌కి అయిన ఖర్చు రు. 8 లక్షల చిల్లర. కొత్త యింజన్ కొంటే రు. 35 లక్షల రూపాయలు అవుతుంది. ఈ తుక్కు యింజన్‌ని హౌరా షంటింగ్ యార్డ్‌లో వుపయోగిస్తారు.

## మింగుడు పడని మెతుకులు

తిన్నా తినకున్నా కాళ్ళు కడుపులో పెట్టుకొని పడుకోనిస్తూ ఉంది. ఎక్కడెక్కడ ఎలా ఎలా తిరిగినా కడకు చేరవలసినచోటు అదేకాబట్టి చేరబోతే కిక్కురుమనకుండా చేరదీస్తూ ఉంది. అలాంటప్పుడు అది ఎలాఉన్నా దానిని కనీసం దాని పేరుతో దానిని 'యిల్లు' అనకపోతే అపచారమే అవుతుంది.

ఆ యింట్లో అర్థాంగి ఆరు మంది బిడ్డలతో హాయిగా జీవిస్తూ వుంది !

అది యిల్లు ! అందులో ఆమె హాయిగా జీవిస్తూ ఉంది!! అని అనుకోకపోతే ఈ బ్రతుకులో ముందుకు వెళ్లడం ముక్కుకు దారం వేసి లాగినట్లే ఉంటుంది.

ఆ యింట్లో వున్నవి రెండే రెండు గదులు. అందులోని ఒకానొక గదిలో ఒక మూల వంటగది. ఒకమూల బాత్‌రూమ్. మరొక మూల స్టోర్‌రూమ్. వంట గదికి బాత్‌రూమ్‌కి ఎదురుగా వున్న గోడమీద విలువెత్తు ఎత్తులో స్టాండ్‌మీద పూజగది. ఈ గదిని ఆనుకొని వున్న యింకొక్క గది సమయా సందర్భాల్ని బట్టి డైనింగ్‌హాల్‌గా— బెడ్‌రూమ్‌గా— గెస్టురూమ్‌గా అవతారాలు దాల్చి సామాన్యుడి అవసరాలను సర్దుబాటు చేస్తూ వుంటుంది. ఈ రెండు గదులకు ముందున్న మూడడుగుల ఖాళీజాగా పోర్టికో!

ఇంట్లో అడుగుబెట్టి పోర్టికో దాటి హాల్లో నిలబడ్డాను ఓ క్షణం !

బాత్‌రూమ్‌లో చంటిదానికి రెండో అమ్మాయి స్నానం చేయిస్తూ వుంది వంట గదిలో మండని పొయ్యితో అర్థాంగి మండి పడుతూ వుంది. మూడో అమ్మాయి స్టోర్ రూమ్‌లో నిలబడి కుండలోని బియ్యాన్ని చేటకు తోడుకొంటూ వుంది. నాలుగో అమ్మాయి ఆ గదిలో ఖాళీగా వున్న నాలుగో గదిలో కూర్చుని కూరలు తరుగుతూ వుంది.

రాశి చక్రంలో నాలుగు మూలల్లో నాలుగు గ్రహాలుంటే— అలాంటి జాతకుడు అదృష్టవంతుడట! నా రాశి చక్రం ఆ గది. ఆ గదిలో నాలుగు మూలల్లో నలుగురు కూతుళ్ళు! నా అదృష్టానికి నాలో నేనే పొంగిపోతూ నిలబడ్డాను.

ఇంటికి దూరమయిన పెద్దమ్మాయి పోర్టికోలో కూర్చుని— 'నా నెత్తిన ముంతడు నీళ్ళు పోయరాదా అమ్మా!'అని మూలుగుతూ వుంది.

సుపుత్రుడు ఊరిని సర్వే చేయడానికి బయలుదేరాలి. ఆలస్యాన్ని భరించ లేకుండా పోతున్నాడు. బాత్‌రూమ్ ఖాళీగా లేదు. తొందరగా తెమలమని చిందులు తొక్కుతున్నాడు !

ఇందరి మధ్య నేను !

వీళ్ళందరు కొందరు కాలేజీకి— కొందరు హైస్కూలుకు— కడపటిది 'కాన్వెంట్' కు వెళ్ళుతున్న వాళ్ళే ! ఏవో సెలవులు కాబట్టి అందరు ఇంట్లోనే వున్నారు. సెలవు రోజులు కాకుంటే ఉదయాన ఆ యింటి వాతావరణం మరీ జోరుగా వుంటుంది. 'నువ్వు ముందా? నేను ముందా?' అని పోటీలు పడతారు. స్నానాలు చేస్తారు. ఉన్నది అంతో యింతో తింటారు. నీట్‌గా ముస్తాబై వెళ్తారు. అక్కడ వాళ్ళేం నేర్పుతున్నారో? వీళ్ళేమి నేర్చుకుంటున్నారో? వాళ్ళకే తెలియాలికానీ— వీళ్ళందరు కలిసి నాకు మాత్రం ఓపిక నేర్పారు !

నేర్చుకున్న ఓపిక యిలాంటి సమయాల్లో చాలా అక్కరకు వస్తూ వుంది.

"ఓ జిల్లా అధికారి నీ మొగుణ్ణి ఆహ్వానించాడంటే ఏమనుకున్నావ్ ?" అని అర్థాంగి ముందర దర్జాగా ఓ పోజుపెట్టి — ఆ దర్జాతోనే ఓ ప్యాంటును షర్టును 'చెంబిస్త్రీ' చేయించుకొని, అంతకంటే దర్జాగాధరించి, అద్దమ్ముందు నిలబడి సర్దుబాట్లు సరిచేసుకొని ఆ తరువాత ... ఆ తరువాత ఆమెవైపు తిరిగి—ఆమెవైపు తిరిగి, ఆ తరుణంలో అంతకంటే, అడుగు ముందుకు వెయ్యలేక ముసి ముసి నవ్వులతోనే ముచ్చట తీర్చుకొని బయలుదేరుదామన్న భావానికి బాధగా స్వస్తి చెప్పాను !

ఆరుమంది బిడ్డలతో అసలే సతమతమై పోతున్న సతీమతల్లిని మరింత సాధించడం యిష్టంలేక అయిష్టంగానే పండ్యాడిన దవడల్లా తయారైన పాతపెట్టెలో నుండి ఓ ప్యాంటు షర్టును తీసి నాకు నేనే 'చెంబిస్త్రీ' కార్యక్రమాన్ని నెత్తిన వేసుకొన్నాను. 'ఓయబ్బో ! ఈ వేళేదో వాన వచ్చేటట్లుగానే ఉంది !' అని సతీమణిగారి దగ్గరనుండి సాధింపు మాటలు వినిపిస్తున్నాయి. లెక్కచేయడానికి నాకు తీరికెక్కడిది? జిల్లా అధికారి సందర్శనానికి వెళ్లాలిగా మరి!

ఇంటిలో నుండి వీధిలో పడ్డాను !

కార్లల్లో మనుష్యులు. సైకిళ్ల మీద మనుష్యులు. రిక్షాల్లో మనుష్యులు. నడుస్తూ మనుష్యులు. వస్తూపోతూ వీధి నిండుకు మనుష్యులు. నాలుగు చినుకులు రాలితే పుట్టలో నుండి బయటపడిన ఈసుళ్ళలా మనుష్యులు. ఏదోకొళ్ళ బోతున్నట్లు కోరికల గుర్రాలమీద పరుగులు తీస్తున్నారు. వీళ్ళల్లో నేనూ ఒక్కణ్ణి ! అయినా 'ఛీఛీ! ఏంమనుష్యులో ?' అని అనుకొంటూనే చాలా జాగ్రత్తగా నడిచాను — బస్టాండు చేరుకోవడానికి !

బస్సుస్టాండు చేరుకున్నాను.

నీరెండలో నిగనిగలాడుతున్నాయి బస్సులు. అవి పులుముకున్న ఎరుపురంగు అవి

సాధిస్తున్న విస్తవానికి సంకేతమా ? లేక వాటి జోలికి పోతే ఎదుర్కోవలసిన అపాయానికి అర్థమా? అంతుపట్టడంలేదు.

అక్కడా మనుష్యులే !

బస్సులో ఎక్కుతూ మనుష్యులు. బస్సులో దిగుతూ మనుష్యులు. బయలుదేరుతున్న బస్సుల్ని వెంటాడుతూ మనుష్యులు. బస్సుల్ని ప్రదక్షిణంచేస్తూ మనుష్యులు. బస్సుకోసం ఎదురుచూస్తూ మనుష్యులు. ఎటుచూచినా మనుష్యులే !

నిలబడడానికి చోటులేదు బస్సుస్టాండులో! బస్సుల్లో ఎక్కడానికి వీలుపడడంలేదు తొక్కులాటల్లో !!

ఇలాంటి పరిస్థితిలో యిరుక్కొన్న అనేకానేకమంది ప్రయాణీకుల్లో నేనూ ఒక్కణ్ణి !

నిలబడి నేను ఎక్కవలసిన బస్సుకోసం ఎదురుచూస్తున్నాను.

"వానలు కురవలేదంటున్నారు. కరువు కాటకాలతో కిటకిటలాడుతూ ఉన్నామంటారు. తాగడానికి నీళ్ళులేవంటారు. మరి రైళ్ళల్లో చూడు. బస్సుల్లో చూడు. కూర్చొను తావు దొరకడం లేదు. ఎక్కడున్నారో ? యేమో ? యింతమంది జనం ? వచ్చేపొయ్యేవాళ్ళకు నిలికేలేదు." అని వాపోతున్నాడు ప్రక్కన నిలబడి వున్న ఓ ప్రయాణికుడు.

నిజమేనేమో అనిపించింది

అంతలోనే నేను ఎక్కవలసిన బస్సు వచ్చింది.

బస్సు ఎక్కాను.

ఎక్కాననడం కంటే ఆ తొక్కులాట మధ్య తగులుకొంటే వాళ్ళే నెట్టి నెట్టి లోపలికి నెట్టేశారనడం సముచితంగా వుంటుంది.

ఓ సీట్లో అతి ప్రయాస మీద కూలబడ్డాను.

చెంబ్రిస్తే గుడ్డలవైపు చూసే సరికి కళ్ళల్లో నీళ్ళు తిరిగినంత పని అయింది.

వాటి రూపు రేఖలు పోల్చుకోలేనంతగా మారాయి. కొదువకు భుజంమీద చొక్కా కాస్త చిగిలింది.

నా అదృష్టాన్ని గురించి విచారపడుతూ— ఈ గొర్రె మందల్ని గురించి తలపోసుకొంటుంటే బస్సు జిల్లా కేంద్రంలో అడుగు పెట్టింది. హైరోడ్డుమీద అతి జాగ్రత్తగా నడిచింది. ఆ తరువాత హుందాగా బస్సు స్టాండులో నిలబడింది. బస్సులో ఎక్కడానికి ఎంత ప్రయాస పడవలసి వచ్చిందో దిగడానికి అంత యిబ్బంది పడవలసి వచ్చింది !

బస్సు దిగాను.

ప్రయాణపు బడలిక కాదుకానీ బస్సు ఎక్కి దిగేసరికి తల ప్రాణం తోకకే వచ్చింది. ఆ ప్రాణాన్ని మరలా తలకే చేరవేయాలంటే గొంతులో కాస్త కాఫీ పోయవలెననిపించింది.

బస్సుస్టాండ్ ప్రక్కనే వున్న ఓ హోటల్లో అడుగు పెట్టాను.

అక్కడా మనుష్యులే !

నిలబడడానికి కూడా తావులేనంత రద్దీ! ఒక్కొక్క కుర్చీ వెనుక ఇద్దరు ముగ్గురు క్యూలో నిలబడి వున్నారు. కిరసనాయిలు కోసం క్యూ. చక్కెర కోసం క్యూ. బ్రదుకులో నిత్యావసర వస్తువులు కొనడానికి 'క్యూ' బాధలు తప్పకుండా వుంటే తినడానికి కూడా క్యూ! అందులో ఒకడు తింటూంటే వెనుక నిలబడిన ముగ్గురి ఆకలి చూపులు తింటున్నవాడి మీద. ఆ దృశ్యం కనుల ముందు మెదులుతూంటే ఒళ్ళు జలదరించింది. ఈ నవనాగరిక సమాజంలో మనం సాధించిన సభ్యతమీద లేచిన పుండులా వుంది ఆ దృశ్యం. ఒంటపట్టించుకోలేక కాఫీ తాగడానికి తాత్కాలికంగా వాయిదా వేసి బయట పడ్డాను.

"చక్కెర కిలో రెండు రూపాయలు అమ్మినపుడు చూశాను. నాలుగు రూపాయలు అమ్మినపుడు చూశాను. ఆరు రూపాయలు అమ్మినపుడు గమనించాను. పది రూపాయలు అమ్ముతున్నప్పుడు చూస్తూనే ఉన్నాను. ధర పెరిగేకొద్దీ హోటల్లో రద్దీ కూడా పెరుగుతావుందే కానీ తరగడం లేదే? ఎక్కడున్నారో? యేమో? ఈ జనం ! వాళ్ళ చేతికి ఎట్లా వస్తావుందో? యేమో ? ఈ డబ్బు !"

'హోటల్లో కాస్త రద్దీ తగ్గితే వెళ్ళవచ్చులే!' అని హోటలు ముందు ఓపిగ్గా ఎదురు చూస్తున్న గుంపులో ఓ మనిషి అంటున్నాడు.

'నిజమే! ఈ డబ్బు ఎక్కడుందో? యేమో? కొందరు నీళ్ళప్రాయంగా ఖర్చు పెడితే, కొందరు నీలిగిచస్తున్నారు.'

ఆలోచిస్తూ నడుస్తున్నాను.

వీధి— లారీలతో, బస్సులతో, కార్లతో, రిక్షాలతో, సైకిళ్ళతో, నడుస్తున్న మనుష్యులతో కిటకిటలాడిపోతూ వుంది.

"డబ్బెక్కడుందో?' అంటే చేతనైనవాడి చేతుల్లో ఉంటుంది. అంతకంటే చేతనైనవాడు ఎదురైతే వాడి చేతిలోనుండి వీడి చేతిలోకి మారుతుంది. ఇలానే చేతులు మారుతూ ఉంటుంది.

ఆలోచన నడకను మరిపించింది. జిల్లా అధికారి ఆఫీసులో అడుగు పెట్టాను.

అక్కడ ఆ ఆఫీసు జవాను ద్వారా నా రాకను ఆఫీసరుగారికి తెలియచేశాను.

లోనికి రమ్మన్నారు ఆఫీసర్ గారు.

వెళ్ళాను.

ఆయన నన్ను చూస్తూనే గౌరవ సూచకంగా పైకి లేచాడు. మర్యాద పూర్వకంగా రెండు చేతుల్ని జోడించాడు.



ఆయన చేస్తున్న మర్యాదలకు నా మనస్సు పులకించింది.

ఆ తరువాత ఆయన కూర్చుంటూ నాకూ ఒక కుర్చీ చూపించాడు కూర్చున్నాను.

"మీ లాంటి ఓ ప్రముఖ రచయితను కలుసుకోవడం నా అదృష్టంగా భావిస్తున్నాను. నేను ఈ జిల్లాకు వచ్చి కొంతకాలమే అయింది. మిమ్మల్ని కలుసుకొనే అవకాశం దొరకలేదు మీ రచనలద్వారా మిమ్మల్ని చాలా కాలంగా ఎరుగుదును. కానీ యిదే ప్రత్యక్ష పరిచయం. ఈ రోజు చాలా సుదినంగా భావిస్తున్నాను." ఆయన ఆ మాటలు అంటూంటే ఆయన మొగం ఆనందంతో వెలిగిపోతూ ఉంది.

సాయంకాలం పూట మా వీధిలో యింటింటి వీధిగుమ్మం చూడముచ్చటగా ఉంటుంది. వచ్చేపొయ్యేవాళ్లని చూడాలనో, వీధిగాలి పీల్చాలనో ఆడవాళ్ళు గుమ్మాల్లో కూర్చుని వయ్యారంగా గోడలకు వాలబడి ఉంటారు. వాళ్ళు కూడా అటు యిటు కదలరు. కనీసం పైట కూడా సర్దుకోరు ఈ ప్రముఖ రచయిత రాకను గమనించి. కానీ ఆఫీసరు మాత్రం అందలాలెక్కిస్తున్నాడు. ఆ సంగతి తలచుకొని ముసి ముసిగా నవ్వుకొన్నాను నాలో నేను. నా నవ్వు ఆఫీసరు గారికి మరింత హుషారు నిచ్చినట్లుంది.

"ఇంతకాలం మీరు కథారచయితలే అనుకొన్నాను. మొన్న టీవీలో మీ బుర్రకథ కార్యక్రమాన్ని, అంతకు మునుపు ఎప్పుడో రేడియోలో మీ నాటికను విన్నతరువాత మీ మీద మరింత గౌరవం పెరిగిపోయింది. మీ బహుముఖ ప్రజ్ఞకు నా జోహార్లు!"

పొగిడించుకోవడం సరదాగానే ఉంటుంది. మరీ ఆ పొగడ్తలు అగడ్తలు దాటుతూంటే కాస్త యిబ్బంది పడవలసి వస్తుంది. అలాంటి యిబ్బందిలో పడ్డాను నేను. ఆఫీసరుగారు అదేమీ పట్టించుకొన్నట్లు లేదు.

"అరవై నాలుగు లలితకళల్లో సాహిత్యము, సంగీతము, చిత్రలేఖనం, నాట్యము ప్రముఖ స్థానాన్ని వహిస్తాయి. ప్రయత్నంతో అన్నింటినీ సాధించవచ్చునంటారు కొందరు. నేను దీనితో ఏకీభవించను ఇవన్నీ పూర్వజన్మ సుకృతాలంటాను నేను. మీరేమంటారు?"

ఓ నవ్వు నవ్వి ఊరకున్నాను.

"అరె! యిది మరీ చిత్రంగా ఉందే! మీలాంటి రచయితల్ని కలవడమే అరుదు.



అలాంటి సందర్భాల్లో వినవలసిందే కానీ వినిపించడం అవివేకమే అవుతుంది అది అంతేలే! రచయితల గాలి సోకితే మాటలు రానివాళ్లకు కూడా మాటలు వచ్చేటట్లుగా ఉంది."

తాను చాలా చక్కగా మాట్లాడానన్న అభిప్రాయంతోనేమో హాయిగా నవ్వుకొంటున్నాడు.

"నన్ను రమ్మనమని తాకీదు పంపారు. వెందుకో చెప్పారు గాదు!" విషయం ఉట్టిపడేలా అడిగాను.

"అవునుగదా మరి! ఆ సంగతే మరచి పోయాము. చూడండి. ఇప్పుడు దేశం ఎదుర్కొంటున్న సమస్యలలో జనాభా సమస్య అతి ముఖ్యమైనది విపరీతంగా పెరిగి



## ముందడుగు

ఏ రంగంలోనూ
ముందడుగెయ్యలేని మనం
ఒక్క
పిటీబస్సుల్లోనే
ముందడుగెయ్యడం

— టి. ఎల్. కాంతారావు



పోతున్న జనాభాను అరికట్టాలంటే ప్రజల్ని మేలుకొలపాలి. ఒకప్పుడు మనం ముక్కోటి ఆంధ్రులమని మురిసిపోయాం. కానీ యిప్పుడంతకు రెట్టింపయ్యాము. ఇది యిలానే కొనసాగితే ఒకనాటికి ఈ భూమిమీద నిలబడడానికి చోటు కూడా ఉండదు!" గుక్క తిప్పుకోవడానికన్నట్లుగా కాసేపు ఆగాడు ఆఫీసర్.

నా యిల్లు— నా వీధి— బస్సుస్టాండ్— బస్సు— హోటల్— అన్నీ ఒక్కసారి నా కళ్ళ ముందు మెదిలాయి. ఆఫీసర్ చెప్పిన మాట వాస్తవమనిపిస్తూ వుంది.

"అందువల్ల ప్రభుత్వం ఆటా పాటా కార్యక్రమం ద్వారా పల్లెల్లో ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయ సంకల్పించింది. ఈ లాంటి కార్యక్రమాలకు మీ లాంటి రచయితల సహకారం అవసరం!"

ఆఫీసర్ చెబుతున్నాడు. ఇందులో నా సహకారం ఏ విధంగా వుంటుందో? అన్న ఆలోచనలో పడ్డాను నేను.

"మీరు కుటుంబ సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని ఓ చక్కని బుర్రకథ రాయాలి. మీరే స్వయంగా మీ దళంతో పల్లె పల్లెలా ఈ బుర్రకథ ప్రదర్శనలు యివ్వాలి దీనికి తగిన ప్రతిఫలం ప్రభుత్వం ఎలాగు మీకు ముట్టచెబుతుందనుకోండి!"

నేను చాలా సంతోషపడ్డాను— వచ్చే ప్రతిఫలం వేన్నీళ్ళకు చన్నీళ్ళు తోడయినట్లవుతుందని!

"ఇద్దరు లేక ముగ్గురు చాలు! అని అనుకొన్నాం మనం ఒకప్పుడు. ఇప్పుడు 'మే మిద్దరం—మాకిద్దరు!' అంటున్నాం. చైనావాడేమో 'మే మిద్దరం!—మాకొక్కరు!' అంటున్నాడు దీనిని దృష్టిలో పెట్టుకొంటే మంచిదనుకొంటాను!" ఆఫీసరు అన్నాడు.

'అలాగేనండి!' అన్నాను.

కృతజ్ఞతా పూర్వకంగా చేతులు జోడించి సెలవివ్వండి!' అని అడిగాను.

'కవిగారూ! మీరు మరోలా అనుకోకుంటే ఓ చిన్న విన్నపం!"

ఆఫీసరుగారి వినయ సంపత్తికి ముగ్ధుడనై ఆయన మొగంలోనికి అలానే చూస్తూ వుండిపోయాను.

"మీ కథన్నా—పాటన్నా— మా ఆవిడ చెవి కోసుకొంటుంది. మీ అభిమాన పాఠకురాలామె. అభిమాన రచయితను చూడాలని ఆమె కోరిక. ఈ పూట మీరు మా యింటికి భోజనానికి వస్తే ఆమె కోరిక తీరుతుంది. మా యిల్లు పావనమవుతుంది."

ఆ అర్హత నాకు వుందో లేదో కాని— కాదనలేక పోయాను.

ఇద్దరం కలిసి బయలుదేరాము.

'మే మిద్దరం! మాకు ఒక్కరు!' అన్న చైనావాడి నిర్ణయం చెవుల్లో గింగురులాడుతూ వుంది. నాయిల్లు నా కండ్లముందు మెదిలి నన్ను వెక్కిరిస్తూ ఉంది. చేతులు కాలిన తరువాత ఆకులుపట్టుకుని ప్రయోజన మేమిటని మనస్సు పశ్చాత్తాపపడుతూ ఉంది ఇలాంటి సిద్ధాంతాలతో ముందు జాగ్రత్తపడి ముచ్చటగా బతుకుతున్న వాళ్ళని తలంచుకొని మనసు ఈర్ష్యపడుతూ ఉంది.




## అనారోగ్యులు అభాగ్యులు

మీకు విశాలమైన ఛాతి, దృఢమైన శరీరం, మంచి తూనిక గలదా? లేకుంటే వెంటనే 'జీవన్‌టోన్' ఉపయోగించుట మంచిది. మీరు ఒక పౌండు జీవన్‌టోన్ కొన్నాంటే మీ శరీరం దృఢమై, తూనిక అధిక మగుటకు మేము గ్యారంటీ ఇవ్వగలము.

## ఆరోగ్యమే భాగ్యము

నిజమే ఆరోగ్యమే భాగ్యము. ఆరోగ్యం బాగా వున్నట్లయితే డబ్బును సంపాదించడం అసాధ్యమేమీ కాదు! లేకుంటే. . . జీవన్‌టోన్ సాధారణమైన వ్యక్తులకు వచ్చే వ్యాధులను ఇట్టే బాగుచేయుగలదు. మీరు మీ వయసుకన్న అధిక వయసుగలవారిలా గోచరిస్తున్నారా? అలాగైతే వెంటనే ఉపయోగించడం ప్రారంభించండి 'జీవన్‌టోన్'. మీకు తగినంత ఆరోగ్యం, దృఢకాయం, తూనిక సమకూరిన వెంటనే జీవన్‌టోన్ ఉపయోగించుట ఆపుచేయాలి.

కాగా దేహానికి బలం సమకూర్చడానికి, తూనిక అధికరించడానికి జీవన్‌టోన్‌లో కొన్ని విశేషమైన మూలికలు చేర్చబడి యున్నవి. కాని ఇందులో జంతువుల క్రొవ్వు చేర్చబడి యుండలేదు. స్పెషల్ జీవన్‌టోన్ పెద్ద సీసాలు అన్నిచోట్ల మంచిగా లభించగలవు. (వ్యాయామం అవసరం లేదు. ఒకవేళ ఇంతకుముందు అలవాటు వున్నట్లయితే కొనసాగించవచ్చు.) వెల : **454** గ్రాములు (1 పౌండు రు. **20/-**) ★ సెల్‌బాయిల్ మరియు సెల్ఫో పౌడర్ : వయసుకు వచ్చినవారికి మాత్రమే వెల : రు. **24-00** (ఉభయులకు) ★ స్కిన్ లిక్స్ : మొటిమలను తొలగించి మీ ముఖమును సుందరముగా తేజోవంతముగా నుంచును. వెల : రు. **20-00**. క్రిందిచోట్లయందు లభించగలవు :

వరంగల్ : ఆయుర్వేద రసాయనశాల, జె. పి. ఎన్. రోడ్డు ఆయుర్వేద మెడిసిన్ ఆయుర్వేద ఇన్‌గ్రిడియన్స్, ఎమ్. వి. రోడ్డు. మచిలీపట్నం : ఉమామహేశ్వర ఆయుర్వేదిక్ ఏజెన్సీస్, తెనాలి : గుడివాడ హనుమంతరావు & సన్స్. హైదరాబాద్ : సంపత్ & కం., పంజగుట్ట, జైరాం మెడికల్స్, కోటి, బ్యాంక్ రోడ్డు, వసంత్ మెడికల్‌స్టోర్స్, 4-4-293, బ్యాంక్‌రోడ్డు, మహేశ్ మెడికల్‌హాల్ క్లాక్ టవర్ ఎదుట, విష్ణు మెడికల్ హాల్, గుల్జార్‌హౌస్. ఇచ్ఛాపురం : జనతా మెడికల్‌స్టోర్స్. పర్లాకిమిడి : పి. ధర్మనారాయణమూర్తి & సన్స్. కాశీబుగ్గ : తంగుడు నారాయణమూర్తి. టెక్కలి : టి. ఎస్. ఎన్. మూర్తి. పార్వతీపురం : పద్మినీ మెడికల్ స్టోర్స్. పాలకొండ : సూర్య డ్రగ్ హౌస్. శ్రీకాకుళం : పట్నాల సత్యనారాయణ అండ్ సన్స్, పాలచెట్టు స్ట్రీట్. విజయనగరం : భట్నుల లింగప్రసాదరావ్ మైన్‌రోడ్డు. విశాఖపట్నం : నీలం & కం., ఎ.వి. ఎన్. కాలేజి రోడ్డు, డా. జె.ఎ. శాస్త్రి, సూర్యాబాగ్‌జంక్షన్. రాజమండ్రి : ఈశ్వరదాస్ & కం., జైహింద్ బిల్డింగ్. గుంటూరు : ఆంజనేయ మెడికల్స్, జిన్నా టవర్‌సమీపం. శ్రీ సత్యనారాయణ ఏజెన్సీస్. కాకినాడ : లక్ష్మీనారాయణ కంపెనీ. విజయవాడ : శ్రీ ధనలక్ష్మి మెడికల్‌స్టోర్స్, సూర్యా మెడికల్ స్టోర్స్, పార్క్‌రోడ్డు. అవకాపల్లి : కాసుమంచి అప్పలరాజు. మదనపల్లె : హయగ్రీవ షాప్, 10/75 నెహ్రూస్ట్రీట్. నెల్లూరు : కె. ఎస్. రావ్ & సన్స్, ట్రంక్‌రోడ్డు. సూర్యాపేట : కమర్షియల్‌సూర్య నివాస్ — 2 టవున్ పోలీస్‌స్టేషన్ ఎదుట. సికిందరాబాద్ : జ్యోతిమెడికల్‌హాల్ 28. ఎమ్. జి. రోడ్డు, డి. జె. పరేక్ & కంపెనీ, సుభాష్‌రోడ్డు. జుమ్మా మసీదు, శారదాస్టోర్స్, 3106 రాష్ట్రపతిరోడ్డు. కావలి : డా. మల్లేశ్వరరావ్, ఆర్.ఎమ్.పి. మెస్సర్స్ సుగుణ ఆయుర్వేద ఆలయం. రేపల్లె : రామకృష్ణ మెడికల్ అండ్ జనరల్ ఏజెన్సీస్, రైల్‌పేట. తాడేపల్లిగూడెం : కల్యాణరామ ఆయుర్వేద వైద్యశాల, మామిడివారిస్ట్రీట్, పోవర్ బ్రిడ్జి సమీపం. కందుకూరు : సుమిశెట్టి వెంకటేశ్వర్లు మెడికల్ స్టోర్స్. తిరుపతి : తరిగొండ మెడికల్స్, 247-బి, సరోజినిరోడ్డు. అనంతపురం : డి. సోమనాథశాస్త్రి, మునిసిపల్‌కాలని. రామచంద్రపురం : రూపా మెడికల్‌స్టోర్స్, మునిసిపల్ మార్కెట్టు, సుభాష్ రోడ్డు. అనంతపురం : కో-ఆపరేటివ్ సెంట్రల్ సొసైటీ లిడ్, రైల్వేస్టేషన్ సమీపం. పులివెందుల : శ్యామ్ మెడికల్ స్టోర్స్, మైన్‌బజార్. హిందూపురం : కె. ఆర్. భాస్కరయ్య & సన్స్, మైన్ బజార్. బాలాజీ మెడికల్ సెంటర్, మైన్‌బజార్. ఆదోని : కమలాపుర్ గోవిందశెట్టి, ఆర్. ఎమ్. పి. కమలాపుర్ నాగయ్యశెట్టి & సన్స్, కొత్తగూడెం : నరేంద్రుల శంకరయ్య & సన్స్. ధర్మవరం : శ్రీ నంజుండేశ్వర మెడికల్‌స్టోర్స్, మైన్‌బజార్. గుంతకల్లు : గోపాల్ మెడికల్‌స్టోర్స్. జంగారెడ్డిగూడెం : బేడ వెంకటరావ్. రాయదుర్గం : శ్రీ లక్ష్మీవెంకటేశ్ మెడికల్‌స్టోర్స్. తాడిపత్రి : కృష్ణ మెడికల్స్, మైన్‌రోడ్డు. గోరంట్ల : వెంకటేశ్వర మెడికల్ స్టోర్స్, హిందుపురం పోస్ట్. కర్నూలు : శ్రీ రామకృష్ణ మెడికల్‌హాల్, 52/19 బాస్టియన్‌రోడ్డు. గుత్తి : డి. ఆర్. రాజశెట్టి & సన్స్, మైన్ బజార్. పామిడి : ఎస్. సి. చిన్నప్పశెట్టి. కడప : శ్రీ సాయిరామ్ ఆయుర్వేదిక్ మెడికల్స్, 13/348 మనిరావ్‌స్ట్రీట్. గిద్దలూరు : ఎమ్. సాంబయ్యశాస్త్రి అండ్ సన్స్. అన్ని మెడికల్‌స్టోర్స్ అండ్ బుక్ సెల్లర్స్.

అధికృత విక్రయందార్లు : మెస్సర్స్ : బాలాజి కెమికల్ వర్క్స్, ఎ. పి. ఐ. ఇ. 5 వ రోడ్డు, బాలనగర్, హైదరాబాదు—37, ఫోన్ : 269490.

పై పేర్కొనబడిన తయారీలు మీ వూరియందు లభించవట్లయితే దయచేసి రు. 5—00 మాకు పంపిన మీకు వి. పి. పి. ద్వారా పంపగలము.

**మెసర్స్ : జీవన్‌టోన్ ప్రొడక్ట్స్,** పోస్టుబాక్స్ నెం. 880, 17/1, కేంబ్రిడ్జి రోడ్డు, అలుసూరు, *బెంగుళూరు-560 008.*

# మింగుడు పడని మెతుకులు

ఆఫీసరు గారింట్లో అడుగు పెట్టాము.

అడుగు పెట్టీ పెట్టడంతోటే "రాజ్యలక్ష్మీ!... రాజ్యలక్ష్మీ! యిలావచ్చి చూడు ఎవరు వచ్చారో?" అని అంటూంటే అతడు పొందుతున్న సంతృప్తి నన్ను సమ్మోహితుణ్ణి చేస్తూ ఉంది.

ఆమె రావడానికి ఓ అయిదు నిముషాలు పట్టింది!

ఆమెను చూస్తూ ఓ క్షణం కన్నార్పలేక పోయాను—నిండుచూలాలు.

నడువలేక నడుస్తూ ఉంది. ఆఫీసరుగారి మాటల్నిబట్టి నన్నెవరో ఓ ముఖ్యమైన వ్యక్తిగా భావించి ముసి ముసిగా నవ్వుతూ నమస్కరించింది. నేను ప్రతి నమస్కారం చేస్తూంటే 'ఎవ్వరనుకొన్నావ్? మీ అభిమాన రచయిత!' అని గర్వంగా పరిచయం చేస్తున్నాడు, అంతలోనే రకరకాల స్టైజుల్లో ఓ గుంపు యింట్లో జొరబడింది.

ఆఫీసరుగారి పరిచయం ఆ గుంపు మీదికి మళ్ళింది.

"వీళ్ళిద్దరు కాలేజీ—యిదో వీళ్ళిద్దరేమో హైస్కూలు—వీడేమో కాన్వెంట్! మా పిల్లలు!"

ఆకలివేళ. ఆదరాబాదరా అంతా అన్నంతిని మళ్ళీ వెళ్ళవలసిన అవసరమేమో! పిల్లలెవ్వరూ ఈ పరిచయాన్ని పెద్దగా పట్టించుకోలేదు

నేను యిబ్బందిగా నవ్వుముఖం పెట్టాను.

భోజనాల వద్ద కూర్చున్నాము.

మాటలకు చేతలకు మనువు కుదరకపోవడానికి కారణ మేమిటని మనసు మధన పడుతూ వుంది. ఆలోచిస్తున్న మనస్సు అన్నంమీద లగ్నం కావటం లేదు.

"కవిగారు సరిగా భోజనం చేయడంలేదు. మీ అభిమాన పాఠకురాలి చేతి వంటలు రుచించడం లేదా?"

అన్నాన్ని రసంతో కలుపుతున్నట్టుగా ఆఫీసర్ మాటల్ని నవ్వుతో కలిపాను.

"నా అభిమాన పాఠకురాలి చేతి వంటలు అద్భుతంగా వున్నాయి. మింగుడు పడంది మెతుకులు కాదు. ఇంతవరకు మీరు చెప్పిన సిద్ధాంతాలు!" అని అందామనుకొన్నాను. కానీ అనలేకపోయాను.

సీరియల్

# ఇంద్రసింహాసనం

**సి. ఆనందారామం**




"**అ**క్కడికి తానే మహానుభావుడయినట్లు ఇంద్రుణ్ణి దుయ్యబడతాడు. ఇతడి బండారం తెలియనిదెవరికి ?"

"కొడుకు మాత్రం, పోయి పోయి రాక్షస కన్యను ప్రేమించాడు. స్వర్గాన్నంతా రాక్షసుల వశం చేస్తాడేమో, తన ప్రేమకోసం."

"అమ్మా ! మీరలా ఊరుకుంటే లాభం లేదు. ఎలాగైనా నహుషుణ్ణి పదవీభ్రష్టుణ్ణి చెయ్యాలి. మళ్ళా మన ఇంద్రుల వారిని సింహాసనం మీద కూచోపెట్టాలి."

ముఖంలో ఏ భావమూ కనపడనీయకుండా వారి మాటలన్నీ విన్న ఇంద్రాణి చాలా అనాసక్తంగా "మీరంతా లేకుండా నేనేం చెయ్యగలను ?" అంది ఇంద్రాణి. ఆ మాత్రం అన్నందుకే ఆ ఇద్దరూ పొంగిపోయారు. ఇదివరలో ఇంద్రాణినీ, జయంతుణ్ణీ తాము విమర్శించిన సంగతి విస్మరించినందుకు స్థిమితపడ్డారు.

"ఎంతమాట! ఎంతమాట! మేమెప్పుడూ మీ అడుగుజాడలలో ఉండేవాళ్ళమే ! మీరు నిప్పుల్లో దూకమంటే, దూకుతాం !"

వినయం ఉట్టిపడుతోంది వాళ్ళ కంఠాలలో.

"ప్రస్తుతం నహుషుడి దుష్కృత్యాలు ముల్లోకాలలో ప్రచారం చెయ్యాలి. అది ముఖ్యం."

"అదెంతపని ? మేము అతడికి చాలా సన్నిహితంగా మసిలేవాళ్ళం కదా ! అతడి లోపాలు మాకు తెలిసినట్లు మరెవరికి తెలుస్తాయి ?" అన్నాడు చిత్రకేతుడు.

"కానీ, ఒక్కోసారి బాహాటంగా అతడి రహస్యాలు బయట పెట్టేసామనుకోండి. ఆ తరువాత మళ్ళీ మమ్మల్ని నమ్ముతాడా ? నమ్మకపోతే భయంలేదనుకోండి ! కానీ, ఆ తరువాత, అతని రహస్యాలు మనం తెలుసుకొనేదెలాగ ?" సందేహిస్తూ అన్నాడు విచిత్రరథుడు.

"నీ అసలు సందేహం నాకు తెలుసులే !" అన్నట్లు నవ్వింది ఇంద్రాణి.

"మీరు బాహాటంగా నహుషుడి రహస్యాలు బయట పెట్టక్కర్లేదు. ఎవరైనా నమ్మకస్తుల ద్వారా, ఆ రహస్యాలు ఎప్పటికప్పుడు మా మేనకకు అందజేయండి. ఆ తరువాత విషయాలు మేనక చూసుకొంటుంది."

ఇద్దరి ముఖాలూ వికసించాయి అప్పటికప్పుడు. నహుషుణ్ణి బాహాటంగా ధిక్కరించవలసిన అవసరం తప్పిపోయినందుకు ఇద్దరూ గుండెలమీద నుంచి ఏదో పెద్ద బరువు దింపినట్లు స్థిమితపడ్డారు.

"ఇకమీదట చూడండి, నహుషుడి వ్యవహారాలన్నీ ఎప్పటికప్పుడు మేనకాదేవిగారికందచేస్తాం !" అన్నారు. వంగివంగి నమస్కారాలు చేసి వెళ్ళిపోయారు.

"ఛీ ! పదవీ వ్యామోహంతో ఎంతకు దిగజారిపోతున్నారు. వీళ్ళకసలు నైతిక విలువలు వుండవా ?" అని తనలో తాను చీదరించుకొంది ఇంద్రాణి. తన అవసరం తీరిపోగానే, వాళ్ళనెంత దూరంలో వుంచాలో కూడా అప్పుడే నిర్ణయించుకొంది. "మేనకాదేవిగారు"—అని వాళ్ళు పరమ భక్తితో అన్న తీరు గుర్తు చేసుకొని తనలో తను నవ్వుకొంది.

చిత్రకేత, విచిత్ర రథులిద్దరూ తమ మాట నిలబెట్టుకున్నారు. నహుషుడి పెద్ద



చిత్రాన్.GLC.6-2315 TL






**జరిగినకథ – 8 :** వృషపర్వపురానికి చెందిన రాక్షసరాజు వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ అందం, తెలివితేటలు, ధైర్య సాహసాలు కల రాకుమారి. ఆమె, మానవ రాకుమారుడు యయాతి ఇరువురూ ఒకరినివిడిచి ఒకరు వుండలేనంత గాఢంగా ప్రేమించు కొంటారు. యయాతిని కలుసుకొని తమ నగరంపై దేవతల దండయాత్ర ఆపించమని శర్మిష్ఠను వృషపర్వుడు ఆజ్ఞాపిస్తాడు. తమ అనుబంధానికీ, రాజకీయాలకూ తండ్రి ముడి పెట్టడం ఇష్టంలేకపోయినా యయాతిని కలుసుకోవచ్చుననేభావం ఆమెకు ఆనందం కల్గిస్తుంది. ఇంద్రుడు చేసిన ఘోరాలను సహించలేక సప్తఋషులు అతన్ని పదవీచ్యుతుని గావించి, ఆ స్థానంలో యయాతి తండ్రి నహుషుడ్ని నియమిస్తారు. ఆతన్ని ఎలాగయినా దింపేసి మళ్లీ ఇంద్రుడ్ని ఆ స్థానంలో నిలబెట్టాలని ఇంద్రాణి శచీదేవి ఆలోచిస్తూం టుంది. ఆమెకు నారదుడు సహాయపడతాడు. అతడు నహుషుణ్ని రెచ్చగొట్టి, అగ్ని, వాయు, వరుణ, నిరృతులలో పరస్పర కలహాలూ, అధికార దాహమూ రగిలేటట్లు ప్రవర్తిస్తాడు. యయాతీ, శర్మిష్ఠలను ఒకటిగా చేస్తుంది ఇంద్రాణి. మహేంద్రుని ఆజ్ఞను ధిక్కరించాడనే నెపంతో జయంతుని యమలోకానికి పంపిస్తాడు నహుషుడు. తనకు అనుకూలుడైన వాడిని యముడి స్థానంలోఉంచి, తన కొడుకును నిర్దోషిగా నిర్ణయించేటట్టు చేస్తాడు నహుషుడు. దీనిని ముల్లోకాల ప్రజలందరూ ప్రతిఘటించ డంతో జయంతుణ్నికూడా విడుదలచేయక తప్పలేదు. జయంతుడు భూలోకంలో విమానాల తయారీకి పూనుకొంటాడు శత్రువర్గంతో చేతులు కలిపి, శుక్రాచార్యుల తపసు భంగం కాకుండా అడ్డుపడిందని ఇంద్రాణిని సభకు రప్పించి, విచారణ జరిపించి అపకీర్తి పాలపు తాడు నహుషుడు. స్వర్గంలో వుండలేక భూలోకానికి వచ్చేస్తాడు యయాతి. దేవయాని దాస్యం నుండి శర్మిష్ఠను విడిపించాలనే ఉద్దేశ్యంతో దేవయానిని వివాహమాడతాడు యయాతి కాని అతని ఆలోచనలు తల్లక్రిందు లవుతాయి.

కొడుకు యతి, కొందరు గంధర్వ కన్యలతో కలిసి తిరుగుతున్నాడు – స్వర్గంలోనూ, భూలోకంలోనూ ఒకటే నీతి– స్వర్గంలో అప్సరసలతోనూ, భూలోకంలో వేశ్యలతోనూ ఎవరెలా తిరిగినా దోషంలేదు–కానీ, కన్యలతో యధేచ్ఛగా తిరగటం దోషం – రహస్యంగా ఆలాతిరగటం ప్రతిష్ఠకు ఎంతో భంగకరం.

యతి ఏ గంధర్వకన్యలతో, ఎప్పుడు, ఏ రహస్య ప్రదేశంలో ఎంతకాలం గడిపాడో, పూర్తి వివరాలతో, మేనక కందించేవారు చిత్రకేత, విచిత్ర రధులు మేనక తన నృత్యగానాలతో ఆ విశేషాలన్నీ విడ్డూరంగా లోకాలన్నింటిలోను వ్యాపింపచేసేది. అతి రహస్యం బట్టబయలైంది. నహుషుడు ఉడికిపోతున్నాడు. యతిని పిలిపించాడు. యతి ఏమాత్రం సిగ్గుపడకుండా ధైర్యంగా తండ్రిముందుకు వచ్చాడు.

"ఏమిటి నువ్వు చేస్తున్నపని ? వింత నీచానికి దిగజారిపోయావ్ ?''

"నేను చేసినపనా ? ఇందులో వింత ఏముంది ? ఈ స్వర్గంలో ఎవరైనా చేసేది అదేగా! అసలు స్వర్గానికిరావాలని ఉవ్విళ్ళూరేది ఇందుకేగా! నేను నీచానికి దిగజారానంటారా? పదవికోసమో, లేక ప్రేమకోసమో, పరలోకరి ఇల్లారిచుట్టూ ప్రదక్షిణలు చేయటంకంటే నీచమా, ఇది ?''

''యతీ ! ఎంతపైకెగిరి పోతున్నావ్ ? నాతర్వాత నిన్ను అధికారంలోకి రానియ్యను.''

''ఈస్వర్గ సింహాసనం ఎవరికీ వారసత్వంగా వచ్చేదికాదు నీ పుణ్యకాలం కాస్తాగడిచి పోయాక, ఇంద్రసింహాసనంమీద ఎవరుంటారో, ఎవరూ చెప్పలేరు. అధికారం ఉన్నంతవరకే, ఆనందాలు జుర్రుకోవాలి !'' అతినిర్లక్ష్యంగా వెళ్ళిపోయాడు యతి.

నహుషుడు లోలోపల ఎంతగా రగిలి పోయినా నిర్లక్ష్యంగా తనను ఎదిరించే యతిని ఏమీ చెయ్యలేకపోయాడు. చిత్రకేత విచిత్రరధులు మరోరహస్యంబయటపెట్టారు. యతి ఘంటాకర్ణుడితోనూ అతడి అనుచరులయిన పిశాచాలతోనూ లావాదేవీలు పెంచు కొన్నాడు. అతని విలాసాలకు కావలసిన ధనం వాళ్ళు సమకూరుస్తున్నారు. ఎప్పటిలాగే ఈ విషయాన్ని కూడా మేనక తన నృత్య గానాలతో అన్ని లోకాలకూ వ్యాపింపచేసింది. లోకాలు విస్తుపోయాయి. ఏమిటీ దేవతలు? ధనరాసులు పోగులు పోసు కున్న ఒక దిక్పాలకుడు ఎందుకైనామంచిదని కాబోలు, పిశాచాన్ని తన అనుచరుడిగా పెటు

# ఇప్పుడు 20 పై. తగ్గింపుతో అందుకోండి

## ట్రిలో

ట్రిలోతో వచ్చే నురుగు ఎక్కువ—గనక మీరు మరెన్నో బట్టల్ని ఉతికే వీలు. మరే యితర డిటర్జెంట్ బిళ్ళతో కన్నా మరింత ఎక్కువగా!

ట్రిలో ఎంతో బాగా శుభ్రపరుస్తుంది—బాగా మురికి పట్టేసిన మీ బట్టల్ని కూడా శుభ్రపరచగల శక్తిగలది యిది. దీంట్లోనే గల నీలిమందు మీ బట్టల్ని మరింత తెల్లగా, బాగా రూపొందిస్తుంది.

ట్రిలో మరెంతో కాలం మన్నుతుంది—ఇది ముద్దగా అయిపోదు. దీన్ని పూర్తిగా అరిగిపోయేదాకా వాడేవీలు.






ఇప్పుడే కొని చూడండి—త్రివిధ చర్యగల ట్రిలో ఎంత ఎంతెంత మేలైనదో!

గోద్రెజ్
ఉత్పాదన

CHAITRA-G-144 TEL

కొన్నాడు. దిక్పాలకుల కందరికీ అధిపతి అయిన ఇంద్రపదవిలో ఉన్న నహుషుడి కుమారుడు, ఆ పిశాచాలతో సంబంధాలు పెంచుకుని ఆ సంపదతో స్వర్గంలోవిలాసాలు అనుభవిస్తున్నాడు! అన్ని లోకాలలోనూ, నహుషుడి పట్లా, అతడి సంతానం పట్లా విరక్తి ప్రబలిపోయింది. కొన్ని లోపాలున్నా వెనుకటి ఇంద్రుడే మేలు అనుకోసాగారు, అందరూ.

## 19

శర్మిష్ఠ జాడ తెలుసుకోవాలంటే దేవయానిపట్ల ప్రేమ నటించటం తప్ప మరోమార్గం లేదనుకొన్నాడు, యయాతి. కానీ, అతి కొద్దికాలంలోనే, తాను నటిస్తున్న దానికంటే దేవయాని ఎక్కువగా నటిస్తున్న దనీ అతనికి తెలిసిపోయింది. ఆమె కళ్ళల్లో తమపట్ల ప్రేమగాని, లాలసకాని, కనీసం గౌరవం కానీ ఎప్పుడూ కనపడవు, తనను చూస్తుంది కాని తనను చూస్తున్నట్లుం డదు. తనను దాటి మరెక్కడో, ఏ దిగంతాల లోనో ఉన్న దేన్నో వెతుక్కొంటున్నట్లుగా ఉంటాయి ఆమె చూపులు. తన కౌగిలిలో



వున్నా, తనకందని ఏ దూరాలలోనో ఉన్నట్లు ఉంటుంది. ఒక్కొక్కసారి నవ్వుతుంది. తన పాదాల దగ్గిర పూజచేసే భక్తుణ్ణి చూసి దేవి అనుగ్రహించినట్లు నవ్వుతుంది అలాంటి వ్యక్తిని తన ప్రేమతో, కాదు— తన ప్రేమ నటనతో,ఎలా లొంగదీసుకోవాలో యయాతికి అర్థం కావటం లేదు. ఈ స్థితిలోనే వారికి యదువు, తుర్వసువు మొదలైన సంతానం కూడా కలిగింది. ఏమిటీ సృష్టి విచిత్రం? స్త్రీపైన పురుషుడికి ప్రేమలేదు. పురుషుడి పైన స్త్రీకి ప్రేమ లేదు. అయినా వారిద్దరూ సంసార జీవితం సాగిస్తున్నారు, సంతాన్ని పొందుతున్నారు.

"ఛీ! పశువుకీ, మనిషికీ భేదం లేకుండా చేసేని, ఇలాంటి విషయాలే!" అనుకున్నాడు యయాతి. రానురాను అతడికి దేవయాని పట్ల విరక్తి కలగసాగింది. దేవయాని మంది రానికి తాను పోకపోతే, ఆమె ఏమైనా నొచ్చు కుంటుందేమోనని కొన్నాళ్ళు సందేహించాడు. కానీ తను రాకపోవటం ఆమెను విషాదాన్ని కాక, ఒక విధమైన విముక్తినే కలిగించిందని ఆమె హావభావాలనుబట్టి అర్థంచేసుకొన్నాడు. ఈ కపట నాటకం ఇంక ముగించాలను కొన్నాడు. కానీ, శర్మిష్ఠ జాడ తనకు ఎలా తెలుస్తుంది? తనపై ప్రేమ లేనపుడు దేవయానికి శర్మిష్ఠపైన అంత ఈర్ష్య దేనికి? శర్మిష్ఠ ఎక్కడ వుందో దేవయానిని అడగాలని అనేకసార్లు అనిపించింది. అంతలో ఏదో అంతర్వాణి ప్రేరణతో దానివల్ల మేలు జరగదనిపించి అడగటం మానుకొన్నాడు.

ఈలోగా నహుషుడిపైనా, అతడి కుటుంబంపైనా ప్రజలలో ప్రబలిన విరక్తి యయాతికి కూడా సోకసాగింది. అతడు ఎక్కడికి వెళ్ళినా ప్రజలు గౌరవాదరాలు చూపటానికి మారుగా, కొద్దిపాటి తిరస్కా రంతో చూడసాగారు.

స్వర్గంలో జరుగుతున్న సంగతులు ఎప్పటి కప్పుడు యయాతికితెలుస్తున్నాయి. తన అన్న యతి, భూలోకానికి రాకుండా, రాజ్యాధి కారాన్ని కోరకుండా స్వర్గంలోనే ఉన్నాడు. విలాసజీవితాన్ని రెండుచేతులా జుర్రుకోవాలని

(60 వ పేజీ చూడండి)

# హైదరాబాద్ నోట్ బుక్

—తిరుమల రామచంద్ర

## మలేషియా మహాసభలు

ఇల్లు కట్టిచూడు, పెళ్లిచేసి చూడు— అన్నది పాత సామెత. సభనిర్వహించి చూడు—అనేదికూడా ఆ సామెతకు చేర్చాలి. ఏప్రిల్ 14 నుంచి 18వరకు ఐదు రోజులపాటు మలేషియా రాజధాని కౌలాలంపూర్‌లో జరిగిన ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలను దీనికి ఉదాహరణగా పేర్కొనవచ్చు. మలేషియా సుందర సంపన్న దేశం. చాలా పెద్ద హోటళ్లు హోటల్ జయపురిలోను మరి కొన్నిహోటళ్లలోను ప్రధాన సమావేశాలు, ప్రతినిధులను విడిది ఏర్పాటు చేశారు. కాని, మలేషియా ఆంధ్ర సంఘం మొదటే ప్రతినిధులు పరిమితంగా వస్తేనే వసతి కల్పించగలమని పదేపదే ప్రకటించినా, ప్రతినిధుల సంఖ్య దాదాపు వేయి కావడం వల్ల, వసతి కల్పించలేక అంచెలంచెలుగా ప్రతినిధులను కౌలాలంపూర్‌కు పంపడం, వారు కూడా వెంటనే తగిన వసతి లేక, విమానాశ్రయంలోను, ఒకహోటల్ ముందు ఆరు బయట పడుకోడం, ప్రాత రశనానికి ప్రతినిధులకు ఇవ్వవలసిన చెరి మూడున్నర మలేషియా డాలర్ల మొత్తం ఇవ్వక పోవడం, విహార యాత్రకు ఏర్పాటయిన బస్సులు అందరికీ అందుబాటులో లేకపోవడం, ట్రావెల్ ఏజెంట్లు, తక్కినవారు ప్రతినిధులను తరతమ భావంతో చూడడం వంటి అనాహూతాలు జరిగినా మొత్తంమీద మహాసభలు విజయవంతంగా జరిగాయనే చెప్పవచ్చు. మలేషియా తెలుగు వారు— వంద సంవత్సరాలకుపైగా తమ భాషా సంస్కృతులను కాపాడుకొంటున్న మలేషియా తెలుగు వారు స్వదేశాన్ని దర్శించి తనిసినంత పరమానందం పొందారు. ఈ సభలకు వచ్చిన వారిని చూచి, వారి ప్రసంగాలు పరిశోధన పత్రాలు విని, 14వ తేదీన ప్రారంభోత్సవం డాక్టర్ బాలమురళీకృష్ణ ప్రార్థనతో ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రి శ్రీ టి. అంజయ్య జరిపారు. మలేషియా ఉప ప్రధాని డాక్టర్ మహాదీర్ మహమ్మద్ విచ్చేశారు. చర్చా గోష్ఠులు 15 నుంచి నాలుగు రోజులపాటు మూడు స్థలాలలో రెండు దఫాలుగా జరిగాయి. మొత్తం 45 వ్యాసాలు చదువబడ్డాయి. వాటిలో మలేషియా తెలుగు వారివి 13. మంత్రి శ్రీ అగిశం వీరప్ప ప్రారంభోత్సవం జరిపారు. 15న సాంస్కృతిక ప్రదర్శనకు ముఖ్య మంత్రి శ్రీ టి. అంజయ్య ప్రారంభోత్సవం జరిపారు. ఆంధ్రప్రదేశ్ విధాన సభ సభాపతి శ్రీ కోన ప్రభాకరరావు అధ్యక్షత వహించారు. ఈ ప్రదర్శనం భారతమలేషియాలకు, ముఖ్యంగా ఆంధ్ర మలేషియాలకుగల సంబంధాలు తెలియజేసింది. దీనిలోని కొన్ని కళాఖండాలను కౌలాలంపూర్‌లోని మ్యూజియం నగరాలో [ప్రభుత్వ మ్యూజియంలో] స్థిరంగా ఉంచడానికి కూడా ఏర్పాట్లు జరుపాలని మలేషియా ఆంధ్రసంఘం నిర్ణయించింది. 15న ఉదయం సివిక్ సెంటర్‌లో ప్రతినిధుల సమావేశమై పరస్పరం పరిచయం చేసుకొన్నారు. 16 మధ్యాహ్నం చిరస్మరణీయమైనది· ముఖ్య మంత్రి మరి కొందరు కౌలాపెరాక్ వెళ్లారు. ఈ పట్టణం ఆంధ్ర సంఘం పుట్టిన స్థలి. 17వ తేదీ మలేషియా ఆంధ్ర సంఘ రజతోత్సవం జరగడం విశేషం. ఆంధ్రప్రదేశ్ అవతరణతోపాటు ఈ సంఘం ఆవిర్భవించింది. రజతోత్సవాన్ని మలేషియా ఉప మంత్రి దాతుక్ కె. పద్మనాభన్ ప్రారంభోత్సవం జరుపుతూ మలేషియా వివిధ సంస్కృతులు, మతాలసామరస్యానికి పేరు పొందినదని, ఏ భాషయినా మతమయినా దేశ సమైక్యానికి ప్రతిబంధకం కాకుండా వృద్ధి చెందాలని అన్నారు. ఈ సందర్భంలో మలేషియా ఆంధ్ర ప్రముఖులను ఆంధ్ర ప్రభుత్వం దుశ్శాలువలతోను, మెమెంటోలతోను సత్కరించింది. ప్రత్యేక సంచిక కూడా ఆవిష్కరించారు. 18వ తేదీ ముగింపు సమావేశానికి ముఖ్య అతిథిగా వచ్చిన కార్మిక నాయకుడు డాక్టర్ పి. పి. నారాయణన్ మలేషియా ఆంధ్ర సంఘం కృషిని, ఆంధ్రప్రదేశ్ కళాకారుల ప్రతిభను కొనియాడారు. అధ్యక్షత వహించిన శ్రీ భాట్టం శ్రీరామమూర్తి తెలుగు దేశంలోని సాంకేతిక విద్యాలయాలలో మలేషియా ఆంధ్రులకు ఇతోధికంగా స్థానాలు కేటాయిస్తామని హామీ యిచ్చారు. విదేశాలలోని భారతీయులను ఏకం చేయడానికి తొలిసారిగా ప్రయత్నించినవాడు నేతాజీసుభాష్‌చంద్రబోసుగనుక, ఆయన పేరు ఒక సాంస్కృతిక సంస్థను నెలకొల్పాలని శ్రీ కోన ప్రభాకరరావు సూచించారు. వచ్చే ప్రపంచ తెలుగు మహాసభలు మారిషస్‌లో జరగాలని మారిషస్ ప్రతినిధి శ్రీ బాల అచ్చన్న ప్రకటించారు. 16వ తేదీన డాక్టర్ దాశరథి అధ్యక్షతన జరిగిన కవి సమ్మేళనం స్థానికులను గిలిగింతలు పెట్టింది. 14వతేదీ రాత్రి మలేషియా ఆంధ్ర సంఘం "మాలం మలేషియా" [మలేషియా రాత్రి] శీర్షిక కింద జానపద నృత్య సంగీత కార్యక్రమం జరిపారు. నాలుగు రోజులవరుసగా శంకరాభరణం, భక్త కన్నప్ప, జీవన జ్యోతి, భక్త తుకారాం చలన చిత్రాలు, విచ్చైనలు [ఎ. ఆర్. కృష్ణ బృందం] మవసత్త్వాలు [పివీ ఆర్టిస్ట్ అసోసియేషన్] కృష్ణతులాభారం (జమునబృందం) నాటకాలు ప్రదర్శించబడ్డాయి. కుమారి రాణి కౌసల్య, శ్రీమతి ఉమా భారతి, కుమారి శోభా నాయుడు, శ్రీ రాజా, శ్రీమతి రాధారెడ్డి, బేబీ గీత శ్రీ నృత్యాలు ప్రదర్శించారు. శ్రీ విశ్వనాథ భాగవతార్ హరికథ, శ్రీ పి. రామ సుబ్బారెడ్డి ఏక పాత్రాభినయం, శోభానాయుడు నృత్యం, బేబీ గీతశ్రీ [ఐదేళ్లపాప] నృత్యం ప్రేక్షకులను విశేషంగా ఆకర్షించాయి. డాక్టర్ బాల మురళీకృష్ణ, శోభానాయుడు, యావత్ప్రపంచానికే చెందిన కళాకారులుగా ప్రశంస పొందారు. మహాసభలో 936 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. వీరిలో నమోదు చేసుకొన్నవారు 896 మంది, నమోదుచేసుకోనివారు 40మంది. మొత్తం ప్రతినిధులలో ఆంధ్ర ప్రదేశ్‌నుంచి 806, తమిళనాడు—33, కర్నాటక—10 మహారాష్ట్ర—15, న్యూఢిల్లీ—6, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్—21, మధ్యప్రదేశ్, బీహార్, చెరి ఒకరు, ఇతర రాష్ట్ర ప్రతినిధులు మొత్తం 88. విదేశాల నుంచి: మారిషస్—12, యు.ఎస్.ఎ.—1, సింగపూర్—15, ఇండోనీషియా, ఫిజీ—12. మొత్తం—40. సభలకి పాల్గొన్న ఆంధ్రప్రదేశ్ మంత్రులు—9, ప్రతిపక్ష నాయకులు—9, సభాపతులు—3, మాజీ మంత్రులు—3, విధాన సభ్యులు 9, పార్లమెంటు సభ్యులు—7, న్యాయమూర్తులు 3, విశ్వవిద్యాలయోపాధ్యక్షులు—5, సెక్రెటరీలు, డైరెక్టర్లు—7. మహాసభలలో జరిగిన అవకతవకలను గురించి ఆంధ్రప్రదేశ్ విధాన సభలో ఏప్రిల్ 29న చర్చలు జరిగాయి. పలువురు పలు విధాలుగా మాట్లాడి, అవకతవకలకు కారణం ట్రావెల్ ఏజెంటేనని ముక్తాయింపుచేశారు. మహాసభలలో పాల్గొన్న ఆంధ్రప్రదేశ్, భారతీయ ప్రతినిధులను గురించి కొంత చెప్పాలి. వారిలో అత్యధికులు విదేశంలో ఉన్నామన్న చైతన్యం లేక ఇష్టం వచ్చినట్లు ప్రసంగించారని, ప్రవర్తించారని నా అభిప్రాయం.

నా వరకు నేను మనం పాశ్చాత్య దేశాలతోనే కాదు, మలేషియా వంటి చిన్న దేశంతో కూడా ఏ విషయంలోను [మలేభాష మొన్నటి వరకు జానపద స్థాయిని దాటలేదు. నేడు విశ్వవిద్యాలయాలలో ఉన్నతవిద్యకు కూడా మాధ్యమం. మనది ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్. ఇంకా జిల్లా స్థాయి ప్రభుత్వ భాషగాను ఎదగలేదు] పోటీ చేయలేమనే భయంతో, జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ గనుక, ఉడుతా భక్తిగా జన్మ దేశాన్ని ముందుకు తేవాలనే సంకల్పంతో తిరిగి వచ్చాను. ఏమైనా, విదేశాలలోని ఆంధ్రులలో భావ సమైక్యం కోసం అహర్నిశలు కృషి చేసి ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు జరిపించిన అంతర్జాతీయ తెలుగు సంస్థ అధ్యక్షుడు శ్రీ మండలి వెంకట కృష్ణారావు మనః పూర్వకంగా అభినందించక తప్పదు.

**ఉప శాంతి :**

మనం ఎప్పటికైనా మలేషియా, సింగపూర్ స్థాయి కన్నా రాగలమా సార్? — అనడిగాను ప్రతిపక్ష నాయకుడు శ్రీ గౌతు లచ్చన్నగారిని. ఇప్పటి తరమంతా మటుమాయమైపోతే, వచ్చే తరంలో బాగుపడవచ్చు —అన్నారు ఆయన చప్పరిస్తూ. ●

ప్రేయసి
మెచ్చిన చీరే మరి చీర




★ 100% పాలియెస్టర్— • లా-ఇంటిమేట్ • మొనాలి • ఈవ్స్ బ్యూటీ ★ టెరిఫిల్ షిఫాన్ ★ వైకాట్-2
★ సిల్కోసా ★ టెరీసిల్క్ ★ టెక్సాఫిల్ ★ సిల్కినా

Navnit/45 81/telugu

సీరియల్

# రాగబంధాలు

వేమకోటి సీతారామ శాస్త్రి

(గత సంచిక తరువాయి)

**ఆ** సాయంకాలం గెస్ట్‌హౌస్ అంతా చాలా హడావుడిగా వుంది. ఖరీదయిన కార్లు ఆ ఆవరణలో చోటు చేసుకున్నాయి. కంపెనీ సిబ్బంది అంతా హడావుడిగా తిరుగుతున్నారు. హరిప్రసాద్‌గారు ద్వారం దగ్గర ఎదురుచూస్తూ నిల్చున్నారు.

అప్పుడే ఆగిన ఇంఫాలా కారులో నుండీ రాంబాబు, అతని తల్లీ, తండ్రి దిగారు. హరిప్రసాద్‌గారు ఆ ముగ్గుర్నీ దగ్గరుండి స్వయంగా ఆహ్వానించి, సాదరంగా, ఎయిర్ కండిషన్డ్ మినీ మీటింగ్ హాల్లోకి తీసుకువచ్చారు. అక్కడ వుండే మనుష్యుల్ని చూసి రాంబాబు ఆశ్చర్యపోయాడు. పట్నంలో వుండే పెద్ద పెద్ద వ్యాపారస్థులు, ఆఫీసర్లు ముఖ్యమైనవాళ్ళు వచ్చి అందంగా అమర్చబడిన సోఫాల్లో కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు.

రాంబాబు సామాన్యమైన దుస్తులతోనే వచ్చాడు. మధ్య సోఫాలో కూర్చున్నారు. కొంత మంది తెలియనివాళ్ళు ఆ కూర్చున్న వాళ్ళలో వున్నారు. తమ సోఫాకు ప్రక్కనే యింకొక సోఫాలో కూర్చున్న సత్యమూర్తిని చూడగానే రాంబాబు ముఖం వికసించింది.

"ఎప్పుడొచ్చారు! కులాసాగా వున్నారా!" అడిగాడు ఆప్యాయంగా.

"నిన్న సాయంకాలం వచ్చాం. కబురు అందడంతో" అన్నాడు సత్యమూర్తి కరచాలనం చేస్తూ.

"మీకు లలిత కలిసిందా" అడిగాడు మెల్లగా.

"ఆఁ చూసాను. ఈ పెళ్లి చూపులు నిశ్చితార్థం తనదే నన్నంత సంబరంతో, మా నీరజను వదలటంలేదు. అన్నట్లు ఈ మధ్య మీకు ప్రమోషన్ వచ్చిందని విన్నాను. కంగ్రాచ్యులేషన్స్" అభినందిస్తూ సత్యమూర్తి,

"థాంక్యూ" అన్నాడు రాంబాబు. అతని కళ్ళు లలితగానీ, నీరజగానీ కనిపిస్తుందేమోనని వెతుకుతున్నాయి. తను ఉదయం లలిత ఇంటికి వెడితే నీరజతో వెళ్లిందని పెద్దమ్మగారు చెప్పింది.

"నమస్కారం బావగారూ. నేను గుర్తున్నానా!" అంది నవ్వుతూ శాంతి లోపల్నుండి బయటకు వస్తూ.

"భలేవాళ్లే మీరు జ్ఞాపకం వుండకపోవడమేమిటి ?" అన్నాడు నవ్వి.

"యేమే శాంతి ! మగవాళ్లలో తీరిగ్గా కూర్చుని తర్వాత మాట్లాడుదువుగానీ, ముందు లోపలకు వెళ్లి ఆ యేర్పాట్లని స్వయంగా చూడ్డూ, యెంత పనివాళ్లున్నా మన పని మనం శ్రద్ధతో చూసుకోవాలి తల్లీ" అందొక వయసు మళ్ళినావిడ. ఆవిడ జరీ అంచు పట్టుచీర కట్టుకుని వుంది.

"ఈమె మా అమ్మగారు. ఈయనే నీరజకు కాబోయే భర్త" శాంతి పరస్పరం పరిచయం చేసింది.

"నమస్కారమండీ" అన్నాడు, రాంబాబు లేచి. తర్వాత తన తల్లిదండ్రులను పరిచయం చేసాడు. అతని మనసు నీరజ తల్లిదండ్రులను చూడాలని తహ తహ లాడుతోంది. శాంతి తల్లి, రాంబాబు వినయానికి యెంతో పొంగిపోయింది.

"చాలా సంతోషం నాయనా ! మా నీరజకు తగిన భర్త దొరికావు" అంటూ లోపలికి వెళ్లి పోయింది హడావుడిగా.

హరిప్రసాద్‌గారు లోపలనుండి బయటకు వచ్చేసరికి అందరూ నిశ్శబ్దమైపోయారు. ఆయన వెంట ట్రేలో స్వీట్లు కాఫీలతో లలిత, శాంతి వెంటరాగా మెరుపు తీగలా అలంకరించుకుని, ఆకుపచ్చని ధర్మవరం పట్టుచీరలో అప్సరసలా వచ్చి రాంబాబు ప్రక్కన సోఫాలో కూర్చుంది నీరజ.

"ఎటెన్షన్ ప్లీజ్! లేడీస్ అండ్ జంటిల్‌మేన్! ఈ రోజు నా జీవితంలో మరపురాని రోజు. తండ్రిగా నా బాధ్యతలు నేను తీర్చుకుంటున్నానన్న తృప్తి ఈ రోజే నాకు కలిగింది. నా ఏకైక పుత్రిక నీరజను వ్యాపారదక్షుడు, అనుభవజ్ఞులు, ఈనాడు ఈ కంపెనీ మూడు పువ్వులూ, ఆరు కాయలుగా అభివృద్ధి చెందడానికి కారకులు శ్రీ దశరధరామయ్యగారబ్బాయి రాంబాబుకు యివ్వడానికి నిశ్చయించుకున్నాం కాబట్టి మీరు వారిని ఆశీర్వదించాలని కోరుచున్నాను" అన్నారు హరిప్రసాద్, దశరధరామయ్యగారికి వెండి పళ్లెంలో నిశ్చయ తాంబూలం, కొత్తబట్టలు అందిస్తూ.

అవి స్వీకరిస్తూనే ఆశ్చర్యపోయారు వృద్ధ దంపతులు. బీద యువతిగా నటించిన నీరజ ఒక కోటీశ్వరుడి కూతురుగా వారు వూహించనేలేదు. రాంబాబు పరిస్థితి సరేసరి. వాస్తవానికి నీరజమీద కొంచెం కోపం వచ్చింది.

**జరిగిన కథ–12 :** ఆ ఆఫీస్‌లో కొత్తగా స్టెనో కమ్ క్లర్క్‌గా జాయిన్ అవుతుంది మిస్ నీరజ. మేనేజర్ శివకుమార్ ఆమెపై ఒక ప్రత్యేకమైన అభిమానాన్ని చూపిస్తుంటాడు. అక్కడే గుమాస్తాగిరి చేస్తున్న రాంబాబు దయనీయమైన పరిస్థితిని చూసిన నీరజ అతనికి ఆర్థిక సహాయం చేస్తుంది. ఓనాడు బస్సులో పరిచయమైన లలిత ఇంట్లో ఓ రూములో వుంటుంటుంది నీరజ. నీరజను ప్రేమిస్తున్నాననీ, ఆమె బాధ్యతలను తను స్వీకరిస్తాననీ, పెళ్లి చేసుకుంటాననీ శివకుమార్ ఆమెను అడుగగా, నీరజ కొంత టైం కోరుతుంది. జీవితంలో చావుదెబ్బ తిన్న తన స్నేహితురాలు పద్మ గత చరిత్ర గురించి నీరజతో చెప్తుంటుంది లలిత. తన మేనేజర్ సతీష్ పుట్టిన రోజునాడు అతను కోరిన కోర్కె – అతనితో సినిమా ప్రోగ్రాం, ఆ తరువాత అతని ఇంట్లో భోజనం చేయటానికి అంగీకరించుతుంది పద్మ. సతీష్‌ను నమ్మి అతనికి తన సర్వస్వమూ అర్పించుకొంటుంది పద్మ. ఫలితంగా గర్భవతౌతుంది. ఆమెకు తెలియకుండా సతీష్ ఎబార్షన్ చేయిస్తాడు. తరువాత అతని నిజస్వరూపం తెలుసుకొని కుమిలిపోతుంది. సతీష్ ఆమెను ఉద్యోగంలోంచి తీసివేస్తాడు. ఇప్పుడు మరో ఉద్యోగం సంపాదించుకొని గత జీవితాన్ని మరిచిపోవటానికి ప్రయత్నిస్తుంటుంది పద్మ. అజ్ఞాతంగా 'బాబు' అన్న పేరుతో రచనలు చేస్తున్న రాంబాబు తన గత జీవిత చరిత్ర గురించి లలిత, నీరజలకు చెప్తుంటాడు. శివకుమార్ తండ్రి రమణయ్య దశరథరామయ్యగారి కుటుంబాన్ని సర్వనాశనం చేస్తాడు. దశరథరామయ్యగారి సహాయం పొందిన ఒకాయన ఇప్పించిన ఉద్యోగంలో చేర్తాడు, రాంబాబు. అక్కడికి శివకుమార్ మేనేజర్‌గా వచ్చి అతనిని నానా హింసలు పెడ్తుంటాడు. రాంబాబు పరిస్థితుల ప్రభావానికి తలవొగ్గి తన కుటుంబాన్ని అలానే నెట్టుకొస్తుంటాడు... రాంబాబు దయనీయమైన గత జీవితాన్ని తెలుసుకొన్న ఆ రోజు చాలా మంచిరోజుగా భావిస్తారు లలిత, నీరజలు. మూడు రోజులు శెలవులు కలసిరాగా లలిత, నీరజ, రాంబాబు ముగ్గురూ కలిసి నీరజ పిన్నిగారి వూరు వెళతారు. ఆ పిన్ని కూతురు శాంతి, కొడుకు సత్యమూర్తి. ఓ పసిపిల్ల ప్రాణం కాపాడబోయి తన కాలు పోగొట్టుకొన్న సత్యమూర్తిని అంతవరకూ గాఢంగా ప్రేమించిన సునంద అతన్ని కాదని తండ్రి కుదిర్చిన సంబంధమే చేసుకొంటుంది. సత్యమూర్తి ఆ జ్ఞాపకాలను మర్చిపోలేక అలా పర్ణశాలలో నిర్జీవంగా బ్రతుకుతూంటాడు. తన జీవితంలో ప్రవేశించి, తన జీవితాన్ని కాంతిమయం చేయమని లలితను సత్యమూర్తి ప్రాధేయపూర్వకంగా అడుగుతాడు. ఆమె అంగీకరించుతుంది. లోగడ చెప్పిన పద్మ కథ లలితదేనని తెలుసుకొన్న నీరజ మనసు వేదనకు గురవుతుంది. శెలవులయిపోవడంతో ఆ ముగ్గురు తిరుగుముఖం పడతారు. రాంబాబున్ని వివాహమాడ నిశ్చయించుకొన్నట్లు నీరజ లలితతో చెప్తుంది. శివకుమార్ నీరజను రేప్ చేయబోగా అడ్డుపడి ఆమెను రక్షిస్తాడు రాంబాబు. బొంబాయిలో ఓ స్త్రీని హత్యచేసిన శివకుమార్‌ను అరెస్టు చేస్తారు. శివకుమార్ స్థానంలో రాంబాబును నియమిస్తారు ఛైర్‌మెన్ హరిప్రసాద్‌రావుగారు. తన కుమార్తెను పెళ్లిచేసుకోమని ఆయన రాంబాబు నడుగగా అతను నీరజను తప్పితే మరొకరిని చేసుకోనని చెప్తాడు. తమ ఆఫీస్‌లో అమ్మాయే కాబట్టి ఆమె పెళ్లి తన చేతులమీదగా చేయటానికి నిర్ణయించుకొంటాడు హరిప్రసాద్‌రావ్.

"నీరజ మీ కూతురా!" అన్నారు దశరథ రామయ్యగారు ఆశ్చర్యపోతూ.

"అవును నా కూతురే. నాతో పందెం వేసి తనే గెల్చింది. మీరు ముందు ఫలహారాలు స్వీకరించండి చెబుతాను" అన్నారు.

రాంబాబు నీరజ వేపు కొంచెం కోపంగా చూసాడు. క్షమించమని కళ్లతోనే అర్థించింది నీరజ. అంతా కాఫీలు త్రాగుతున్న సమయంలో హరిప్రసాద్ ప్రారంభించారు.

*　　　*　　　*

నీరజ వొక్కగానొక్క కూతురు కోటీశ్వరుడు హరిప్రసాద్‌గార్కి. బియ్యే చదివి, మరి చదువుమీద ఆశక్తి లేక చదువు మానేసింది. సరదాగా టైపు, షార్టుహేండు గూడా నేర్చుకుంది. వీణ గూడా కొంత వాళ్ల పిన్ని దగ్గర, కొంత సంగీతం మాష్టారు దగ్గర నేర్చుకుంది. కలవాళ్ల పుత్రికేమో! యే చీకూ, చింతా లేకుండా హాయిగా పుస్తకాలు, సినిమాలు చూస్తూ కాలం గడిపేది. మంచి ఉత్తమ గ్రంథాలు యెన్నో చదివింది. ఆమె జీవితంమీద, కొన్ని నిర్దుష్టమైన ఆశయాలూ, అభిప్రాయాలు ఏర్పరుచుకుంది. ఉత్తమ సాహిత్యం ఆమె చుట్టు మంచి స్నేహితులుగా అల్లుకున్నారు.

తండ్రి ఎన్నో సంబంధాలు తీసుకువచ్చాడు. ఇందులో డాక్టరేట్లు పొందినవారు, విదేశాల్లో వున్నవారు, బిజినెస్ మాగ్నెట్లు, డాక్టర్లూ వున్నారు. కానీ నీరజ అందర్నీ తిరస్కరించేది. తండ్రి ఎప్పుడు వ్యాపారం పనిమీద బ్రాంచీలకు వెళ్లినా, నీరజకు బెడద తప్పేది కాదు. కూతురు అభిప్రాయాలు ఆయనకు బోధపడేవి కాదు.

ఒకనాడు హరిప్రసాద్‌గార్కి కొద్దిగా గుండె నొప్పి వచ్చింది. డాక్టర్లు మనస్సులో ఏం ఆలోచనలు పెట్టుకోకుండా, విశ్రాంతి తీసుకోమన్నారు.

ఎంతమంది నౌకర్లున్నా, తండ్రికి స్వయంగా కావల్సినవి చూసి ఆయనను ఆరోగ్యవంతునిగా తయారుచేసింది. తండ్రి ఇంట్లో వున్నా నీరజకు పెళ్లి ఫొటోల బెడద తప్పలేదు. ఒక పెళ్లిళ్ల పేరయ్య రెండు ఫొటోలు తీసుకువచ్చాడు. ఒకడు ఎమ్.డి. చేసిన డాక్టరు, వొకడు ఎమ్.ఇ. చదివిన ఇంజనీరు. కుర్రాళ్లిద్దరూ చాలా అందంగావున్నారు. కుటుంబ వివరాలూ, సాంప్రదాయాలూ అన్నీ నచ్చాయి. వాళ్ల కోరిక ఏమిటంటే పెళ్లవగానే అమెరికా పంపించాలట పై చదువులకు. అదే పేరయ్య మోసుకొచ్చిన కబురు.

హరిప్రసాద్‌గార్కి ఇద్దరూ నచ్చారు. ఎవర్నో వొకర్ని తప్పకుండా తన కూతురు వరిస్తుంది అన్న ఆశాభావం ఆయనలో కలిగింది.

నీరజ ఫొటోలుచూసింది. పెళ్లిళ్ల పేరయ్యను చూసింది. ఇంకెప్పుడూ, ఈ ఇంటికి రావద్దన్నట్లుగా వున్నాయా చూపులు. చేతిలో కాఫీకప్పు గజగజ వణికింది.

"నాకు నచ్చలేదు నాన్నగారూ" అని తన గదిలోకి వెళ్లిపోయింది.

ఈసారి నిజంగానే కోపం వచ్చింది కూతురి మీద. కూతురి గదిలోకి వెళ్లారు. సాధారణంగా ఎంతో పనివుంటేగానీ కూతురు గదిలోకి వెళ్లరు హరిప్రసాద్.

నీరజ ఆశ్చర్యపోయింది. నీరజ కెదురుగా కూర్చున్నారు. నీరజ చదువుతున్న పుస్తకం ఆపింది.

'చూడమ్మా ! పండిన పండు, ముసలివాడి జీవితం వొకటేనమ్మా. చిన్నప్పుడే మీ అమ్మ చనిపోవటంతో నామీద రెండు బాధ్యతలూ పడ్డాయి. నువ్వు చదువుకున్న దానివి. ఈ జీవితం రాలిపోక ముందే నా బాధ్యతలు నేను నిర్వహించానని తృప్తిగా చివరి ఊపిరి విడవడానికి అవకాశం ఇయ్యవా" అన్నారు గద్గదికంగా. నీరజ మనస్సు చలించిపోయింది. తండ్రి బాధను గమనించింది.

"నాన్నగారూ ! మన డబ్బు చూసి పెళ్లాడా లనుకునేవాళ్లు నాకు ఇష్టం లేదు నాన్నగారూ."

"అయితే మనం ధనికులుగా వుండటం తప్పా తల్లీ."

"తప్పు కాదు నాన్నగారు. ఈనాడు లోక వృత్తంలో చాలామంది యువకులు, ఈ కట్నాల రూపంలోనో, కానుకల రూపంలోనో ధనార్జనకు ఆకర్షితులయిపోతున్నారు. లేనివాళ్లు ఆశపడ్డారంటే కొంత ఫర్వాలేదు. గొప్ప చదువులు చదివినవారు గూడా ఈ దౌర్భాగ్య స్థితికి దిగజారిపోతున్నారు. సమాజంలో ఎంతోమంది యువతుల జీవితాలు, ఈ కృతంగా నాశనమైపోతున్నాయి" అంది ఆవేశంగా.

"అయితే నువ్వెవరినయినా ప్రేమించావా ?"



అడిగారు సంభాషణను సరియైన త్రోవకు తెస్తూ. నీరజ బుగ్గలు సిగ్గుతో ఎరుపెక్కాయి. లేదంటూ తల వూపింది.

"అయితే వివాహ విషయంలో నీ అభిప్రాయం ఏమిటి తల్లీ."

"నన్ను నన్నుగా ప్రేమించే వ్యక్తి కావాలి. అతను నా డబ్బును చూసి, నన్ను కోరకూడదు. అలాంటి వ్యక్తి మనకు దొరకగలరా నాన్నా" అడిగింది.

"నువ్వడిగిన లాంటి వ్యక్తి నవలల్లోనూ, సినిమాల్లోనూ మనకు గోచరిస్తారు తల్లీ. నిజ జీవితంలో దొరకటం కష్టం. దొరికినా అతనిమీద నమ్మకం మనకు ఎలా కుదురుతుంది తల్లీ !" ప్రశ్నించాడు.

హరిప్రసాద్‌కు తన కూతురు సినిమాల వల్ల ఇటీవలి కాలంలో దిగువ, ఎగువ మాధ్యమిక కుటుంబాలేకాక, అన్ని తరగతుల కుటుంబాల్ని ఆకర్షించే నవలల వల్ల జీవితంలో కొన్ని కొత్త ఆశలు, సాధించలేని ఆశయాలను ఏర్పరచుకుందని, వాటిని ఎలాగైనా లేకుండా చేయాలని సంకల్పించుకున్నారు.

"అందువలన నాన్నగారూ ! మీరు సహృదయంతో అనుమతిస్తే నాక్కావలసిన వ్యక్తిని నేనే ఎంచుకుంటాను" అంది నెమ్మదిగా, అదేదో సామాన్యమైన విషయంలా.

హరిప్రసాద్ స్థాణువైపోయాడు. తన భర్తను ఎంచుకోవడంలో ప్రతీ కన్యకు పూర్తి స్వేచ్ఛ వుంది. కానీ ఆమె ఎంచుకున్న భర్త పెళ్లయిన తరువాత, ఆమె అంచనాలు తల్లక్రిందుగ చేస్తే ... తర్వాత సంగతి ఏమిటి ? ఆఁ ఏమయినాసరే అల్లారు ముద్దుగా పెరిగిన కూతురికోరికను మన్నించాల్సిందే! తప్పదు.

"నీ కోరిక ప్రకారమే చెయ్యి తల్లీ" అన్నారు.

"అయితే నా కొక్క ఆరునెలలు గడువు ఇవ్వండి. ఈలోగా నాకు నేనుగా వెళ్లి ..." వాక్యం పూర్తికాలేదు.

"ఎక్కడికెడతావమ్మా ? ఇక్కడ వుండే ఆ అన్వేషణ సాగించవచ్చుగా. అందులోనూ ఒంటరిగా ఆడపిల్లవి ! ... " అన్నారు కొంచెం బాధగా.

"నా మీద మీకా నమ్మకం లేదా నాన్నగారూ!"

# రాగబంధితులు

"నమ్మకంలేక కాదు తల్లీ. అల్లారుముద్దుగా పెరిగినదానివి. బయట ప్రపంచం అంటే అంత బాగా తెలియనిదానివి ..." అంటూ కూతురు ప్రయాణానికి కొంత మెత్తబడ్డారు.

తండ్రి సుముఖతను గమనించి నీరజకు మరింత ఉత్సాహం వచ్చింది.

"అనుభవము, విచక్షణా జ్ఞానం ఇవే కొన్ని ప్రశ్నలకు సమాధానం చెబుతాయి నాన్నగారూ. ఈ అర్ధసంవత్సర కాలంలో నా అన్వేషణలో పరాజయం పొందితే, మీరు చూపిన ఏ సంబంధమయినా చేసుకుంటాను. రేపే నేను ప్రయాణ మవుతాను" అంది సంతోషంగా.

హరిప్రసాద్‌కు తను చిన్నప్పుడు చదివిన కాశీ మజిలీల కథలు గుర్తుకు వచ్చాయి. పూర్వకాలంలో మహారాజులు, చక్రవర్తులు, తమ కూతుళ్లకు కళ్యాణం చేసే పద్ధతులు జ్ఞాపకం వచ్చాయి.

"ఎక్కడికెడతావమ్మా" అడిగారు.

"ఇంకా నిర్ణయించుకోలేదండీ. ఇవాళ సాయంకాలంలోగా నిర్ణయించుకుని చెబుతాను" అంది.

హరిప్రసాద్ కొంచెం దీర్ఘంగా ఆలోచించారు. మెరుపులా చక్కని ఆలోచన తట్టింది.

"తెలియని ఊరు, ప్రదేశం వెళ్లి ఏం చేయగలవమ్మా. పోనీ నేనొక సలహా చెబుతాను వింటావా ?" అడిగారు.

"చెప్పండి నాన్నగారూ !"

"నీవు ఎక్కడో ఒకచోట వుండాలికదమ్మా. నీకుత్తరం ఇస్తాను. రంగనాధన్ వుండే మన బ్రాంచి ఆఫీసులో ఉద్యోగం చేస్తూ, నీ అన్వేషణ సాగించు" అన్నారు. ఆ సలహాలో ఆయనకు చీకటిలో ఆశాకిరణం కన్పించింది.

అక్కడ శివకుమార్ ఉన్నాడు. అందంగా, చక్కగా ఠీవిగా వుంటాడు. పైగా షేర్‌హోల్డరు. పైగా మంచి వ్యాపార దక్షుడు. ఇద్దరికీ ఈడూ, జోడూ బాగుంటుంది. తన కూతురు తప్పకుండా శివకుమార్‌ను వరించగలదన్న నమ్మకం ఆయన మనస్సులో కాంతి కిరణంలా చొచ్చుకుపోయింది. నీరజకుగూడా తండ్రి సలహా నచ్చింది. అంగీకారంగా తల వూపింది.

సర్వ భోగాలు, ఎయిర్ కండిషన్డు గదులు, పుస్తకాలు, సినిమాలు, కాలు కింద పెట్టడం ఎరగని నీరజ కేవలం, ఎంతో సామాన్యమైన బీద యువతిలా చిన్న లెదర్ సూట్‌కేసులో, నాలుగు నేత చీరలు పెట్టుకుని తన ప్రయాణానికి తయారవుతూంటే, హరిప్రసాద్‌గారికి కళ్లమ్మట నీరు వచ్చింది.

"కనీసం ఒక బంగారు చిన్న గొలుసయినా వేసుకో తల్లీ, మెడ బోసిగా వుండగూడదు" అన్న తండ్రి మాటను కాదనలేకపోయింది.

"ఇందమ్మా. ఈ డబ్బు గూడా వుంచుకో. ఎందుకయినా పనికి వస్తుంది" అంటూ పదివేల రూపాయలు నీరజ ముందు పెట్టారు.

నీరజ తండ్రివేపు, డబ్బువేపు చూసి ఒకసారి నవ్వింది.

"నాకెందు కింత డబ్బు నాన్నగారూ ! నా పాకెట్ మనీ నాలుగొందలు వుంది. అది చాలు" అంది. తర్వాత "నాన్నగారూ నా దొక్క కోరిక ... "

"ఏంటమ్మా."

"నేను ఫలానా అని మీరు ఎవ్వరికి చెప్పటం గానీ, రాయటంగానీ చేయగూడదు. చివరికి రంగనాధన్‌గారికి కూడా. ఆరునెలల కాలం అంత పెద్దదేం కాదు. నేను వారం రోజులకో ఉత్తరం నా క్షేమ వార్తలతో రాస్తాను. మీరు మాత్రం బెంగపెట్టుకోకండి" అంటూ తటాలున వంగి తండ్రికాళ్లకు నమస్కారం పెట్టింది.

సజల నయనాలతో హరిప్రసాద్, కూతుర్ని దగ్గరకు తీసుకుని "నీ ప్రయత్నం జయప్రదం కావాలని ఆశిస్తున్నాను తల్లీ" అంటూ చుబుకం ముద్దాడాడు.

* * *

కథలా చెప్పిన నీరజ స్వయంవరం గురించి విని, అందరూ ఆశ్చర్యపోయారు.

"అయితే నీరజ విషయంలో నా అంచనాలు తారుమారయ్యాయి. ఆ దౌర్భాగ్యుడు అంత గ్రంథ సాంగుడని నేననుకోలేదు. తర్వాత నిన్న సాయంకాలం చెప్పింది నీరజ తన జీవిత భాగస్వామి పేరు. నేను మొదట ఆశ్చర్యపోయాను. మా నీరజ కోరిక-సమంజసమే ననుకున్నాను. ఒకసారి మా శాంతి, నీరజ కోసం వస్తే, నీరజ సంగతి చెప్పాను. తర్వాత మా నీరజ రాంబాబుని ప్రేమిస్తున్నట్లు తెలిసి, ఒకనాడు చిన్న పరీక్ష పెట్టింది.

శాంతి చూపించిన డబ్బు, నగలు, ఇవన్నీ చూసి రాంబాబు చలించలేదు గదా స్త్రీ ధనం, కట్నం తీసుకోవటం విషయంలో తన అభిప్రాయాలు కుణ్ణంగా చెప్పాడు. ఆ సంగతి నీరజకు చెప్పి, ఆమె ప్రేమించిన వ్యక్తి చాలా ఉన్నతమయిన వాడని చెప్పింది" అన్నారు కాస్సేపాగి.

"నన్ను క్షమించండి బావగారూ" అంది శాంతి. రాంబాబు చిన్నగా నవ్వాడు.

మళ్లా హాల్లో డ్రింకులు పంచబడ్డాయి. వాతావరణం ఎంతో ప్రశాంతంగా వుంది. శ్రోత లందరూ ఎంతో కుతూహలంగా వింటున్నారు.

"నా కూతురు ఎంతగానో ప్రేమించిన








## అతడికి 3 నెలలు నిండాక, పాలు మాత్రమే ఇస్తే సరిపోదు

# మీ పాపాయికి కావలసినది ఫారెక్స్

## పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

**3 నెలల వయస్సు—ఘన ఆహారం ప్రారంభించవలసిన సమయం.**

3 నెలలు నిండాక, పాపాయి పెరిగే అవసరాలకు కేవలం పాలు మాత్రమే సరిపోవు. పాపాయి చురుకుగా, తొందరగా పెరుగుతూంటాడు. అంచేత కేవలం పాలు ఇవ్వగలిగే వాటికన్నా ఎక్కువ కాలరీలు అతడికి కావాలి. అంతేకాదు, పాలు తాగడాన్ని తగ్గించి హెచ్చు కాలరీలు ఇచ్చే ఘన ఆహారం అతడికి అవసరం. ఈ సమయంలోనే మీ పాపాయికి నమలడం అలవాటు కావాలి. అప్పుడే, తర్వాత "పెద్దలు తినే" ఆహారాలను చక్కగా నమిలి మింగగలుగుతాడు. పైగా, పాపాయికి ఇప్పుడు రుచి అనుభవం కూడా పెరుగుతూంటుంది. అంచేత, అతడికి కొత్త రుచుల్ని పరిచయం చెయ్యవలసిన సమయం ఇది.

**3 నెలల వయస్సు—మరింతగా ఐరన్ కావలసిన సమయం.**

"పాపాయికి ఘన ఆహారాలు ప్రారంభించేందుకు 2-4 నెలల మధ్య వయస్సు ఉత్తమమైనది. పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందువల్ల అది సంపూర్ణ ఆహారంకాదు. అందుకే పాపాయికి ఐరన్ గల ఘన ఆహారాలు కావాలి."

డాక్టర్ సుభాష్ సి. ఆర్య: "ఇన్‌ఫేంట్ అండ్ చైల్డ్ కేర్ ఫర్ ది ఇండియన్ మదర్."

**డాక్టర్లు ఫారెక్స్ ఎందుకు సిఫార్సు చేస్తారు?**

ఘన ఆహారాలు ప్రారంభించడం కోసం, ప్రత్యేకంగా తయారు చేయబడిన ఆహారం-ఫారెక్స్. మీ పాపాయి సున్నితమైన జీర్ణశక్తికి అనువుగా వుండేటట్లు ముందే పచనం చేయబడింది. ఫారెక్స్‌లో ఉన్నాయి—సత్వర పెరుగుదలకు ప్రొటీన్లు; శక్తి కోసం కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు; దృఢమైన ఎముకలు, గట్టి పళ్ల కోసం కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్లు; ఆరోగ్యవంతమైన రక్తం కోసం ఐరన్. వీటన్నిటి వల్లా ఫారెక్స్, పాపాయి సంపూర్ణమైన పెరుగుదలకు ఆదర్శవంతమైన ఘన ఆహారం.

**ఉచితం!** "పాపాయి మొదటి ఏడాది పుస్తకం" కొత్తగా తల్లులైన వారు పిల్లల పట్ల తీసుకోవలసిన శ్రద్ధ గురించి సులభ రీతిలో వివరిస్తుంది. మీ ప్రతి కోసం, 50 పైసల స్టాంపు జతపరుస్తూ ఈ క్రింది చిరునామాకు వ్రాయండి:

**పి. ఒ. బాక్స్ నం. 19119, (FAR 15 T), బొంబాయి 400 025.**






## డాక్టర్లు సిఫార్సు చేస్తారు ఫారెక్స్

## సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

CASGLF-10-244 Tel

రాంబాబుకు నేను ఒక చిన్న పరీక్ష పెట్టాను. తండ్రికి గూడా, కూతురు పెళ్లి విషయంలో బాధ్యత వుంది కదా. అందువలన నీరజ నా కూతురని తెలియకుండా, నా కూతుర్ని పెండ్లి చేసుకోమని మొత్తం ఆస్తి పెండ్లికి ముందే రాంబాబు పేర రిజిస్ట్రేషను చేస్తానని చెప్పాను. కానీ రాంబాబు లొంగలేదు. చివరకు నీరజ కోసం, తన కొచ్చిన ప్రమోషను గూడా వదులుకుని సామాన్య గుమస్తాగానయినా జీవిస్తానన్నాడు రాంబాబు. అప్పుడు నా హృదయం ఎంత ఆనంద మైందో! మా నీరజే గెలిచింది. నేనే ఓడిపోయాను'' అన్నారు నవ్వుతూ.

అలా నిశ్చితార్థం తతంగం ముగిసింది.

* * *

ఆకాశమంత పందిరి, భూదేవంత అరుగువేసి హరిప్రసాద్‌గారు నీరజ పెళ్లి, సత్యమూర్తి పెళ్లి ఎంతో ఆడంబరంగా చేసారు. ''నాకున్నదొక్క కూతురు పెండ్లి చాలా ఆడంబరంగానే చేస్తాను. నన్ను మన్నించాలి'' అని ముందే దశరథరామయ్య గారితో చెప్పారు. విందులూ, వినోదాలూ, వేడుకలు, చివరకు పట్నంలో బీదలకు అన్నదానం, నూతన వస్త్రదానం ఇవన్నీ జరిగాయి. ఇటీవలి కాలంలో ఇంత ఘనంగా ఎవ్వరూ పెండ్లిచేసి వుండలేరని ఆ మహా పట్టణమంతా చెప్పుకున్నారు. పెళ్లయిన వెంటనే గృహప్రవేశానికి సత్యమూర్తి, లలిత, శాంతి అందరూ వాళ్ల గ్రామానికి వెళ్లిపోయారు.

* * *

ఎయిర్ కండిషన్డు గది చక్కగా అలంకరించ బడివుంది. డబుల్ స్ప్రింగ్ కాట్‌మీద యూఫోమ్ రబ్బరు పరుపులు కన్పించకుండా, వాటినిండా మల్లెపూలు వొత్తుగా పరచబడివున్నాయి.

గదిలో వొక వారగా గాడ్రెజ్ టేబిల్, రివాల్వింగ్ కుర్చీలో శోభనపు పెళ్లికొడుకు రాంబాబు కూర్చుని ఏదో రాసుకుంటున్నాడు, దీక్షగా.

చేతిలో పాలగ్లాసుతో నవ వధువు నీరజ కోటి కోర్కెలు గుండె నిండా నింపుకుని, గదిలోకి ప్రవేశించింది. తెల్లని పాలమీగడ లాంటి జరీచీర కట్టుకుని అదే రంగు ఎర్రటి పువ్వులు గల పట్టు చోళీ వేసుకుని, చెవులకు ముత్యాల కర్ణాభరణాలతో, చేతులకు ముత్యాల గాజులతో మెరుపు తీగలా, అప్సరసలా వుంది.

రెండు క్షణాలు అలా నిలబడినా రాంబాబు పలకలేదు. నెమ్మదిగా టేబిలు వద్దకు వెళ్లింది. పాలగ్లాసు పెట్టింది. ఖరీదయిన ఫారిన్ సెంటు వాసనలు గదంతా వ్యాపించాయి. రాంబాబు నీరజను చూసి, తల తిప్పుకుని మళ్లా రాసుకుంటున్నాడు.

నెమ్మదిగా రివాల్వింగు చెయిర్ తనవేపు తిప్పుకుని ''కోపం వచ్చిందా'' అంది, గోముగా.

''లేదు. దేవిగారు ఇంకా ఏం పరీక్షలు పెడతారోనని సిద్ధంగా వున్నాను'' అన్నాడు రాంబాబు కృత్రిమ కోపంతో. నీరజ నయనాలు అశ్రుపూరితా లయినాయి.

''మీకేమయినా బాధకలిగితే నన్ను శిక్షించండి'' అంది.

# రాగబంధితులు

''అవును ఇంక శిక్ష వెయ్యక తప్పదు. ఈసారి వేసే శిక్ష, జీవితంలో మరిచిపోనంతగా వుంటుంది'' అంటూ ఆమెని కౌగిల్లోకి తీసుకున్నాడు, కన్నీరు తుడిచి.

తంపాలతలా అల్లుకుపోయింది నీరజ, రాంబాబు చుట్టూ. ఒక చేత్తో తను రాస్తున్న పుస్తకం, రెండో చేత్తో ఆమెను పొదివి పట్టుకుని మల్లెపూల మంచం దగ్గరకు తీసుకువెళ్లాడు.

''మా అమ్మ కొంగున కట్టమని ఈ బంగారం ఉంగరం ఇచ్చింది'' అంటూ కొంగున బంగారం ఉంగరం కట్టేడు, రాంబాబు నవ్వుతూ. నీరజ బుగ్గలు ఎరుపెక్కాయి.

''ఈ గదిలో గులాబీలు లేవనుకున్నాను. ఇక్కడ దాచుకున్నావా!'' అంటూ, గులాబీలా

పై వారమే!

రాగజ్వాల

చిట్టా రెడ్డి
సూర్యకుమారి

సీరియల్!

ఎరుపెక్కిన ఆమె బుగ్గలను రెండు చేతులతో దగ్గరకు తీసుకుని ముద్దు పెట్టుకున్నాడు.

సిగ్గుతో మల్లెమొగ్గ అయిపోయింది నీరజ ... ఆ పాల వెన్నెల లాంటి కాంతిలో.

''అవును ఏమిటీ పుస్తకం ... '' అంది చేతిలోకి తీసుకుంటూ. ముత్యాల కోవలో అచ్చులా వున్నాయి అక్షరాలు.

''దేవిగారికి ఇంకో ముఖ్యమైన కానుక. స్వీకరించి మాకు ఏదైన కానుక ఇవ్వండి ...'' అన్నాడు నవ్వి రాంబాబు.

నీరజ పేజీలు తిప్పి చూసింది.

''మన ప్రేమాయణం అంతా నవలగా రాసారా'' అంది ఆశ్చర్యంగా అతని కళ్లల్లోకి ఆరాధనా పూర్వకంగా చూస్తూ.

''అవును. రచయిత ఈ పాత్ర కథలో కానికి, సమాజానికీ ఏదో సందేశం ఇవ్వాలి కదా. అందు కోసం ప్రతీ ధనవంతుల కూతుళ్లు ఇలాగే తమ భర్తలను ఎంచుకునే అవకాశం వాళ్లకి ఇవ్వాలని వాళ్ల తల్లిదండ్రులకు సందేశం...'' అన్నాడు నవ్వి.

''ఇంకా పూర్తి కాలేదేం ... '' అంది ఆశ్చర్యంగా.

అది తొలిరాత్రి. నీరజ పాలగ్లాసుతో అడుగు పెట్టింది—అంతవరకే రాసివుంది నవలలో.

''మరి నా బహుమానం సంగతో ... ''

''కోరుకోండి'' అంది కీటిగా అతని కౌగిట్లో కరిగిపోతూ.

''ఇవాళ నుండి నీరే నేను. నేనే మీరు. మనిద్దరి మధ్యా భేదంలేదు చెప్పండి'' అంది గోముగా, అతని షర్టు గుండీ విప్పుతూ.

''ఇవాళ సమాజంలో ఎన్నో మార్పులు జరుగు తున్నాయి. రచయిత సమకాలీన సమాజాన్ని తన కథల్లోనూ, నవలల్లోనూ, గేయాల్లోనూ, సాహిత్యంకు చెందిన వివిధ ప్రక్రియల్లోనూ ప్రతిబింబిస్తున్నాడు. కొన్ని అవకాశాలు వచ్చినపుడు రచయిత అవి తన నిజ జీవితంలో గూడా అనుస రించాలి. ఏమంటావు ?''

''చెప్పండి. మధ్యలో ఆపేసారేం ... ''

''ఇవాళ దేశం ప్రగతి సాధిస్తూ, వెలుగు దీపాలలో కొత్తరూపం దిద్దుకుంటోంది. మన కోసం పాటుపడి లాభాలు తెస్తున్న మన కంపెనీ సిబ్బందిలో ప్రతీ ఒక్కర్ని మన కంపెనీలో భాగ స్వామ్యం ఇచ్చి వారి జీవితాలకు మార్గదర్శకుల మవుదాం ... '' అన్నాడు కొంచెం ఆవేశంతోనే.

నీరజ అతని కళ్లల్లోకి ఆరాధనా పూర్వకంగా చూసింది. రాంబాబు వింత తేజస్సుతో వెలుగు తున్నాడు. ఈ యుగసంధిలో జాతి నవచైతన్యానికి, సమతా వాదానికి స్వాగతం పలుకుతున్న మానవతా మూర్తిగా కనిపిస్తున్నాడు.

''అలాగే చేద్దాం. మా నాన్నగారు గూడా సంతోషంగా వొప్పుకుంటారు ... ''

''చాలా థాంక్సు నీరజా ... '' అన్నాడు ఎంతో ఆనందంగా.

''అవునూ, ఈ నవలకేం పేరు పెడు తున్నారు ... ''

''రాగబంధితులు'' అన్నాడు ఆమెను దగ్గరకు తీసుకుంటూ. ఆ సమయంలో—

ఆ నవ దంపతుల గుండెల్లో కోటి సన్నాయిలు మంగళప్రదమైన జీవితాన్ని ఆహ్వానిస్తూ వసంత రాగాల్ని ఆలపించాయి.

***(అయిపోయింది)***

## అంకితము

ఆప్త మిత్రులు, సాహిత్యాభిలాషులు డాక్టర్ సి. వి. రాజారెడ్డి, శ్రీమతి సి. ఇందిరా రాజారెడ్డిగార్లకు ఈ నవల అంకితమిస్తున్నాను.

— వేమకోటి సీతారామశాస్త్రి

# క్రొత్త సంసార్

## డిటర్జెంట్ ఉతికే పౌడర్

# "వ్యత్యాసమేమి?" పోటీలో పాల్గొనండి

అన్ని సమాధానములు సరిగ్గా ఉన్న మొదటి 15,000 ప్రవేశ పత్రాలకు విశేష డిస్కౌంట్ కూపన్‌లు లభిస్తాయి.

పాలిప్యాక్‌లో లభించే క్రొత్త సంసార్ డిటర్జెంట్ ఉతికే పౌడరు అమ్మకం ధర కే.జి కి రూ. 12.50 (పన్నులు అదనము). కాని 'ప్రత్యేక పరిచయాత్మకం' ద్వారా మీరు సంసార్‌ను రూ. 9.50 కే (పన్నులు అదనము) పొందవచ్చును. మీరు చేయవలసిందల్లా ఈ పోటీలో పాల్గొని డిస్కౌంట్ కూపన్‌ను పొందటమే! ఈ ఉత్తమ సంసార్ డిటర్జెంట్ మీ సొమ్ముకి సరిపడు గుణాన్ని కల్గివుందని మీరే నిర్ణయించండి.







ప్రత్యేక పరిచయాత్మకం:
1 కేజి ప్యాక్‌కి రూ. 9-50
ఈ పోటీలో పాల్గొనండి
విశేష డిస్కౌంట్ కూపన్‌ను గెలవండి.

క్రింది ప్రశ్నకు మీ సమాధానము వ్రాయండి.
సంసార్ పాలిప్యాక్ మీద ఎన్నిరంగులు కలవు ?

________________

పోటీ చాలా సులభం
ప్రవేశ రుసుము లేదు.

**Sansar** Ⓐ
DETERGENT WASHING POWDER
THE FAMILY ECONOMY PACK
MAXIMUM CONSUMER PRICE Rs 12.50 (LOCAL TAXES EXTRA)
1kg Net weight
MANUFACTURED BY KARNATAKA SOAPS AND DETERGENTS LIMITED BANGALORE 560 055

**Sansar** Ⓑ
DETERGENT WASHING POWDER
THE ECONOMY FAMILY PACK
MAXIMUM CONSUMER PRICE Rs 12.50 (LOCAL TAXES EXTRA)
1k Net weight
MANUFACTURED BY KARNATAKA SOAPS AND DETERGENTS LIMITED BANGALORE 560 055

పైన చూపిన రెండు ప్యాక్‌ల మధ్య 6 తేడాలు కలవు. ప్యాక్ 'ఎ' మాత్రమే సరియైన 'ప్యాక్. ప్యాక్ 'బి' మీద తప్పులను ఎంచి చుట్టూ వృత్తాకారం గీయండి. ఈ ప్రవేశ పత్రాన్ని కత్తిరించి, మీ పేరు మరియు విలాసమును ప్రత్యేక కాగితంమీద వ్రాసి క్రింద పేర్కొన్న చిరునామాకు పంపించండి.

'వ్యత్యాసమేమి' పోటీ, మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్
36, కన్నింగ్‌హ్యామ్ రోడ్డు, బెంగళూరు–560052.

న్యాయ నిర్ణతల తీర్పు తుదినిర్ణయము మరియు దీనికి సంబంధించిన ఏ విధమయిన ఉత్తర ప్రత్యుత్తరములకు అవకాశము ఇవ్వబడదు.
ప్రతి కుటుంబానికి ఒకే ప్రవేశ పత్రము.

త్వర పడండి
ఈ రోజే పాల్గొనండి.

ASVP

కర్నాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్, బెంగళూరు వారి ఒక నాణ్యమైన ఉత్పాదన.
మార్కెట్ చేయువారు: Ⓜ మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగళూరు

MCA-SDP-101 TEL

# తోడూ - నీడా





కామినేని కృష్ణకుమారి

హాస్పిటలంతా పేషెంట్సుతో నిండివుంది.

డాక్టర్ రత్నమాల ఒక్కొక్కరినే పరీక్షచేసి పంపుతోంది.

మామూలు పరీక్షకే పది రూపాయలు. ఇంటి వద్ద ఫీజు చెల్లించిన వారిని లోనికి తీసుకువెళ్ళి మరికాస్త శ్రద్ధగా పరీక్ష చేస్తోంది. మామూలు వాళ్ళకు మందులు రాసిచ్చి పంపుతోంది.

అరగంట నుండి లైన్‌లో నిలబడిన కమలకు కాళ్ళు లాక్కుపోతున్నాయి. కళ్ళు తిరుగుతున్నాయి. అతి కష్టంమీద గోడనాసరా చేసుకుని నిలబడింది. మరో అరగంటకు కాని డాక్టరు ముందు నిలబడ టానికి వీలుకాలేదు.

రత్నమాల కమలను క్రిందినుండి మీదివరకు పరీక్షగా చూసి "ఏమిటి జబ్బు" అంది.

కమల ఒకసారి రత్నమాల ముఖంలోకి చూసి తల దించుకుని "..................." చెప్పింది.

డాక్టరు విని ఆశ్చర్యంగా చూసింది. "అయితే నన్నేం చెయ్యమంటావ్ ?" అన్నట్లుగా వుందా చూపు.

"దయ చేసి నాకెలాగైనా ఈ భారాన్ని దించెయ్యండి డాక్టరుగారూ! మీకెంతయినా డబ్బు ఇచ్చుకుంటాను" అంది దీనంగా కమల.

అది విని రత్నమాల విలాసంగా నవ్వి "ప్రస్తుతం నేను చెయ్యగలిగిందేమీ లేదు. ఏదో రెండు, మూడు నెలలప్పుడైతే ఎబార్షన్ చెయ్యగలం కాని ఐదు మాసాలు నిండాక ఎలా వీలౌతుంది ? టానిక్ రాసిస్తాను వాడుకో" అంటూ రాసిచ్చింది.

అది విన్న కమల ఒక్కసారి అదిరిపడింది. "ఏమిటండీ మీరంటున్నది ? నాకు గర్భిణి కాదండి. కాదు. నాకసలు పెళ్ళేకాలేదు. దయచేసి నన్ను సరిగా పరీక్ష చెయ్యండి" అంటూ ప్రాధేయపడింది.

"పెళ్ళికాని నీలాంటి అమ్మాయిలంతా ఇలాగే చెప్తారు. ప్రస్తుతం నేను చెయ్యగలిగిందేమీ లేదు" విసుగ్గా అని మరో పేషెంటును చూడసాగింది రత్నమాల.

కమలకు ఏమనాలో తెలియటం లేదు. పది రూపాయలు ఫీజు చెల్లించి ఇంటికి వచ్చింది.

పక్కమీదవాలి భోరున ఏడ్చింది. భగవాన్ ఏమిటి ఈ పరీక్ష? ఎందుకు నన్నిలా శిక్షిస్తున్నావు? ఏం పాపం చేశానని నా కింతటి భారాన్ని అంట గట్టావు ? నా యీ బరువును ఎవ్వరూ దించలేరు. నువ్వే నన్ను రక్షించాలంటూ భగవంతుడ్ని వేడుకుంది.

* * *

కమలకు నా అనేవాళ్ళెవరూ లేరు. తండ్రి చిన్నతనంలోనే పోయాడు. తల్లి నలుగురిళ్ళల్లో పనిచేసి ఎస్. ఎస్. ఎల్. సి. వరకు చదివించింది. ట్రైనింగ్ పూర్తి కాకుండానే తల్లి కన్ను మూసింది. ఎంతో కష్టంమీద ట్రైనింగ్ పూర్తి చేసి గర్ల్స్ స్కూల్లో టీచరుగా చేరింది.

ఆరు సంవత్సరాలనుండి ఉద్యోగం చేస్తోంది. పాతిక సంవత్సరాలు నిండినా పెళ్ళి కాలేదు. చేసుకోవాలని మనసులో వున్నా చేసుకునే వ్యక్తి ఎదురుపడక అలాగే వుండిపోయింది. జీవనోపాధి గడిచేందుకు ఉద్యోగం వుంది. భావితరాల పిల్లలను తీర్చిదిద్దుతూ రోజులు గడుపుతోంది.

వున్నట్లుండి ఆమెకీ ఉపద్రవం ఎదురయింది. మొదటి రెండు, మూడు నెలలూ ఆ విషయాన్ని గురించి అంతగా పట్టించుకోలేదు. కాని రాను రాను శరీరంలో ఏవో మార్పులు కనపడుతున్నాయి. తనలో కలిగిన ఈ మార్పులకు కమల చాలా బాధపడ సాగింది. మొదట ఎవరికైనా చెప్పాలనుకుంది. కాని చెప్తే పెళ్ళికాని తనపై ఎలాంటి అభాండాలు వేస్తారోనని భయపడి చెప్పలేకపోయింది. పక్కోరోజు గడిచినకొలది స్కూల్లో పకవిజమ్మైన సంచలనం చెలరేగింది.

తోటి టీచర్లంతా మాటీపోటీగా మాట్లాడ్డం మొదలుపెట్టారు. అందరిలోకి సుందరి టీచర్ మరీను. "కమలకు గర్భిణిలా వుంది. చూడండి కడుపెలా ఎత్తుగా కనపడుతోందో" అని సుందరి అనగానే అందరూ కమలవంక చూసి తమలో తామే ముసిముసిగా నవ్వుకునేవారు.

"అయినా అదేం పనో నెల తప్పినా పెళ్ళి చేసుకోకపోవటం" అని మరొకతంటే —

"అసలు సంగతి తెలిసినాక వున్నాడో పత్తా లేకుండాపోయాడో" అని మరొకతనటం.

"అంత త్వరగా ఒదిలేసి పోతాడంటారా ?"

"పోకపోతే ఎందుకలా దిగులుగా వుంటుంది? మొత్తానికి ఏదో జరిగింది."

"ఇంతకీ అతనెవరో ? ఏం పని చేస్తాడో ? ఇంతవరకు ఎవరికీ తెలియకపోయే. ఎంతయినా నేలముచ్చు మొగంది. వ్యవహారం ఇంతవరకూ ఎంత గుట్టుగా నడిపింది ? ఎంత గుట్టుగా నడిపినా కడుపనేది ముందుకు వచ్చేదేకాని వెనక్కి పోయేదా ? కనమా కంటుంది. కన్నవాడి బాబును కట్టుకోమా కట్టుకుంటుంది."

ఇలా సాగేది వారిమధ్య సంభాషణ. కమల వున్నా లేదన్నట్లుగానే మాట్లాడుకునే వారి మాటలు విని కమల ఎంతగానో బాధపడేది. తన దురదృష్టాన్ని తనే తిట్టుకునేది. అప్పటివరకూ ఏదో కొద్దిగా మాట్లాడే టీచర్లంతా సమ్మె చేసినట్లు పూర్తిగా మాట్లాడ్డం మానేశారు.

ఇన్నాళ్ళుగా తన నడవడికను ఎరిగిన వాళ్ళు కూడా ఎంతో మలకనచేసి అభాండాలు వేస్తే తనేం

# మీ మనసుని దోచుకునే ముఖచిత్రాలు! కొని దాచుకోవాల్సిన పుస్తకాలు!!

| | | | | | |
|---|---|---|---|---|---|
| రు. 6.50 | రు. 12.50 | రు. 12.00 | రు. 7.00 | రు. 14.00 | రు. 14.00 |
| రు. 20.00 | రు. 9.00 | రు. 9.00 | రు. 11.50 | రు. 15.00 | రు. 11.50 |

కావలసిన పుస్తకాల ఖరీదులో 5 రూపాయలు తగ్గించి
ముందుగా M.O పంపితే - పోస్టు ఖర్చులు మేమే భరించి
ఆ 5 రూపాయిలకు వి.పి పోస్టులో పంపగలము.



**నవోదయ పబ్లిషర్స్** విజయవాడ-2 గుంటూరు-2

చెయ్యగలదు ? ఎలా ఒప్పుకోగలదు ? అందుకే ధైర్యంచేసి హాస్పిటల్‌కు వెళ్ళింది. కాని "దున్నపోతు ఈనిందంటే, దూడను కట్టెయ్య మన్నట్టుగా" డాక్టరై వుండి కూడ సరిగా పరీక్ష చెయ్యకుండా "గర్భిణి" అని తేల్చి చెప్పింది.

స్త్రీని స్త్రీయే గౌరవించటం తెలుసుకోలేక సర్వాధికారం, సమానత్వం ఇవ్వటంలేదని పురుషుల్ని దుయ్యబడుతున్నారు. అలాంటి మనుషులతో కమల విసిగివేసారిపోయింది. అందుకే బాగా ఆలోచించిన మీదట పట్నం వెళ్ళి పెద్దడాక్టరుకు చూపించు కోవాలనుకుంది. ఆ మరునాడే పట్నం బయలుదేరింది.

బస్సులో కూర్చున్నదేకాని ఆమె ఒళ్ళు ఆమెకే స్వాధీనంలో లేదు. జనం క్రిక్కిరిసివున్నారు. ఎక్స్‌ప్రెస్ కావటంతో బస్సు ఆఘ, మేఘాలమీద పరుగెడుతోంది. ఆ కుదుపులకు కమల ఒళ్ళంతా అదిరి విపరీతంగా బాధ కలుగుతోంది. పమిటచెంగు భుజాలనిండుగా కప్పుకుని సర్దుకుని కూర్చుంది. ధైర్యంగా వుండాలని విశ్వప్రయత్నం చేసింది. కాని ఆమె ప్రయత్నమంతా విఫలమైంది. శరీరమంతా సన్నగా వణుకుతూ స్వాధీనం తప్పుతోంది. ఈ బస్సు ఎంత త్వరగా గమ్యం చేరుకుంటుందా అని ఎదురుచూస్తోంది. బస్సు పట్నం చేరాలంటే మరో నాలుగు కిలోమీటర్లు పోవాలి. కమల తనను కాపాడమని మనసులోనే వేయి దేవుళ్ళకు మొక్కు కుంది. వేగంగా బస్సు పరుగెడుతూనే వుంది. గాలిలో తేలిపోతున్నట్లుగా వుంది. ఏం జరుగు తోందో తెలియటంలేదు. కళ్ళు మూతలుపడ్డాయి. పూర్తిగా స్పృహకోల్పోయి సీటుమీద ఒరిగిపోయింది.

కాసేపటికి బస్సు పట్నం బస్టాండ్‌లో ఆగింది. ప్రయాణీకులంతా ఆత్రుతగా దిగిపోయారు. డ్రయివరు బస్సును డిపోలో పెట్టేందుకై లోపలి కొచ్చాడు. సీటుమీద ఒరిగిన కమలను చూశాడు. "ఏమండీ మిమ్మల్నే బస్టాండ్ వచ్చేసింది" అన్నాడు. అప్పటికీ ఆమెలో చలనం లేకపోయేసరికి దగ్గరకు వెళ్ళి పట్టి అటు, ఇటు కుదిపిచూశాడు. అతనికేదో అనుమానం రాగా వెంటనే బస్సును స్టార్ట్‌చేసి ఆఘ మేఘాలమీద పరుగెత్తించి గవర్నమెంటు హాస్పిటల్ ముందుంచాడు.

నర్సులూ, వార్డుబాయ్‌లూ వచ్చి స్పృహలో లేని కమలను స్ట్రెచర్‌మీద పడుకోబెట్టి లోపలికి తీసుకువెళ్ళారు. డాక్టరువచ్చి కమలను పరీక్షచేసి చెయ్యవలసిన తతంగమంతా చేసేసరికి గంటన్నర పట్టింది.

అప్పటికే ఏడుగంటలైంది. వార్డునర్సు డ్రైవర్ రాజారావు దగ్గరకువచ్చి "చూడండి రాత్రిపూట మొగవాళ్ళుండటానికి వీల్లేదు. ఎవరైనా ఆడవాళ్ళుంటే పంపండి" అంది. అప్పటికే ఆ వార్డులో వున్నవాళ్ళంతా వీళ్ళిద్దరూ భార్యా భర్తలనుకున్నారు.

రాజారావుకు ఏమనాలో తెలియలేదు. ప్రక్క బెడ్‌మీదున్న మామ్మగారి నుద్దేశించి "ప్రస్తుతం ఆడవాళ్ళెవరూ లేరండి. మీరే కాస్త చూస్తుం డండి" అన్నాడు. ఆవిడ సరేనంది. నర్సుకు, వార్డ్





పశ్చిమ జర్మనీలో మంచుమీద కత్తులం విన్యాసాలు చేయడం తాజాగా వృద్ధిచెందిన క్రీడ.

## తోడూ-నీడా

బాయ్‌కు కూడ జాగ్రత్తగా చూస్తుండమని చెప్పి వచ్చేశాడు.

ఎందుకో ఆ రాత్రి భోజనం చెయ్యాలనిపించ లేదు. హోటల్లో కాఫీ తాగివచ్చి డిపోలో పడుకున్నాడు. అతనికి కమల గుర్తుకువచ్చింది. ఆవిడకు స్పృహ వచ్చిందో లేదో ? ఎలా వుందో ఏమో ? పాపం ఎవరో అభాగ్యురాల్లా వుంది. తను చూడటం మరికాస్త ఆలస్యమైతే ఆమె ఏమైపోయేదో కదా ? భగవంతుడు ఆమెను చల్లగా చూడాలనుకుని కళ్ళు మూసుకున్నాడు.

మర్నాడు డ్యూటీకి వెళ్ళేది ఎనిమిదింటికి కావటంతో ఉదయం అయిదింటికే లేచి పాలు, బ్రెడ్ తీసుకుని హాస్పిటల్‌కు వెళ్ళాడు. అతను వెళ్ళేసరికి కమల నిర్జీవంగా పైకప్పుకేసి చూస్తోంది. ప్రక్క బెడ్ మీదున్న మామ్మగారు రాజారావును చూస్తూనే "రాత్రి రెండింటికి అమ్మాయి తెలివిలోకి వచ్చిం దయ్యా" అన్నది.

"అలాగా" అంటూ స్టూలును కాస్త దగ్గరగా జరుపుకుని కూర్చున్నాడు. వార్డులో అందరూ రాజారావునే చూస్తున్నారు. ఏం మాట్లాడాలో తెలియక కాసేపు మౌనంగా కూర్చున్నాడు.

కమల తల ప్రక్కకు తిప్పి రాజారావును చూసింది. రాజారావు కూడ కమలను చూడటంతో ఇరువురి చూపులూ కలుసుకున్నాయి.

"ఎలా వుందండి మీ ఒంట్లో" అన్నాడు.

కమల అతనికేసి మీరెవరన్నట్లు ప్రశ్నార్థకంగా చూసింది. అది గమనించిన రాజారావు "నా పేరు రాజారావు. బస్సు డ్రైవర్ని. నిన్న మిమ్మల్ని హాస్పిటల్లో చేర్చింది నేనే" అంటూ తనను తాను పరిచయం చేసుకున్నాడు.

"కాస్త తేలిగ్గానే వుంది. మీ మేలు ఈ జన్మలో మర్చిపోలేను." అంటూ రెండు చేతులెత్తి నమస్కరిం చింది. ఆమె స్వరం నూతిలోనుండి వచ్చినట్టుంది.

"చూడండి మీవాళ్ళు ఎక్కడ వున్నదీ చెప్తే టెలిగ్రామ్ ఇస్తాను" అన్నాడు. ఆ మాట విన్న కమల కన్నుల్లో నీరు నిండింది. "నేను అంతటి అదృష్టానికి నోచుకోలేదు. నాకు నా అనేవాళ్ళెవరూ లేరు. టీచర్ ఉద్యోగం చేసుకుంటూ ఏకాకిగా బ్రతుకుతున్నాను" అంది.

రాజారావు జాలిగా చూస్తూ "మిమ్మల్ని నొప్పించివుంటే క్షమించండి" అన్నాడు.

ఆమె లేదన్నట్లుగా చూసి రెండు చేతులూ జోడించింది.

"మీ పేరేమిటో చెప్తారా ?" అన్నాడు.

"కమల" అంది.

ఇంతలో నర్సువచ్చి కమలకు ఎడంం క్రింద మరో దిండువేసి కూర్చోపెట్టి ముఖం కడిగించింది. రాజారావు నుద్దేశించి "పాలు, బ్రెడ్ ఇవ్వండి" అంది నర్సు.

"చూడండి కమలగారూ నన్ను మీరు పరాయివాడిగా కాక మీ శ్రేయోభిలాషిగా భావించండి. సాటి మనిషిగా నా సహాయాన్ని స్వీకరించండి" అన్నాడు.

"కాదు నా పాలిట దైవంగా భావిస్తున్నాను" అంది తల దించుకుని కమల.

బ్రెడ్ తుంచి పాలల్లో ముంచి ఆమెకు తినిపించాడు. చెయ్యి తుడుచుకుంటూ "హోటల్ కుర్రాడికి చెప్తాను. వస్తాడు. మీకేది కావాలిస్తే అది తెప్పించుకోండి. అప్పటికీ నేనున్నాను. ధైర్యంగా వుండండి. డాక్టరును కలిసి అన్ని విషయాలూ తెలుసుకుంటాను" అన్నాడు.

కమల కృతజ్ఞతగా అతని వంకచూసి "నా కింద అయ్యే ఖర్చంతా మీరు బిల్లురాసి వుంచాలి" అంది. అతనలాగేనని తలవూపి వెళ్ళిపోయాడు.

ఆ మరునాడు వీలు చేసుకుని డాక్టరును కలిశాడు. డాక్టరు రోగం గురించి అన్ని విషయాలూ వివరంగా చెప్పాడు. "ఓవేరియన్ ట్యూమర్" అని తప్పక ఆపరేషన్ చెయ్యాలని, చాలా రక్తం పోయినందున ఆమె బాగా బలహీనంగా వుందని, రక్తం ఎక్కించినప్పటికీ ఆపరేషన్ టైమ్‌లో ఆమెలోని రక్తం సరిపోదని, బలమైన ఆహారం తీసుకుంటూ కదలకుండా బాగా రెస్టు తీసుకోవాలనీ, అప్పటివరకూ మందులవలన కాపాడగలనని రెండు వారాల తరువాత ఆపరేషన్ చేస్తానని" చెప్పాడు.

ఆ విషయాలన్నీ కమలకు చెప్పి మీరు శ్రద్ధగా బలమైన ఆహారం తీసుకుంటూ బాగా రెస్టు తీసుకోవాలని హెచ్చరించాడు. కమల అలాగేనని తలవూపి దిండు క్రింద నుండి నర్సుతో రాయించిన లీవు అప్లికేషన్ ఫారం తీసి సంతకం చేసి రాజారావు కిస్తూ "మీరు ఆ రూట్‌లో వెళ్ళినప్పుడు మా హెడ్‌మిస్ట్రెస్‌కు దీనిని అందజెయ్యండి" అంది. అతనలాగేనని దానిని మడిచి జేబులో వుంచుకున్నాడు.

బస్సును స్పీడుగాపోనిచ్చి చేరవలసిన దానికంటే పావుగంట ముందుగానే బస్టాండ్‌లో ఆపాడు. దగ్గరలోనే వున్న గర్ల్స్ స్కూల్‌కు వెళ్ళి నేరుగా హెడ్‌మిస్ట్రెస్ రూమ్‌లోకెళ్ళి "నమస్కారం" అన్నాడు.

తల వంచుకుని రాసుకుంటున్న హెడ్‌మిస్ట్రెస్

[ 41వ పేజీ చూడండి]

# ప్రకృతి కానుక ప్రతి ఒక్కరికి. కోమల,యవ్వన ఛాయ సర్వాంగాలకి

పోర్చుగీస్‌లో వేప పేరు మార్గోసా. వివిధ రూపాల్లో వేప దేహానికి, చర్మానికి చేసే విశేషమైన మేలుకు తిరుగులేదు. అందుకనే తరతరాలుగా వేప అన్న అంత ఆదరణ.

మార్గో సబ్బు ఒక్కటిలోనే అధిక భాగం వేపనూనె వుంది. శుద్ధమైన, సహజసిద్ధమైన మార్గో సబ్బు శరీరాన్ని పరిశుభ్రంగా మంచి అంగాలన్నిటి చర్మాన్ని సంరక్షిస్తుంది.

ప్రకృతికి తరలండి. మార్గోతో స్నానం చెయ్యండి. మీరు ప్రతిసారి స్నానం చేసేక మీ శరీరమంతా పరిశుభ్రంగా, తాజాగా, మెరుస్తూ వుంటుంది.

**శరీరమంతా పరిశుభ్రం**

**తల్లిలా చేసే సంరక్షణ**



# సినిమా

—జి.వి.జి.



'జయసుధ'లో జయసుధ

## అద్దాల మేడలో అద్దాల గోడ

పసితనంలోనే పసుపు కుంకుమలకు దూరమైన శారద (సంగీత) డైరెక్టర్ రావు (దాసరి)ని కలుసుకుంది. ''మీ సినిమాలు చాలా చూశానండి ఆడవాళ్ళ సమస్యలు ఆడవాళ్ళకంటే మీకే బాగా తెలుసు. ఎక్కువగా ఆడవాళ్ళమీదే సినిమాలు ఎందుకు తీస్తారు ?'' అంది.

''మగవాళ్ళ జీవితాలు ఆడవాళ్ళ జీవితాలను చుట్టుకొని అంటి పెట్టుకొని ఉంటాయి కనుక. ఎవరి జీవితంలో ఏ మలుపు తిరిగినా – దానికి కారణం ఆడది కనుక. అందానికి, బంధానికి – ప్రేమకు, అనురాగానికి – కక్షకీ, ఆవేశానికీ – మాతృత్వానికీ, భాతృత్వానికీ వారధి – దివ్యసారధి ఆడది,'' అన్నాడు రావు.

''ఏమండీ ! మీరు తీసిన 'బలిపీఠం' సినిమా లాంటిదే నా జీవితం. నాకు పెళ్ళయిన కొత్తలోనే నా భర్త పోయాడు. రెండో పెళ్ళికి మావాళ్ళు ఒప్పుకోడంలేదు. నాకు మళ్ళీ పెళ్ళి చేసుకోవాలని ఆశ. తప్పంటారా ? మావాళ్ళను కాదని తెగించి ఇంటి నుంచి వచ్చేస్తే, నన్ను పెళ్ళి చేసుకోడానికి ఎవరైనా ఉంటారా ?''

''ఏం? ఎందుకుండరూ? మీకేం తక్కువని?''

''మీరు చేసుకుంటారా ?''

''చేసుకోనమ్మా. నా కెప్పుడో పెళ్ళయి పోయింది.''

''అబద్ధం ! మీకు పెళ్ళికాలేదని పేపర్‌లో చదివాను. అబద్ధమా ?''

''ఒక్కోసారి కొన్ని నిజాలు అబద్ధాలవుతాయి. అబద్ధాలు నిజాలవుతాయి ... నా దృష్టిలో ప్రేమ వేరు, పెళ్ళివేరు, దాంపత్యం వేరు కాదమ్మా. ప్రేమకు నిర్వచనం పెళ్ళి. పెళ్ళికి నిర్వచనం దాంపత్యం. ఆ మూడూ కలిసికట్టుగా నా గుమ్మం దాకా వచ్చాయి. గుమ్మంలో నిలబడ్డాయి. తలుపు తట్టాయి. నేను తలుపు తీయకుండానే తొందర పడిపోయాయి ! ఆమెను జ్ఞాపకం చేసుకోకుండా ఉండలేను. జ్ఞాపకం చేసుకొని తట్టుకోలేను. అందుకే — ఎవరా ప్రశ్న వేసినా దాటేస్తూ ఉంటాను.''

శారద కళ్ళు చెమ్మగిల్లాయి. ''క్షమించండి. ప్రేమకు ఇంత విలువిచ్చేవారు ఈ ప్రపంచంలోనే లేరు. మిమ్మల్ని బాధపెట్టాను. క్షమించండి,'' అంటూ జవాబుకు ఎదురుచూడకుండానే వెనుతిరిగి నిష్క్రమించింది.

అంజనీకుమార్ నిర్మించిన విజయశ్రీ ఆర్ట్ పిక్చర్స్ ''అద్దాల మేడ'' దాసరి నారాయణరావు దర్శకత్వం వహించిన 50వ చిత్రం. ఈ చిత్రంలో ఆయన మరపురాని ఒక ముఖ్య పాత్రను పోషించారు కూడా. ఈ చిత్రం గురించి చెప్తూ ఆయన ''సినిమావారి బాహ్య జీవితాల్లోని గ్లామర్ మాత్రమే ప్రజలకు కనిపిస్తుంది. కాని, ఆ గ్లామర్ వెనుక ఉన్న విషాద ఘట్టాలు, అంతరాంతరాల్లో దాగిన హృదయావేదన వారికి కనిపించవు... సినిమా షూటింగ్ కోసం ఒక యూనిట్ ఓ గ్రామానికి వెళ్తే – అక్కడ జరిగిన వింత వింత సంఘటనల సారాంశమే ఈ చిత్రం,'' అన్నారు. ఇంకా మురళీమోహన్, అంబిక, మోహన్‌బాబు, ప్రభాకర రెడ్డి, ఝాన్సి, స్వర్గీయ కె. వి. చలం, సినిమా హీరోయిన్‌గా గీత, చిత్ర నిర్మాతగా కథా రచయిత ఆర్. కె. ధర్మరాజ్, కెమెరామన్‌గా మాలి ఈ చిత్రంలో నటించారు. రాజన్ – నాగేంద్ర, కె. ఎస్. మణి, భాస్కరరాజు, జి. జి. కృష్ణారావులతో ఎ. పి. రంగారావు నిర్మాణ బాధ్యతలు వహించారు.

## దాసరి రచన, పర్యవేక్షణలో మరో శిష్యుడి దర్శకత్వం

''మోహన్‌బాబు హీరో,'' అన్నారు వడ్డే రమేష్. ఈయన నిర్వహణలో వడ్డే శోభనాద్రి నిర్మించే విజయమాధవీ పిక్చర్స్ ''మరో కురుక్షేత్రం'' చిత్రానికి దాసరి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పర్యవేక్షణలో ఆయన మరో శిష్యుడు నందం హరిశ్చంద్రరావు తొలిసారిగా దర్శకత్వం నెరప బోతున్నారు. ''జూన్ 1న షూటింగ్ ప్రారంభమై, జూలైకు పూర్తవుతుంది,'' అన్నారు ఈ చిత్రాన్ని సమర్పించే వడ్డే కిశోర్. సంగీతం : జె. వి. రాఘవులు. కూర్పు : జి. జి. కృష్ణారావు.



'పాలు – నీళ్ళు' చిత్రానికి పాట పాడిన 'ఆశా'తో దాసరి, సత్యం, నిర్మాత రామినేని సాంబశివరావు.

## ఎన్. టి. ఆర్., కట్టా సుబ్బారావు కాంబినేషన్‌లో చిత్రం

"ఇద్దరు కథానాయికలు ఉంటారు," అన్నారు కట్టా సుబ్బారావు. ఈయన కథ, దర్శకత్వంలో గుంటూరు వాస్తవ్యులు కె. మాణిక్యరావు 'గా కిశోర్' పతాకంలో నిర్మించే చిత్రంలో ఎన్. టి. ఆర్. హీరో.

'విశ్వరూపం'లో అంబిక, ఎన్. టి. ఆర్.



## తెలుగులో ఆశా [భోన్‌స్లే] పాట

ప్రముఖ గాయని శ్రీమతి ఆశా భోన్‌స్లే మొదటిసారిగా ఒక దక్షిణ భారతీయ భాషలో, అందులోను తెలుగులో పాట పాడారు. శ్రీ దాసరి నారాయణరావు దర్శకత్వంలో శ్రీ రామినేని సాంబశివరావు తెలుగు చిత్ర ఇంటర్నేషనల్ పతాకం క్రింద తీస్తున్న "పాలు – నీళ్ళు" చిత్రం కోసం శ్రీమతి ఆశా మే 6న మద్రాసు జెమినీలో "ఇది మౌన గీతం! ఒక మూగ రాగం" అనే పాటను పాడారు. సత్యం సంగీతం సమకూర్చారు. ఎన్నో సంవత్సరాల క్రితం శ్రీమతి ఆశా సోదరి ప్రఖ్యాత గాయని లతామంగేష్కర్ "సంతానం" చిత్రంలో ఒక పాట పాడిన విషయం పాఠకులకు విదితమే.

## కట్టా సుబ్బారావు దర్శకత్వంలో అక్క మొగుడు_చెల్లెలి కాపురం

"మా పిక్చర్‌లో ఫర్ ది ఫస్ట్ టైమ్ చంద్రమోహన్, సరిత హీరో హీరోయిన్‌లుగా నటిస్తున్నారు," అన్నారు చెరుకూరి జనార్ధనరావు. ఈయన లోగడ "జాతర" చిత్రాన్ని సమర్పించారు. ఇప్పుడు కొత్తగా నిర్మించే "అక్క మొగుడు – చెల్లెలి కాపురం"లో అల్లు రామలింగయ్య, సూర్యకాంతం, నూతన్‌ప్రసాద్, పి.ఎల్. నారాయణ, రావుగోపాలరావు తక్కిన పాత్రధారులు. డి.వి.నరసరాజు కథ, మాటలు, రాశారు. రంగా ఛాయ, చక్రవర్తి సంగీతం, వెంకట్రామన్ కూర్పు, సూరపనేని భావనారాయణ ప్రొడక్షన్ నిర్వహిస్తారు. "జూన్ 5 నుంచి పాటల రికార్డింగ్, 12నుంచి షూటింగ్‌మొదలెడుతున్నాం," అన్నారు డైరెక్టర్ కట్టా సుబ్బారావు.



## కాల్షియంలోపించిన ఎముకలు బలహీనంగా ఉంటాయి. సులభంగా దెబ్బ తింటాయి.

# కాల్షియం-శాండోజ్ ఎముకల నిర్మాణాన్ని బలపరుస్తుంది

ఎముకలు కంటికి కనిపించవు. అయినా..అవి మీ పిల్లల పెరుగుదలకు, వికాసానికి అతిముఖ్యమైనవి. కాల్షియం ఎముకలలోను, పళ్లలోను గల అతిముఖ్య పదార్థ భాగం. కాల్షియం లోపం వల్ల ఎముకలలో బలహీనత, పెళుసుతనం సంభవిస్తాయి. పళ్లు వదులై చిల్లులు పడిపోతాయి.

శక్తివంతమైన పళ్లకోసం, ఆరోగ్యవంతమైన ఎముకలకోసం మీ బిడ్డకి రోజుకు 3-4 వెనిల్లా వాసనగల కాల్షియం-శాండోజ్ బిళ్లలు ఇవ్వండి. ప్రతి బిళ్లా కాల్షియంతోపాటు C, D, $B_{12}$, విటమిన్లతో పటిష్ఠం చేయబడింది.

మీ బిడ్డడు ప్రతి రోజూ కాల్షియం కోల్పోతాడు. అది తిరిగి సమకూర్చాలి. లేకపోతే అతని పెరుగుదల దెబ్బతింటుంది. మామూలు భోజనం కావల్సినంత కాల్షియం ఇయ్యలేక పోవచ్చు.

**ఈ రోజే అతనికి కాల్షియం-శాండోజ్ ఇవ్వడం మొదలు పెట్టండి-ఎక్కువ ఆలస్యం అయిన తర్వాత ఎంత కాల్షియం యిచ్చినా కాల్షియం లోపంవలన కలిగిన హానిని మరమ్మతు చేయటం సాధ్యం కాదు.**

గుర్తుంచుకోండి, అన్ని కాల్షియం బిళ్లలు ఒకటే కావు.

**కాల్షియం—శాండోజ్ మాత్రమే కావాలని అడగండి. మారుగా యిచ్చే ఏ యితర వాటితోను సరిపెట్టుకోకండి.**

కాల్షియం-శాండోజ్— స్విట్జర్లండులోని శాండోజ్ వారిచేత పెంపొందించ బడిన అత్యుత్తమమైన కాల్షియం.



**గట్టిపళ్లు, పటిష్ఠమైన ఎముకల కోసం కాల్షియం-శాండోజ్®**




daCunha/S-25/TL



'భోగి భాగ్యాలు'లో శ్రీలక్ష్మి, విజయలక్ష్మి

## నేను – మా ఆవిడలో ఎవరావిడ ?



కృష్ణ (చంద్రమోహన్) మంచం మీద కూర్చొని ఆలోచిస్తున్నాడు. ఇంతలో రాధ (ప్రభ) వచ్చింది. "దొరగారి కోపం తగ్గిందన్న మాట ?" అంది.

"తగ్గకేం చేస్తుందిగాని, నేనో విషయం అడుగుతాను చెప్తానా ? నువ్వు పుట్టింట్లో ఉన్నప్పుడు నేను నీకు ఉత్తరాలు రాశానన్నావు కదా ? అవి నాకొకసారి చూపించవూ ?" అడిగాడు కృష్ణ.

"భార్యాభర్తలు రాసుకునే ఉత్తరాలు మూడో మనిషికి తెలియకూడదు, చదివిన వెంటనే చించేయమని – మీరేకదా ప్రతి ఉత్తరంలోనూ రాసేవారు ?"

"రాస్కెల్ ! సుబ్బమ్మగారి ముందు నేను ఉత్తరాలు రాశానని కోతలు కోసి, ఇప్పుడడిగితే చించేశానంటావా ? అసలు ఎవరు నువ్వు ?"

"ఉష్ ! మెల్లగా మాట్లాడండి. సుబ్బమ్మగారు వింటే బాగోదు. అయినా, నేనెందుకు వెళ్లాలి ?"

"నువ్వు నా పెళ్ళానివి కాదు గనుక."

"కాకపోతే, మీ ఫోటో పక్కన నా ఫోటో ఎందుకు పెట్టుకున్నారు ? చెప్పండి !"

"బుద్ధిలేక... ఈ గదిలో నీ ఫోటోయే కాదు; హేమమాలిని కేలండరు కూడా పెట్టుకున్నాను. ఆవిడ నీలాగే వచ్చేసిందా ?"

"ఆవిడ ఇక్కడ కెందుకొస్తుందండీ ? ఆవిడ భర్త ధర్మేంద్ర కాబట్టి, ఆయన దగ్గరకెళ్తుంది. నేను మీ భార్యను కాబట్టి మీ దగ్గరకొచ్చేశాను."

"అదిగో – ఆ కూతే కుయ్యొద్దంటున్నాను. యూ బ్లడీఫూల్, గెట్టవుట్ !" అంటూ కృష్ణ, రాధను గెంటబోయాడేగాని, హఠాత్తుగా సుబ్బమ్మ (నిర్మల) రావడంతో ప్లేటు తిప్పేశాడు.

దాసరి నారాయణరావు స్క్రీన్‌ప్లే, పర్యవేక్షణలో రేలంగి నరసింహారావు దర్శకత్వం వెలిపిన రాజ్యలక్ష్మి కంబైన్స్ "నేను – మా ఆవిడ" చిత్రానికి యు. ఎస్. ఆర్. మోహనరావు నిర్మాత. ★

'సంసారం–సంతానం'లో ఒక దృశ్యం



## ఊరికిచ్చిన మాటలో ఉలిపి కట్టెల బాట

ఫారెస్ట్ గార్డ్ (గిరిబాబు) కుంటుకుంటూ అటూ ఇటూ తిరగడం చూసి నాటు వైద్యుడు దైవాధీనం (మాడా) హడావిడిగా వచ్చాడు. "ఏమిటి కుంటుతున్నారు? కాలికి దెబ్బ తగిలిందా?" అన్నాడు.

"దెబ్బ కాలికే! కాని, నొప్పి ఇక్కడ. అబ్బా! దైవాధీనం! ఇన్నాళ్ళుగా నాతో కలిసి తిరిగి నా అంతరాత్మ గ్రహించలేకపోయావు కదయ్యా?" అన్నాడు గార్డ్.

"ఓహో! ఇప్పుడర్థమయింది. మీ గుండెనొప్పి చుక్కమ్మ కూతురు కోసమన్న మాట?"

"నువ్వు మూలికలని అడవిలోకి వెళ్ళి, మొదళ్ళు నరుక్కొచ్చినా ఊరుకున్నానెందుకు?"


'బంగారు కొడుకు'లో కృష్ణ, శ్రీదేవి

"ఆ చుక్కమ్మ కూతుర్ని మీకిచ్చి పెళ్ళి చేయమని సిఫార్సు చేయడానికి."

"మరి, దాని కూతురు కట్టెలు కొట్టే రాముడిగాడితో తిరుగుతూందే?"

"అదా? వరసకి వాళ్ళు మేనత్త మేనమామ బిడ్డలు. అందుకని అలా కలిసిమెలిసి తిరుగుతున్నారు."

"దైవాధీనం! నా కాబోయే పెళ్ళాం ఎవడితో తిరిగినా ఫర్వాలేదంటావా? ఇదంతా కాదు; వెంటనే నా పెళ్ళికి ఏర్పాటు చెయ్!"

ఇంతలో పూజారి (రావి కొండలరావు) "అసలు ఈమధ్య అమ్మవారు కలలో కనిపించి ఏమన్నారంటే —" అంటూ వచ్చాడు.

గార్డుకు చిర్రెత్తింది "నా డబ్బు పెట్టి పూజలు చేస్తే, అమ్మవారు నీ కలలో కనిపించడమేమిటి?"

"శాస్త్రం అంతేమరి... అమ్మవారు అడ్డమైన


'ఏది ధర్మం? ఏది న్యాయం?'లో ఒక దృశ్యం

వాళ్ళ కలల్లో కనిపించరు," అన్నాడు పూజారి.

"నేను అడ్డమైనవాడ్నా? ఇంతకీ, నన్నిప్పుడు ఏం చెయ్యమంటావు?"

"సహస్రార్చన చేయిస్తేనేగాని. అభీష్టం నెరవేరదండి."

"పూజారీ! ఇదిగో! నాకు త్వరగా పెళ్ళి కావాలని అర్చన చేయించండి," అంటూ గార్డ్ డబ్బు ఇచ్చాడు.

"అవార్డులతోపాటు అందరి ఆదరాభిమానాలూ లభించే చిత్రం. నేనాశించినంతమేరకు సంతృప్తిగా వచ్చింది," అని ఎం. బాలయ్య అంటున్నప్పుడు ఆయన వెనుక గోడకున్న గడియారం గంట కొట్టింది. డైరెక్టర్‌గా ఆయనకిది తొలి చిత్రమైనా నటుడుగా, కథకుడుగా, అమృతా ఫిలిమ్స్‌వారి చిత్రాల సమర్పకుడుగా లోగడ విశేషానుభవం గడించారు. "చెల్లెలి కాపురం, నేరము — శిక్ష. అన్నదమ్ముల కథ, ఈనాటి బంధం ఏనాటిదో, ప్రేమ — పగ, చుట్టాలున్నారు జాగ్రత్త" చిత్రాల కథకుడుగా ఆయన ఏనాడో ప్రశంసలందుకున్నారు. పీటిలో "చెల్లెలి కాపురం" తమిళంలో, "నేరము — శిక్ష" తమిళం, హిందీలో తయారయ్యాయి. "చుట్టాలున్నారు జాగ్రత్త" చిత్రాన్ని తమిళంలో ఎ. వి. ఎం. వారు; హిందీలో మధు పిక్చర్స్‌వారు తీస్తున్నారు. "ఊరికిచ్చిన మాట" కథకుడుకూడా ఈయనే. అలపర్తి సూర్యనారాయణ, మన్నవ వెంకట్రావు ఈ చిత్ర నిర్మాతలు. విడుదలకు సిద్ధంగా ఉన్న చిత్రమిది.

## పసుపు కుంకుమ

"తెలుగు, తమిళ భాషల్లో ఒకేసారి తయారవుతుంది," అన్నాడు కాకినాడకు చెందిన సుప్రసిద్ధ కళాకారుడు ఎస్. ఎస్. గురుప్రసాద్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి. రాజగోపాల్ నిర్మించే నందాదీపా ప్రొడక్షన్స్‌వారి పై చిత్రానికి పి. లక్ష్మణ్ ఛాయాగ్రాహకుడు.

# తోడూ-నీడా

[30వ పేజీ తరువాయి]

తలెత్తి రాజారావును చూసి "నమస్కారం. ఎవరు మీరు ? ఏం కావాలి ?" అన్నది.

అప్లికేషన్ ఫారం ఆమె కందించుతూ "కమల టీచర్ అనారోగ్యంవలన సీరియస్‌గా హాస్పిటల్లో వుంది. దయచేసి ఆమె లీవు త్వరగా మంజూరు చెయ్యవలసిందిగా మరి మరి చెప్పింది" అన్నాడు.

అటుగా వచ్చిన సుందరి టీచర్‌కు కమల అన్న మాట వినపడి హెడ్‌మిస్ట్రెస్ రూమ్‌లో కెళ్ళబోయి రాజారావును చూసి ఆశ్చర్యంతో అక్కడే ఆగిపోయింది.

అంతలోనే ఏదో అర్థమైనట్లు నవ్వుతూ ప్రక్క టీచర్లకు ఏదో సైగ చేసింది. వాళ్ళంతా సుందరి దగ్గరకు వచ్చారు.

అందమైన విగ్రహం, ఉంగరాల జుత్తు, చక్కటి వర్సనాల్టీతో అందంగా కాకీబట్టల్లో వున్న రాజారావును చూసి అందరూ ఆశ్చర్యంగా నోళ్ళు వెళ్ళబెట్టారు.

సుందరి గుమ్మం దాటి వెళ్ళున్న రాజారావును చూసి కిసుక్కున నవ్వి "మన హీరో చాలా అందంగానే వున్నాడు. ఎంతయినా కమల అదృష్టవంతురాలే. మంచివాణ్ణే పట్టింది. ప్రొద్దుపోయి వచ్చి, ప్రొద్దున్నే లేచిపోయే బస్సు డ్రైవర్ కనుకనే మనం ఇన్నాళ్ళు ఎంత గాలించినా అంతుదొరకలేదు సుమా ?" అంది వెటకారంగా. పక్కనున్నవాళ్ళంతా పకపక నవ్వుతున్నారు. వారి సంభాషణ విన్న రాజారావు వాళ్ళకేసి కోపంగా చూసి వెళ్ళిపోయాడు.

కమలను హాస్పిటల్లో చేర్చి పది రోజులైంది. ఇప్పుడిప్పుడే కొద్దిగా కోలుకుంటోంది. ఈ పది రోజుల్లోను వారిద్దరిమధ్య స్నేహపూర్వకమైన గౌరవ మేర్పడింది.

బత్తాయిపళ్ళు ఒలిచి తొనలు తీసి ఆమె కందిస్తూ "ఓ నెల రోజులు సెలవు పెట్టాను" అన్నాడు.

"ఎందుకు మీరు సెలవు పెట్టటం? అనవసరంగా మీకున్న సెలవు రోజులన్నీ నాకోసం గాడేస్తున్నారు. మళ్ళీ మీకు అవసరం వస్తే సెలవు దొరకటం కష్టమౌతుందేమో ?" అంది కమల.

"లేదు నా కింతకంటే సెలవు వుపయోగించుకునే అవసరం మరేదీ లేదు" అన్నాడు.

"అంటే" అంది అర్థంకాక. "అంటే ఏముంది ? నాక్కూడ ఎవరూ లేరు. నేనుకూడ మీలా ఏకాకినే" అన్నాడు. అతని స్వరం నుండి బరువుగా ఏదో బాధ ధ్వనిస్తోంది. "మీరు జీవితంలో ఏదో పెద్ద షాక్ తిన్నట్లుగా వుంది. అదేమిటో నేను తెల్సుకోవచ్చునా ?" అంది కమల.

"తప్పకుండాను."

* * *

"పార్వతి, నేను బావా, మరదళ్ళం. చిన్నప్పటి నుండి ప్రేమించుకున్నాం. పెద్దల ఆశీర్వాదంతో పెళ్ళి చేసుకున్నాము. హాయిగా ఆనందంగ రెండు సంవత్సరాలు గడిచాయి. ఆ తరువాత పార్వతికి గర్భిణి వచ్చింది.

గర్భిణి అని తెలిసినప్పటినుండి పార్వతిలో చలాకీతనం మటుమాయమైంది. ప్రతి మాటలోను, కదలికలోను పిల్లలంటే అయిష్టత వ్యక్తం చేసేది. మొదట్లో నేను పార్వతిని గురించి అంతగా పట్టించుకోలేదు. నాకు పిల్లలంటే మహాప్రాణం. ఎంత త్వరగా మా ఇంట్లో బూరెబుగ్గల బాబు వెలుస్తాడా అని ఎదురుచూస్తున్నాను.

ఓ రోజు చల్లని వెన్నెల్లో తలనిండా మల్లెలతో నా సన్నిధిలో వున్న పార్వతి "బావా" అంది గోముగా. మల్లెల సౌరభాన్ని ఆస్వాదిస్తూ ఏదో లోకాల్లో విహరిస్తున్న నేను "ఏమిటి ?" అన్నాను మత్తుగ. "ఇప్పటినుండి మనకు పిల్లలెందుకు బావా ? పక్కింటి సరళ ఇద్దరు పిల్లల తరువాత వెంటనే గర్భిణి వచ్చిందని ఎబార్షన్ చేయించుకుంది. నేను కూడ ..." అని అర్థోక్తిలోనే ఆగిపోయింది.

అప్పటివరకు సంతోషంగావున్న నాకు చెప్పరాని కోపం వచ్చింది. "పారూ" అన్నాను కోపంగా. నేనలా అనేసరికి పార్వతి హడలిపోయింది. "అలా అనకు పార్వతి ఇంకెప్పుడూ అలా అనకు" అన్నాన ఆవేశంగా.

కొన్ని క్షణాలు ఇరువురి మధ్య మౌనంగా గడిచాయి. పార్వతిని అనునయించే ధోరణిలో నేనే అన్నాను — "పారూ మన అమ్మా, నాన్నలు కూడ ఇలాగే ఇప్పటినుండి పిల్లలొద్దు అనుకుంటే మనం పుట్టేవాళ్ళమేకాదు. మాతృత్వం అనేది స్త్రీకి వరం. అదిలేని అభాగ్యులు కనిపించిన ప్రతిచెట్టుకు, పుట్టకు మొక్కుతూ ఎంతగానో దైవాన్ని వేడుకుంటూ విలపిస్తారు. అలాంటిది భగవంతుని దయవలన మన ఇరువురి ప్రేమకు ప్రతిరూపంగా బాబు పుట్టబోతూంటే నువ్వు ఎందుకిలా పిచ్చి, పిచ్చి ఆలోచనల్తో మనసు పాడు చేసుకుంటావు ? నీకు తెల్సుగా నాకు పిల్లలంటే ఎంత ప్రాణమో ?" అన్నాను. పార్వతి మౌనంగా వుండిపోయింది.

రోజులు గడుస్తున్నాయి. పార్వతి పుట్టింటి వారు ఘనంగా శ్రీమంతం జరిపించారు. పార్వతికి తోడుగా వుంటుందని మా అమ్మను పిలిపించాను. పార్వతికి ఎనిమిదవనెల వచ్చింది. అసలే తెల్లటి మనిషి మరికాస్త తెల్లగా మిసమిసలాడుతూవుంది. ముఖంలో కొత్తఅందం, కళ్ళలో వింత కాంతి, నిండయిన విగ్రహంతో భారంగా అడుగులేస్తూ ఇంట్లో తిరుగుతున్న పార్వతిని రెప్పవాల్చకుండా చూసేవాడిని.

ఆ రోజు డ్యూటీనుండి వచ్చి భోజనం చేసి పడుకున్నాను. ఒంటిగంట ప్రాంతంలో పార్వతి కడుపులో ఏదో బాధగా వుందని లేచి కూర్చుంది. అరగంటకల్లా ఆ బాధ విపరీతం అయ్యింది.

వెంటనే డాక్టరు దగ్గరకువెళ్ళాను. డాక్టరుతో తిరిగొచ్చేసరికి పార్వతి స్పృహతప్పి రక్తపుమడుగులో వుంది. మా అమ్మ దేవుళ్ళకు దణ్ణాలు పెడుతూ గొల్లుమని ఏడుస్తోంది. డాక్టరు చూసి అర్జెంటుగా ఆపరేషన్ చెయ్యాలన్నాడు.

ఆపరేషన్ చేసి తల్లినీ, బిడ్డనూ వేరుచేశారు. కాని పార్వతి ప్రాణం అనంతవాయువుల్లో కలిసి పోయింది. పుట్టిన బిడ్డ ఓ గంట వుండి తల్లిని చేరుకున్నాడు.

కాలగతిలో ఆరు సంవత్సరాలు గడిచాయి. పిల్లలు కావాలన్న మొండి కోరికతో పార్వతిని పోగొట్టుకున్నానేమో ? అనే బాధ మాత్రం మనసులో మిగిలిపోయింది." అన్నాడు రాజారావు భారంగా నిట్టూర్పుతూ.

అంతా విన్న కమల నీరునిండిన కళ్ళను తుడుచుకుంటూ "విధికొందరి జీవితాలతో ఎందుకో చెలగాటమాడుతుంది. దానిని తప్పించుకునే శక్తి మానవునికి లేదేమో ?" అంటూ చిన్ననాటినుండి ఎవరి ప్రేమనూ నోచుకోని తను ఎన్ని కష్టాలు పడిందీ, ఉద్యోగం దొరికి ఏదో తన మానాన తను బ్రతుకుతుంటే విధివశాత్తు ఈ రోగం రావడం, తోటి టీచర్లంతా తనను ఎంతో నీచంగా మాట్లాడటం, ఎన్నివిధాల అవమానాలు పొందుతూ బ్రతకటం, తనలోని వ్యధనంతా అతనికి వినిపించింది.

ఒకరి గతాన్ని ఒకరు తెలుసుకున్నాక ఇరువురి మనసులు తేలికయినవి.

ఇన్నాళ్ళు ఎండమావిలా గడిపిన కమల

## 'ఉత్తరాలు' శీర్షికకి పంపేవారికి మనవి

★ ఉత్తరాలు క్లుప్తంగా స్పష్టంగా వ్రాయాలి.

★ చివర పేరు రాయాలి. సంతకం పెట్టినా దాని క్రింది మీరు అచ్చులో పడాలనుకున్న పేరు తెలుగు లిపిలో ఉండాలి.

★ కథలమీదా, సీరియలు కథలమీదా మొదలైన వాటిమీదా పంపే విమర్శలు — ప్రశంసలు కూడా 'కథ'లు రాసేవారికి, ఆ కథలను తిరిగి అవసరమైతే వెనక్కిపోయి పాత సంచికలలో చదివేవారికి ఉపయుక్తంగా ఉండేలా చూడవని మనవి.

★ 'ఉత్తరం' తోటి పాఠకులందరూ ఆసక్తిగా చదువుకొనేదై వుండాలి. కేవలం ముఖచిత్రం 'హైలైట్' సీరియల్ 'ఎక్సలెంట్' కార్టూన్‌లు 'సుపర్బ్' అని గాకుండా అది ఏ ముఖచిత్రమో. ఏ పేజీకార్టూనో, ఆ సీరియల్ పైటిలేమిటో వ్రాయడం అవసరం.

★ 'కాపీ కథ' కాపీ కార్టూన్ అని రాసేవారు — సదరు కాపీ దేన్నుంచి జరిగిందో దాని వివరం వీలైతే ఒక కాపీ పంపితే ఎంతైనా మేలు.

★ ఉత్తరాలు తిప్పి పంపడం — రాసిందంతా వెయ్యడం సాధ్యం కాదు.

★ ఉత్తరాల శీర్షికను కూడా అందరూ చదివే పేజీగా చేయడానికి మా పాఠకులు దోహదించాలని మనవి.

— సం.

## కార్టూనిస్టులకు సూచనలు !

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలాబిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనా ఐవారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవదని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతవేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

– సం॥

## తోడూ-నీడా

మనసుకు రాజారావు అనునయ వాక్యాలు చల్లని చిరుజల్లులు కురిసినట్లు ఆనందం కలిగింది. ఆ ఆనందం పట్టలేక అంతరాంతరాళ్ళలోనుండి దుఃఖం పొంగిపొరలింది. రాజారావు ఎంత వారించినా ఆమె ఆ దుఃఖానికి ఆనకట్ట వెయ్యలేకపోయింది. ఆ బాధకు మళ్ళీ వెంటనే స్పృహ కోల్పోయింది.

డాక్టరు వచ్చి చూసి వెంటనే ఆపరేషన్‌కు అన్నీ సిద్ధం చేశారు. డాక్టరు చెప్పిన ప్రకారం మరో వారం రోజులకుగాని ఆపరేషన్ చేసేవారు కాదు. అనుకోకుండా ఈ సంఘటన జరిగింది.

రాజారావుకు మనసు మనసులో లేదు ఆపరేషన్ థియేటర్ ముందు పిచ్చివాడిలా అటు, ఇటు తిరుగుతున్నాడు. అతని కళ్ళకు పదే పదే పార్వతి కనపడుతోంది. ఆ రోజుకూడ ఇలాగే థియేటర్ ముందు కూర్చున్నాడు. డాక్టరు వచ్చి "సారీ మిష్టర్. నేను చెయ్యవలసిందంతా చేశాను. దైవం అనుకూలించలేదు. ఆమె దిగంతాలకు వెళ్ళిపోయింది." డాక్టరు మాటలు చెవిలో గింగురుమంటున్నాయి.

"పారూ" అన్నాడు ఆవేశంగా.

ఇంతలో ఆపరేషన్ థియేటర్ నుండి డాక్టర్ వచ్చాడు. ఆత్రుతగా అడగాలనుకున్నాడు. కాని అతని నోరు భయంతో విడివడలేదు. ప్రశ్నార్థకంగా ఆయన ముఖంలోకి చూశాడు. డాక్టరు చిరునవ్వుతో "ఆపరేషన్ సక్సెస్" అన్నాడు.

రాజారావు ఆ మాటను నమ్మలేకపోయాడు. పరుగున కమల దగ్గరకు వెళ్ళాడు. ఆమెకు ఇంకా స్పృహ రాలేదు. పట్టలేని ఆనందంతో ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని హృదయానికి హత్తుకున్నాడు. తన పార్వతే మళ్ళీ తనకీ రూపంలో బ్రతికి వచ్చిందనుకున్నాడు. పదిహేను రోజులు గడిచాయి. ఈ పదిహేను రోజులూ ఆమెను కంటికి రెప్పలా కాపాడాడు.

ఆ రోజు కమలను డిశ్చార్జ్ చేస్తున్నారు. ప్రయాణాని కన్నీ సిద్ధం చేశాడు. ఆమె దగ్గరగా కూర్చుని ఆమె కళ్ళల్లోకి చూశాడు రాజారావు.

అతని చూపులను తట్టుకోలేని కమల సిగ్గుపడుతూ తల వంచుకుంది. అతనేదో చెప్పాలని సంశయిస్తున్నట్లు పసిగట్టి "ఏమిటిలా చూస్తున్నారు ?" అంది.

"మీ కళ్ళల్లో నా పార్వతిని వెతుక్కుంటున్నాను. మీరు అంగీకరిస్తే ఆ స్థానాన్ని మీకిచ్చి నా జీవితంలోకి ఆహ్వానిస్తాను", అన్నాడు.

అది విన్న కమల ఆశ్చర్యంగా "మీరు పొరపడుతున్నారు. స్త్రీకి మాతృత్వం అనేది ఒక వరం. ఈ జన్మకు నాకా అర్హత లేదు" అంది.

రాజారావు ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని "అన్నీతెలిసే నేనీ నిర్ణయం తీసుకున్నాను. జీవితంలో మీకో నీడ కావాలి. నాకో తోడు కావాలి. ఇరువురమూ ఏకాకులమే. ఒకరికొకరం కలసి తోడూ, నీడగా జీవించుదాం." ఏమంటారు ? అన్నాడు.

కమల ఆలోచిస్తోంది. కాని ఆమెలోని మరో కమల ఆలోచించనివ్వటంలేదు — "ఏం ఇన్నాళ్ళు ఇలాంటి అవకాశం రాలేదు కనుక వూరుకున్నావు. ఇప్పుడు వచ్చింది. దాన్ని సద్వినియోగం చేసుకో. ఎన్నాళ్ళిలా ఒంటరిగా బ్రతుకుతావు ? నీడ లేని ఆడదానికి ఈ సంఘంలో స్థానం లేదు. నీకో చల్లని నీడ కావాలి. నిండు మనసుతో అతను నీకు నీడ ఇస్తానంటున్నాడు. కాదనకు. ఆలస్యం చెయ్యకు. ఊ త్వరగా ఒప్పేసుకో" అంటూ ఆమెను హెచ్చరించింది.

ధైర్యం తెచ్చుకున్న కమల రాజారావు చేతిలో తన చేతిని చూసుకుని సిగ్గుపడుతూ "మీ ఇష్టమే నా ఇష్టం" అంది. ఆ మాట విన్న రాజారావు మనసు ఆనందంతో పరవళ్ళు తొక్కింది.

## "ప్లాట్ ఫారమ్ ప్లాట్"

ప్లాటు కోసం
ప్లాట్‌ఫారంపై
తిరిగే నాకు
పావర్టీలోకం
పొట్టు కన్పించాయి.
ఒకవైపు నీతి
తప్పిన చేతులు
వాతలుపెట్టే
నరజాతులు
ఇద్దరు చొక్కాం
భజన పరులు
కుదార్తలకు
ఏవో శుష్కని
నాదాలిస్తున్నారు.
మధ్యలో వేడి
వేడి 'టీ' కాఫీలు
అంటూ అరుపులతో
జనం చెవుల
తుప్పను వదలిస్తున్నారు.
విద్యుత్ రైళ్ళ
కూతలు స్నేహితుల
కోతలకు అడ్డు
గోడలయి వారి
ఒడలు గగుర్పాటుతో
పులకరించేటట్లు
చేస్తున్నాయి. సినిమా
తారల స్లైయిడ్లు
ఫోటోలు సినిమా
కెళ్ళడాన్కి యువతరాన్ని
పొట్లు పడమంటున్నాయి.
ప్లాటు సంగతి మరచి
ప్లేటు ఫిరాయించిన్నేను
లేటుగా ఇంటికి చేరితే
ఇంట్లో చివాట్లెదురయ్యాయి !

– చివుకుల రామేశ్వర్

# 6 అందమైన. ఆహ్లాదకరమైన నవలల పరిచయం...

★★★ తెలుగు నవలా సాహిత్యంలో ఒక నూతనాధ్యాయానికి ప్రారంభోత్సవం చేస్తూ, పాఠకులందరికీ పూర్తి కొత్తదనంతోకూడిన ఉత్తమ స్థాయి వినోదంతోపాటు సున్నిత సరళిలో సాంఘిక ప్రయోజనాన్ని అందజేసేందుకు **8—6—81** వెలువడుతున్న 6 నవలల సంక్షిప్త పరిచయం. . . .

## 1. కాశ్మీర్, ఐ లవ్ యూ! ... రూ. 12/-

★ అప్సరసలాంటి అందమైన అమ్మాయి. 20ఏళ్లకే M.A. పూర్తిచేసింది. బొంబాయిలో 'కాన్వెంట్‌కల్చర్'లో పెరిగి, పుట్టిన పల్లెటూరు, చదివిన గుంటూరు తప్పిస్తే మిగతా విషయాలంతగా తెలీని ఓ కుర్ర డాక్టర్‌కు అర్ధాంగి అయింది. పెళ్లయిన మూడోనాడే హనీమూన్‌కు కాశ్మీర్ బయలుదేరారు. . . వాళ్లు వెళ్లే A.C. కాబిన్‌లోనే ఒక ఫిలిం ప్రొడ్యూసర్, ఓ మరుగుజ్జు ప్లీడరు. . . 118సార్లు చదివినా ఇంకా ఇంకా చదవాలనిపించే మధురాతిమధుర, సంపూర్ణ హాస్య శృంగార నవల **"కాశ్మీర్, ఐ లవ్ యూ!"** పుస్తకం మీరు మిస్ అయారంటే ఒక అద్భుతమైన ఆనందాలగనిని వదులుకున్నట్లే!! నిజం.

## 2. సూపర్‌స్టార్ ... రూ. 12/-

★ ఎవరు నిజమైన, సత్యమైన శాశ్వతమైన సూపర్‌స్టార్? అవినీతికి దాసుడైన భర్తతో అభిమానవంతురాలైన ఓ ఇల్లాలి పోరాటగాథ!

## 3. కళ్యాణ్—ప్రవీణ్ ...రూ. 12/-

★ గౌరవ ప్రదమైన — స్వతంత్ర మనుగడ కోసం ఓ పడతి జీవితంతో, ప్రేమించిన వ్యక్తితో సలిపిన సమరం . . .

## 4. స్నేహం × ప్రేమ ... రూ. 12/-

★ మానవజీవితాన్ని శోభాయమానం చేసేది భౌతికాకర్షణలా లేక మమతానురాగాలు, స్నేహానుబంధాలా ?

## 5. "యువరాణి" ...రూ. 12/-

★ అక్క సుఖ సంతోషాలకోసం ఓ చెల్లెలి మహత్తర త్యాగ గాథ . . .

## 6. హీరో, A.D. 2016! ... రూ. 12/-

★ . . . అంటే అతను హీరో అవటానికి మరో 35సం. ఆగక తప్పదూ అంటే కొంచెం లేటేనేమో. . . ! సంపూర్ణ హాస్య, వ్యంగ్య నవల.

★★★ సాధ్యమైనంత తక్కువ ధరలు నిర్ణయించబడిన పై 6నవలలు 8—6—81వరకు, పోస్ట్ ద్వారా, ఇంకా తక్కువ మూల్యానికి లభిస్తాయి.

# 6 నవలలకూ అత్యంతాధునికమైన గెటప్...

★ అందమే ఆనందమన్నారు. 'ఇంత అందమైన పుస్తకాలా' అని మీరు తప్పక ఆశ్చర్యపడేవిధంగా, నిస్సందేహంగా వరలక్ష్మి పబ్లికేషన్స్ మాత్రమే ఇవ్వగలిగిన అత్యంతాకర్షణీయమైన గెటప్ 6 పుస్తకాలకూ ఇవ్వటం జరిగింది. ప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ గంగాధర్ ప్రత్యేక శ్రద్ధ తీసుకుని తన కళా ప్రతిభ ప్రదర్శించిన ముఖచిత్రాలకు పూర్తి న్యాయం చేకూర్చేందుకుగాను, అన్ని టైటిల్స్‌కూ ఎంతో ఖరీదైన ప్లాస్టిక్ లేమినేషన్ చేయించాము. **PLASTIC LAMINATION** ఫలితంగా పై 6 నవలలో దేన్నయినా మీరు అద్దంలాగా ఉపయోగించుకోవచ్చు! పైన నీళ్లు పడినా పుస్తకానికి ఎలాంటి హాని జరగదు! ఇంకా ప్రతి పుస్తకం లోపల ఓ నేత్రానందకరమైన GIFT COUPON...

**VARALAKSHMI PUBLICATIONS**

11-2nd St., Dr. B. N. Reddy Road,
T. Nagar, MADRAS-600 017.
(Phone **445232**)

# రిలయన్స్

రెండు లక్షల మందికి పైగా రిలయన్స్‌లో పెట్టుబడి పెట్టి లాభాలు గడించారు




నేడు గతాన్ని మించిన అవకాశం:

# రిలయన్స్ టెక్స్‌టైల్స్‌లో పెట్టుబడికి మరో చక్కని అవకాశం – సంపూర్ణ సురక్షితమైన కన్వర్టిబుల్ డిబెంచర్స్

79.50 కోట్ల రూపాయల వ్యయంతో, అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన అమెరికన్ కంపెనీ డ్యూపాంట్ వారి సాంకేతిక సహకారంతో నెలకొల్పబడుతున్న రిలయన్స్ పాలియెస్టర్ ఫిలమెంట్ యార్న్ ప్రాజెక్టులోని కొంత వ్యయంకోసం, అతి త్వరలో రిలయన్స్ టెక్స్‌టైల్స్‌వారు 24 కోట్లరూపాయల విలువగల డిబెంచర్స్‌ను (ఒక్కొక్కదాని వెల రూ. 125) విడుదల చేయబోతున్నారు.

# డిబెంచర్స్

## మీ పెట్టుబడికోసం 7 చక్కని కారణాలు.



**1** సంపూర్ణ సురక్షితమైనవి: కంపెనీ స్థిరాస్తిని ఈ డిబెంచర్స్‌కి మదుపుగా పెట్టడం వల్ల, మీ పెట్టుబడి సురక్షితం.

**2** కొనుగోలు, అమ్మకం సులభం: బొంబే, అహమ్మదాబాద్, ఢిల్లీ, కలకత్తా, బెంగళూర్ మరియు మద్రాస్ స్టాక్ ఎక్స్ఛేంజెస్‌లో ఈ డిబెంచర్లను 'లిస్ట్' చేయటం వల్ల, కొనుగోలు, అమ్మకం సులభం.

**3** 13.5% వడ్డీ: నికరమైన ఆదాయం

**4** పెరిగే పెట్టుబడి: 31 ఆగష్టు 1982 నాటికి ప్రతి డిబెంచర్‌కి ఒక రిలయన్స్ షేర్ (ప్రస్తుత మార్కెట్ ధర రూ. 95) ఇవ్వబడుతుంది, రూ. 25 కి మాత్రమే. దీనివలన మీ పెట్టుబడి విలువ పెరగటమే కాకుండా, దిన దినాభి వృద్ధి చెందుతున్న కంపెనీలో మీరు భాగస్వాములవుతారు.

**5** అధిక ఆదాయం: 54 శాతం, లేక ఇంకా ఎక్కువ పైన వివరించినట్లుగా, 31 ఆగష్టు 1982 నాటికి మీకు ప్రతి డిబెంచర్‌కి ఒక కంపెనీ షేర్ లభ్యమవుతుంది. దీని ప్రస్తుత ధర రూ. 95. అప్పటికి ఈ షేర్ ధర, రూ. 100 అనుకోండి—మీరు ఈ షేర్‌ని అమ్మినట్లయితే, ప్రతి డిబెంచర్ మీద మీ పెట్టుబడి ఒక్క రూ. 25 మాత్రమే. అయితే మీకు వచ్చే వడ్డీ మాత్రం రూ. 100 కి—అంటే మీ రూ. 25 మీద రూ. 13.50 వడ్డీ అన్నమాట (54 శాతం.) మీ మిగిలిన పెట్టుబడి రూ. 100 (125 లోంచి, షేరు కోసం రూ. 25 ను మినహాయించగా మిగిలిన మొత్తం) మీకు తిరిగి ఇవ్వబడుతుంది, దీని మీద టెక్స్ ఉండదు.

**6** బోనస్: కంపెనీ నిల్వలు మరియు ప్రస్తుతం అమలులో ఉన్న బోనస్ ఇష్యూ గురించిన నిబంధనలను బట్టి, 1982 లో రిలయన్స్ టెక్స్‌టైల్స్ బోనస్ షేర్స్‌ను ప్రకటించవచ్చు. ఇది జరిగినట్లయితే; మీకు వచ్చే షేర్ల సంఖ్య పెరుగుతుంది.

**7** ఇంతవరకు పెట్టిన పెట్టుబడుల మీద వచ్చిన లాభాలు:

| పెట్టుబడి | ధర పెరుగుదల ఆదాయం (ఏప్రియల్ 1981 వరకు) | పెట్టుబడి నాటి షేర్ ధర | ప్రస్తుత షేర్ ధర (ఏప్రియల్ 1981) |
|---|---|---|---|
| నవంబర్ 1977 ప్రతి షేర్ 10 రూ॥లు | షేర్ ధర 1155 శాతం పెరిగింది. ప్రతి షేర్ మీద రూ. 11.37 డివిడెండ్ లభించింది. ఇదంతా కేవలం 42 నెలల్లో | రూ. 10 | రూ. 95 |
| డిబెంచర్ సిరీస్-1 ఒక్కటి రూ. 500, అక్టోబర్ 1979 | 19 నెలల్లో రూ. 487 (97 శాతం) ఆదాయం | రూ. 55 | రూ. 95 |
| డిబెంచర్ సిరీస్-2 ఒక్కటి రూ. 125, నవంబర్ 1980 | 6 నెలల్లో మార్కెట్ ధర రూ. 160 కి పెరిగింది. ఇదేకాక 12 శాతం వడ్డీ | రూ. 65 | 31-12-1981 నాటికి ఒక షేరు ఇవ్వబడుతుంది. ప్రస్తుత షేర్ ధర రూ. 95 |
| ప్రస్తుత డిబెంచర్స్ ఒక్కొటి రూ. 125 | 13.5 శాతం వడ్డీ | రూ. 95 | 31-8-1982 నాటికి ఒక షేర్ ఇవ్వబడుతుంది. ప్రస్తుత షేర్ ధర రూ. 95 |

కంపెనీలోని ప్రస్తుత షేర్ హోల్డర్స్‌కి, సిరీస్-1 మరియు సిరీస్-2 డిబెంచెర్ హోల్డర్స్‌కి, ఇంకా డిపాసిట్ హోల్డర్స్‌కి ఈ క్రొత్త డిబెంచర్స్ ఎల్లాట్‌మెంట్‌లో ప్రాముఖ్యత ఇవ్వబడుతుంది.

Mudra/RTI/273/Tel.




## రిలయన్స్ టెక్స్‌టైల్ ఇండస్ట్రీస్ లిమిటెడ్

రిజిష్టర్డ్ ఆఫీస్: కోర్ట్ హవుస్, తిలక్ మార్గ్, దోబీ తలావ్, బొంబే-400 002.

**దిన దినాభి వృద్ధి చెందుతున్న సంస్థలో పెట్టుబడి చేయండి.**

**1981 10 జూన్ పబ్లిక్ ఇష్యూ ప్రారంభం!**

## గోరుచిక్కుడు మసాలా

కావలసిన వస్తువులు :

గోరుచిక్కుడు అర కె.జి., కందిపప్పు 250గ్రా, జీలకర్ర అరస్పూన్, పసుపు,కొబ్బరి 1చిప్ప, ఎండుమిర్చి 12, ఉప్పు, చింతపండు నిమ్మకాయ సైజు, కరివేపాకు, నూనె100గ్రా, ఉల్లిపాయలు పెద్దవి 2, తెల్లపాయ 1.

తయారుచేయు విధానం :

కందిపప్పు గంటసేపు నీటిలో నానబెట్టిన తర్వాత రోటిలో కందిపప్పు, జీలకర్ర, పసుపు, ఎండుమిర్చి, ఉప్పు, చింతపండు, కరివేపాకు, తెల్లపాయలువేసి మెత్తగా,నున్నగా రుబ్బుకోవాలి. కందిపప్పు ముద్దకు కాస్త నీరు కలిపి ఇడ్లీ పిండి లాగా చేసుకోవాలి. గోరు చిక్కుడును చిన్నచిన్న ముక్కలుగా చేసి, ఉడకబెట్టి, నీరు వడగట్టి గోరుచిక్కుడు ముక్కలను ప్లేట్లో తీసుకోవాలి. కొబ్బరిచిప్పను తురుమాలి. ఉల్లిపాయలను ముక్కలుగా వేసుకోవాలి. స్టౌ మీద బాణలిఉంచి నూనె, ఆవాలు వేయాలి. ఆవాలు వేగిన తర్వాత కరివేపాకు, ఉల్లిపాయ ముక్కలువేసి వేయించాలి. తర్వాత రుబ్బుకున్న కందిపప్పుముద్దను బాణలిలో వేసి 5 నిమిషాలు వేయించాలి. ఉడకబెట్టిన గోరుచిక్కుడు ముక్కలను అందులో వేయాలి. తడిచేతితో తాకితే మసాలా చేతికి అంటకూడదు. బాణలిని క్రిందకు దించి కొబ్బరికోరు చల్లాలి. మంట ఎక్కువగా ఉండకూడదు.

— కె. జి. హేమలత

## నే నెవరికోసం బ్రతకాలి ?

[ 26వ పేజీ తరువాయి]

"అన్నట్లు చెప్పడం మరిచాను. మా మిసెస్ డెలివరికి పుట్టింటికి వెళ్ళింది" అన్నాడు.

"అలాగాండీ ... వీరు మావారు డాక్టర్" అని శేఖర్‌ని పరిచయం చేసింది.

"నమస్కారం డాక్టరుగారు! చాలా సంతోషంగా ఉంది తెలిసినవాళ్ళు ఈ ఊళ్ళో ఉన్నారంటే! మీరు పిలిచినా, పిలవకపోయినా మీ ఇంటికి వస్తానండోయ్ డాక్టరుగారు" అన్నాడు పళ్ళు ఇకిలిస్తూ.

"ఆ...రండి" అన్నాడు ముక్తసరిగా శేఖర్.

"మరి అడ్రస్ చెప్పరూ" అన్నాడు.

ఇక తప్పదన్నట్లు అడ్రస్ చెప్పాడు శేఖర్.

సంభాషణ తెంచాలి అన్నట్లు 'వస్తాం అండి' అంది ఇందిర.

"మంచిదండి ! రేపుగాని ఎల్లుండిగాని వస్తానండి" అని ఇరువురికి చెప్పి అక్కడనుండి వెళ్ళిపోయాడు.

అదురుతున్న గుండెతో కారులో కూర్చుంది ఇందిర. చిన్ననాటి స్నేహాన్నికూడ ఈయన అపార్థం చేసుకుంటాడా !

కారు మలుపు తిరిగింది. డ్రైవింగ్ చేస్తున్న శేఖర్ ఇందిర వైపు తల త్రిప్పి, "ఛీ...ఛీ... నీలాంటి ఆడదానిని ఎక్కడా చూడలేదు. మగవాళ్ళతో స్నేహమా ? వెధవ ! ఇన్నాళ్ళకు కలుసుకున్నందుకు సంతోషంగా ఉందట."

"ఏమండీ !... మీరు ఇప్పుడుకూడ అనుమానిస్తున్నారా ? చిన్ననాటి స్నేహంలో కలుషితం ఊహిస్తున్నారా ? మీరు ఇంత అవివేకంగా..."

డ్రైవ్ చేస్తున్నవాడు స్టీరింగ్ మీదనుండి చేయి ఎత్తి "నోరు ముయ్ ! చేసేవి వెధవపనులు... వాడు ఇంటికి రావడానికి అంత మోజు పడుతుంటే నేను బాధపడడం అవివేకమా ?" అన్నాడు.

"మీరు ఏమన్నా అనుకోండి. నాకేం చెప్పాలో కూడ తెలియడంలేదు. మీరు లేనిపోనివి ఊహించుకుంటున్నారు. మేమందరం కలసి ఆడుకొనేవాళ్ళం ! ఎంతో అమాయకంగా గలగలా మాట్లాడేవాడు. ఇందిరా ! ఇందిరా అని నా చుట్టూ తిరిగేవాడు" అంది.

"ఓహో ! అంత సన్నిహితం ఉందన్నమాట" వ్యంగ్యంగా అన్నాడు.

"సన్నిహితం కాదండి. చిన్ననాటి స్నేహంలో నిష్కలమైన ప్రేమే ఉంటుంది. మీరు ఏం చెప్పినా అర్థం చేసుకొనే స్థితిలో లేరు. నాకంటే చిన్నవాడు కావడంవలన బావ అని పిలిచేదానిని."

"ఓహో ! మరి ఇప్పుడు పిలవలేదేం ? నేను లేకపోతే పిలిచేదానివా ?"

"భగవాన్ ! లేనిపోని అనుమానాలతో నా మనసుని గాయపరచకండి. మీలో అనుమానాలు రోజు రోజుకి ఎందుకు పెరిగిపోతున్నాయో అర్థం కావడంలేదు. ఆనాడు మీరు ఏరికోరి వివాహం చేసుకున్నందుకు ముందు జీవితం గూర్చి ఏవేవో సుందర స్వప్నాలు కన్నాను. మన ఇద్దరిమధ్య ఎటువంటి అపార్థాలకు, అనుమానాలకు తావు ఉండదు అనుకున్నాను. కాని మీరు... మీరు నా మనసుని రోజుకోసారి అయినా ఇలా..."

"ఛీ ... ఛీ ... నువ్వు అసలు ఆడదానివి కావు. ఇలా అని తెలిస్తే నన్ను చేసుకోపోదువు. అంతేనా ? ఏ అందగాడినో కిషోర్, శ్రీను లాంటి వాడిని చేసుకుందువు. వయసు తొందరలో నన్ను..."

"పొరబడుతున్నారండి ... నేను తొందర పడలేదు. ఆనాడు మీరు నన్ను వివాహం గూర్చి అడిగిన మాటలు చూసి మీది పవిత్రమైన ప్రేమ అనుకున్నాను కాని ..."

కారు పోర్టికోలో ఆగడంతో డోరు తెరుచుకొని గుమ్మంవైపు పరిగెత్తింది ఇందిర.

"ఈమెగారికి ఇప్పుడు తెలిసింది కాబోలు ! పవిత్రమైన ప్రేమకాదు...అపవిత్రమైనది అని... రాస్కెల్ ! బోయ్ ఫ్రెండ్ ఒకడు ..."

తలుపు తెరుచుకొని లోపలికి అడుగుపెడుతున్న ఇందిరకు శేఖర్ తనలో గొణుక్కున్నట్లుగా అంటున్న మాటలు వినిపించాయి. చదువు ఉంటే సంస్కారముంటుంది అంటారు ! కాని ! ఎంత సంస్కార హీనుడు ! ఎంత పొరపాటుగా ఆలోచించి శేఖర్‌ని వివాహం చేసుకోవడానికి అంగీకరించి వివాహం చేసుకొంది !

* * *

వీధిలో కాలింగ్ బెల్ మ్రోగడంతో తలుపు తీసిన ఇందిర అవతల వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయింది. కిషోర్ !

"వారు లేరండి" అని తలుపు మూయాలని ప్రయత్నంలో నుండగానే —

"ఎక్కడికి వెళ్ళాడండి? హాస్పిటల్‌కి వెళ్ళాను. ఇంటికి వెళ్ళారు అని చెప్పడంతో ఇంటికి వచ్చాను. ఇంటి దగ్గర ఉంటాడు అనుకొన్నాను. చాలా అర్జంటు పనిఉందే !" అన్నాడు కిషోర్.

ఇందిరకు శేఖర్ ఎక్కడ వస్తాడో, కిషోర్‌తో మాట్లాడడం చూస్తే ఇంకేమైన ఉందా ! అని భయం చోటుచేసుకొంది. తొందరగా కిషోర్‌ని పంపించేయాలని ఉద్దేశ్యంతో — "వారు వస్తే చెబుతానండి" అని తలుపు వేయాలని ప్రయత్నించింది.

"ఎక్కడికి వెళ్ళాడండి? ఎప్పుడు వస్తాడండి" అన్నాడు.

"బజారులోకి వెళ్ళినట్టున్నారండి. రాగానే చెప్పి, మీ ఇంటికి పంపిస్తాను" అని ఇందిర అంటుండగానే ...

"అయితే కొంచెంసేపు వెయిట్ చేస్తానండి. అంతగా రాకపోతే వెళ్ళిపోతాను. రేపు మీట్ కావడానికి కూడ టైమ్‌లేదు" అని తను ఉండడానికి కారణం చెబుతున్న కిషోర్‌కి ఏం చెప్పాలో తెలియక అప్రయత్నంగా, "కూర్చోండి..." అని లోపలికి కంగారుగా వెళ్ళిపోయింది.

నిముషాలు దొర్లుతున్నకొలది శేఖర్ వస్తున్నాడు ఏమో అని కిషోర్, శేఖర్ వస్తే ఏమంటాడో అని ఇందిర ఆలోచనల్లో ఉన్నారు.

పావుగంట దాటుతుండగానే శేఖర్ వచ్చాడు. హాలులో కూర్చున్న కిషోర్‌ని చూసి ఆశ్చర్యపోయాడు. కాని ఆశ్చర్యాన్ని పైకి కనిపించకుండా ప్రవర్తించాలన్నట్లు నవ్వుని బలవంతంగా ముఖం మీదకు తెచ్చుకుని "ఏరా ! ఎంత సేపయింది వచ్చి" అన్నాడు.

"మహానుభావా ! చాలా సేపయింది వచ్చిగాని నీతో అర్జంటు పని ఉండి వచ్చానురా ! బజారుకి వెళ్ళావు అని మీ మిసెస్ చెప్పారు. కొంచెం సేపటిలో వస్తావు, ఎలాగు టైమ్ కూడ లేదు మళ్ళా రావడానికి అని కూర్చున్నాను. మా ఫ్రెండ్ వైఫ్‌కి రేపు సిజేరియన్ ఆపరేషన్ చేయాలన్నాడట డాక్టర్ వెంకట్రావ్. చాలా టెంపర్ ఫెలో అట ... మా ఫ్రెండ్ ఒకటే భయపడుతున్నాడు. ఎవరైనా తెలిసినవాళ్ళు ఉంటే బాగుణ్ణు, వాళ్ళచేత డాక్టర్ వెంకట్రావ్‌కి చెప్పిద్దామని. నాకు నువ్వు గుర్తుకు వచ్చావ్ ! రేపు నువ్వోకసారి ఆపరేషన్ ముందు డాక్టర్ వెంకట్రావుని మీట్ అయి చెబుతావని వచ్చాను. తప్పకుండా నువ్వోకసారి రావాలిరా !"

"అ ... అలాగే ... అలాగే" అని అన్నాడు కాని శేఖర్ మనసులో అనుమానం పిచ్చిగంతులు

సంసారం చల్లగా వుండాలంటే సంతానం తప్పనిసరి!




da DIMPLE

నిర్మాతలు
కొత్తపల్లి రమేష్‌బాబు కొల్లి ఆంజనేయులు

సంగీతం
చక్రవర్తి



'భోగభాగ్యాలు'లో కృష్ణ, శ్రీదేవి

వేయసాగింది. వీడు నిజంగా ఇందుకేనా వచ్చాడు. లేక ఇందిరపై నెట్ ఏదైన విసిరి ... ''

''ఏమ్రిటా అలా ఉన్నావ్ ?'' అని కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు కిషోర్.

''ఆ ... ఏం లేదురా ! ... '' అన్నాడు.

''వెళతానురా ! మీ మిసెస్ ఎక్కడా ! లోపలున్నట్లున్నారు. చెప్పరా వెళుతున్నట్లు, రేపు ప్రొద్దున్నే ఒకసారి డా॥ వెంకట్రావ్ దగ్గరకు రావాలి. నేనక్కడే ఉంటాను'' అని వెళ్ళిపోయాడు కిషోర్.

''రాస్కెల్ ! ఇప్పుడేం చెబుతావ్ ! లేనిపోని అనుమానాలతో బాధపెడుతున్నాను అన్నావే, నేను లేని సమయంలో వాడిని ఇంట్లో కూర్చోమంటావా?'' అని ఎర్రబారిన కళ్ళతో తీక్షణంగా చూడసాగాడు.

పరాకుగా కూర్చున్న ఇందిరకు శేఖర్ మాటలు మనసుని బాధపెట్టడం మొదలుపెట్టాయి.

''ఏమండీ... అతను...''

''ఛీ...ఛీ.. నీతో మాట్లాడడం బుద్ధితక్కువ. నీవు వాడితో సంబంధం పెట్టుకోవాలని ఉండబట్టే, నేను వాడు రోగ్ అని చెప్పినా తలుపు తీసి కూర్చోపెట్టావ్ ?''

''ఏమండీ ! ప్రతీ నిముషం అనుమానాలతో





వేదించకండి. మనిషి ఆశాజీవి అని మీరే అన్నారు కదా ? ఆ భగవంతుని రోజూ మీలో బయలుదేరిన అనుమాన బీజాన్ని తొలగించమని కోరుతున్నాను. రోజు రోజు మీలో మార్పు వస్తుంది ఏమో అని ఆశతో జీవిస్తున్న నన్ను ఇలాంటి అనుమానాలతో బాధపెట్టకండి'' అంది.

''ఓహో ! చాలా పెద్ద స్పీచ్ ఇచ్చావే ! నీలాంటిదానికి భగవంతుడొకటా !'' అన్నాడు.

''స్త్రీని ఎంత తక్కువగా అంచనా వేస్తున్నారు. అతనెవరో చెడువాడైతే మీ భార్య గుణం కూడా చాపల్యం చెందుతుందనా మీ అభిప్రాయం ? ఎంత పొరబడుతున్నారండి ? తులసీవనంలో గంజాయి మొక్క పుట్టినట్లు ఎక్కడో ఎవరో బుద్ధిచాపల్యులు ఉంటారు ఏమోకాని భారత స్త్రీ కోరుకునేది భర్తనేనండి'' అంది ఏడుపుమధ్య.

''ఓహో ! నీలాంటిదో'' అన్నాడు గంభీరంగా శేఖర్.

''ఏమండీ ! ఇలాంటి మాటలతో నా మనసుని చిత్రవధ చేయడమే మీ ధ్యేయంగా పెట్టుకున్నారు. ఇన్నాళ్ళు మీరు మారుతారన్న ఆశతో మీ ఇష్టమొచ్చినట్లు మాట్లాడినా సహిస్తూవచ్చాను. ఇక నావల్ల కాదండి'' అంది బొంగురుపోయిన గొంతుతో ఇందిర.

''ఆహా !... అంతవరకు వచ్చావన్నమాట. నాకు తెలుసు నీ ఆంతర్యం. ఆనాడు నీగురించి అడుగగానే ఎంత తొందరగా ఒప్పుకున్నావో ? ఇప్పుడు ఈ వెధవ అందులోకి నాకన్నా అందగాడు అడుగాలేకాని...''

''ఆపండి మీ మాటలు ! మీరు ఏమన్నా సహిస్తూ వచ్చాననే ఇలా నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నారు. మీరు లేనిపోని అనుమానాలతో బాధపెడుతున్నారు. కాని అసలు మీరు ఎప్పుడైన నా మనసు ఎటువంటిదో ఆలోచించారా ? నాకే అందంమీద మోజు ఉంటే ఆనాడు మిమ్మలను వివాహం చేసుకోవడానికి అంగీకరించేదానిని కాదు. నాకు కావలసింది బాహ్య సౌందర్యం కాదు మనిషి యొక్క...''

''నోరుముయ్ ! వెధవవాగుడు వాగకు. ఆనాడు నా ఆస్తి — అంతస్తు, నా కారు... నా లక్షల ఆస్తి చూసి చేసుకున్నావ్ ! అప్పుడు నా అందంతో సంబంధం లేదనుకున్నావ్ ! కాని ఇప్పుడు నీక్కావలసిన ఆస్తి నీ గుప్పెటిలో ఉంది. ఇక కావలసింది కిషోర్‌గాడిలాంటి —''

''ఛీ...ఛీ... మీరు... ఇంత సంస్కారహీనులు అనుకోలేదు. మీరు ఏవేవో ఊహిస్తున్నారే ఆ నిజాన్ని కళ్ళారా చూసారా ? ఏం చూసి నన్ను అనుమానంతో చంపుతున్నారు. మీరు... ఇక మారరు ! ఇన్నాళ్ళు ఎప్పటికైన మీ మనసు మారుతుంది అనుకున్నాను. కాని దేముడు మీకు మనసుకి బదులు రాతిగుండెని... ఛ...ఛ... దేనితో పోల్చిన మీకన్నా అదే నయం !''

ఇందిర రెండు చెంపలు వాచిపోయేటట్లు ఎంతసేపు కొట్టాడో శేఖర్‌కి తెలియదు. పళ్ళు పటపటా కొరుకుతూ ''నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నావ్ జాగ్రత్త'' అని మరల చేయి ఎత్తబోయాడు.

''హుం... కొట్టండి బాగా. నా ప్రాణాలు పోయేవరకు కొట్టండి. మీలాంటి అనుమానాల భర్తతో మనసుని చంపుకుంటూ కాపురం చేసేకన్నా చనిపోవటమే మంచిది.'' అని ఇక అక్కడ ఎంతోసేపు నిలబడలేనట్లు గబగబ అడుగులు వేసింది.

* * *

గదిలోకి వెళ్ళి మంచంమీద వాలిపోయింది ఇందిర. పెన్ను, డైరీ వెక్కిరిస్తున్నట్లుగా మంచం మీద ఉన్నాయి. అవి రెండు తను ఈ మూడేళ్ళు కాపురం చేయడానికి ఎంత సహాయపడ్డాయ్ ! మనసులో రగులుతున్న బాధ ఎవరితో చెప్పుకో గలదు ? చెప్పుకున్నా నలుగురి దృష్టిలో హీనం కావడమే తప్ప ఇక మిగిలింది ఏముంది? ఎవరితోనో చెప్పుకొని తన బాధ పోగొట్టుకోవాలి అని నిత్యం తన మనసు ఆరాటపడడం భరించలేక తన బాధ అంతా జీవంలేని ఆ పుస్తకంలో వ్రాసుకుంటే మనసుకి కొంత ఊరట కలిగేది. ఎప్పుడో ఒక్కరోజు తన భర్త తనతో మాట్లాడితే, తన మనసు ఆనందంతో పరవళ్ళు త్రొక్కేది. ఆయన మారతారు. నేనంటే ప్రేమ ఉంది అని పొంగి పోయేది ! కాని ... భగవాన్ శేఖర్‌కి ఎందుకు అలాంటి మనసు ఇచ్చావ్ అని పొంగిపొరలుతున్న దుఃఖాన్ని అదుపులోకి తెచ్చుకోవాలన్నట్లు పమిట కొంగు అడ్డంగా పెట్టుకొంది. మరు క్షణంలో ఏదో నిశ్చయించుకున్నదానిలా డైరీ తీసి వ్రాయడానికి నిశ్చయించుకొంది. చిన్నతనంలో తెలుగులో చదివినది గుర్తు వచ్చింది. శేఖర్ తను వ్రాసింది నమ్ముతాడా ? అని, నిర్లిప్తమైన నవ్వు పెదాలపై బయలుదేరింది.

''ప్రియమైన శ్రీవారికి,

ఇందిర వ్రాయునది. నేను వ్రాసిన ఈ ఉత్తరం చదివి, నేను చనిపోయాకైన నిర్దోషినని మీరు ఒక్కసారి అనుకుంటే చాలు అని నా మనసు ఆరాటపడుతున్న, మీరు నా కోసం క్రొత్తగా లేని సంస్కారం తెచ్చుకోమని నేను చెప్పడంలేదండి. ఏమండీ ! మీరు ఆనాడు నన్ను వివాహం చేసుకోవడానికి అంగీకరించగలరా ? అని అడిగినప్పుడు నా మనసులో ఏ మారుమూలనో ఆనందం బయలుదేరిందనే చెప్పాలి. దానికి కారణం ఉన్నతమైన స్థానంలో ఉన్న ఒక సంస్కారవంతుడు ... ఒక మగాడు ఆడదానిని అలా అడగడం చాలా గర్వ కారణం అనే అనుకొన్నాను. మీ రూపం అప్పుడు నా కళ్ళముందు కనబడలేదు. మీరనుకొన్నట్లు మీ ఆస్తి... మీ కారు ఏవీకూడా నాకు కనబడలేదు. నాకు కలిపించిందల్లా ఒక్కటే ! మీరు నన్ను ఏరి కోరి వివాహం చేసుకుంటాను అని అడగడం. ఒక ఆడపిల్లకు అంతకన్నా కావలసినది ఏముంది ? కాని అప్పట్లో మీతో వివాహానికి అంగీకరించడానికి కారణం నాకు ఎదురైన రెండు జీవితాలే అని చెప్పాలి. ఆ రెండు జీవితాలు నా కళ్ళ ఎదుట కనిపించకపోతే మీరన్నట్లు కొందరి ఆడపిల్లల్లా కిషోర్ లాంటి అందమైన అబ్బాయిని వివాహం చేసుకోవాలని సెలక్టు చేసుకొనేదానిని ఏమో ! నా ఫ్రెండ్ రజని ఎంతో అందగత్తె




# నిప్పో స్పెషల్

నిప్పో స్పెషల్ ఎప్పుడూ సరికొత్తగా 'టాప్ సీల్'తో నాణ్యతకి సంబంధించిన ISI చిహ్నంతో వస్తుంది. టాప్ సీల్ వున్న మొట్టమొదటి పేపర్ క్లాట్ బ్యాటరీ నిప్పో స్పెషల్. ప్రపంచ ప్రసిద్ధి చెందిన నేషనల్ కంపెనీ (జపాన్) సాంకేతిక విధానంతో ఇది తయారుచేయబడింది.

అత్యుత్తమంగా పనిచేస్తుంది. దీర్ఘకాలం మన్నుతుంది. టార్చి లైట్లకి మరియు ట్రాన్సిస్టర్లకి అనువైన బ్యాటరీ నిప్పోస్పెషల్.

NIPPO
SPECIAL
DUAL PURPOSE
Long Life
National
MADE IN INDIA






## నిప్పో స్పెషల్

ప్రపంచ ప్రసిద్ధిచెందిన జపాన్‌లోని నేషనల్ కంపె
సాంకేతిక విధానంతో తయారుచేయబడింది.

6NL-2470

దానికి అందగత్తెనని, నాలా ఎవరూ లేరు అన్న అహం కూడా వుండేది! పెళ్ళి అంటూ చేసుకుంటే నా అందానికి పోటీ పడేవాడినే చేసుకుంటాను అని మా అందరితో అనేది. అలానే చేసుకొంది. కాని పెళ్ళి అయిన మూడు నెలలు తిరగకుండానే తెలిసింది. అతనికి ఒక అమ్మాయితో సంబంధం మూడు ఏళ్ళబట్టి ఉంది అని. దాని ఫలితం భర్తతో విడాకులు తీసుకొంది రజని. మా ఎదురింట్లో క్రొత్తగా వివాహం అయిన ఒక జంట దిగారు. ఆమె పెద్ద అందగత్తె కాదు కాని అతను చాలా అందగాడనే చెప్పాలి. ఇద్దరూ ఎంతో సరదాగా, హుషారుగా మోటరుసైకిల్‌మీద తిరిగేవారు కాని అప్పుడప్పుడు ఆమె ఎంతో దిగులుగా, పరధ్యానంగా ఉన్నట్లు కనిపించేది. కాని ఒకరోజు అకస్మాత్తుగా ఆమె చీరకు నిప్పు అంటించుకుని కాలిపోయింది. తరువాత తెలిసింది ఆమె భర్త వట్టి అనుమానాల మనిషి అని. ఈ రెండు సంఘటనలు నాలో ఏదో తెలియని మార్పు తెచ్చాయి. ఒక కాపురం బ్రతికినంత కాలం సుఖసంతోషాలతో ఉండాలంటే ఒక్క బాహ్య సౌందర్యం ముఖ్యం కాదు అని అప్పట్లో తెలుసుకున్నాను. దాని ఫలితమే ఇంట్లో ఎవరికి పెద్దగా ఇష్టం లేకపోయినా మీతో వివాహానికి అంగీకరించాను. కాని ఇప్పుడు తెలిసింది, మనిషిని చూసినంత మాత్రాన మంచి చెడు తెలుసుకోలేము అని! కాని మీరన్నట్లు మీ రూపం ఎలా వున్నా, కిషోర్ లాంటి వాళ్ళను ఎంతమందిని చూసినా, మన గడ్డమీద పుట్టిన స్త్రీ ఒకసారి భర్తచేత మూడు ముళ్ళు మెడలో కట్టించుకున్నాక, పరాయి పురుషుడిని మీరన్నట్లు... వ్రాయడానికే నా మనసు అంగీకరించడం లేదండి!

ఇన్నాళ్ళు నాలో రగులుతున్న బాధ మీకు తెలియజేయాలని వ్రాస్తున్నానే కాని మీరు నన్ను నిర్దోషిని అని నమ్మమని మీకు లేని సంస్కారాన్ని తెచ్చుకోమని నేను వ్రాయడం లేదండి.

కాని ... నేను బాధపడుతున్నదల్లా ఒక్కటే! భగవంతుడు ఆడదానికి అంత సున్నితమైన మనసు ఎందుకిచ్చాడు? భర్త తాగుబోతైనా, అనుమానితుడైనా, తిరుగుబోతైనా, ఆ నిముషంలో భర్త నడవడిక గూర్చి బాధపడుతుంది. కాని మరు నిముషంలో భర్తే తన సర్వస్వం అని ఎందుకు మురిసిపోతుంది? ఆడదానిలో ప్రేమ, మమత, అనురాగాలు అంత ఎక్కువగా ఎందుకు పెట్టాడు? మాలో పెట్టిన మమతానురాగాలలో కొంతైన మీలాంటి మగవాళ్ళలో పెడితే ఇప్పుడు నా జీవితం ఇలా ముగిసేది కాదు ఏమో కదండి? మీకు, నాలో ఇన్నాళ్ళు నేను అనుభవించిన బాధ మరోసారి ... మరోసారి తెలియాలి అని, మీరు ఇన్నాళ్ళు మీకు మీరే చులకన భావం ఏర్పరుచుకొని, నన్ను లేనిపోని అనుమానాలతో బాధపెట్టి నా మనసుని పూర్తిగా గాయపరిచారని మీకు వ్రాస్తే నమ్ముతారని వ్రాయడం లేదండి! కాని నేను తెలుసుకున్న సత్యం ఒక్కటే! మన గడ్డమీద మీలాంటి మగవాళ్ళు లేనిపోని అనుమానాలతో ప్రతి నిముషం భార్యల పవిత్రమైన శీలాన్ని శంకించవచ్చు అని, ఆడవాళ్ళ అబలత్వాన్ని మీకు ఆహుతి చేసుకోవద్దని

## నే నెవరికోసం బ్రతకాలి?

రెండు చేతులు జోడించి కోరుతున్నాను. ఇప్పటికే మీకు సుదీర్ఘలేఖ వ్రాసి, మిమ్మలను విసిగించినందుకు క్షమించండి. ఈ లోకం నుండి నిష్క్రమించేలోగా మీకో విన్నపం వ్రాస్తున్నాను. దయుంచి ప్రాణంతో సమానంగా చూసుకొనే నన్నుక, భార్యను పోగొట్టుకొని ఆమెతో గడిపిన మధురస్మృతులలో కాలం గడుపుతున్న ఉన్నతుడైన వృద్ధాప్యంలో ఉన్న నా తండ్రికి నా చావు ఎటువంటిదో మాత్రం తెలియజేయకండి.

స్త్రీకి యవ్వనం దశనుండి తనువుచాలించే వరకు భర్త చేదోడు వాదోడుగా ఉంటే భర్త తన సర్వస్వం అనుకుంటుంది. కాని ఏ ప్రేమ, ఆప్యాయత, అనురాగలు నోచుకోలేని నేను — "నేనెవరి కోసం బ్రతకాలి?" మీరే ఆలోచించుకోండి.

ఇట్లు
ఇందిర."



వ్రాయడం పూర్తికాగానే ఇందిరలో ఎక్కడ లేనిశక్తి వచ్చింది. గబగబా అడుగులువేసి టేబుల్ దగ్గరకు వెళ్ళి స్లీపింగ్ టాబ్లెట్స్ గుప్పెడు చేతిలో వేసుకొంది. ఏదో కసి! తనమీద తనకు తెలియకుండానే తొందరగా వెళ్ళిపోవాలన్న ఆరాటం. నోరు తెరిచి గుప్పెడు నోటిలో వేసుకోబోయింది. అంతలోనే తన తొందరపాటుకి నవ్వువచ్చింది మాత్రలు వేసుకున్న వెంటనే తనకు తెలియకుండానే ఏదో నిస్సత్తువ బయలుదేరింది. నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ మంచం దగ్గరకు వెళ్ళి మంచంమీద వాలిపోయింది

తెల్లవారింది. బెడ్‌రూమ్‌లో అటు ఇటు కోపంగా, పచార్లు చేస్తున్నాడు శేఖర్. "ఎంత పొగరు ... వంటాలకి పోవడం నేర్చుకుంది. ఒక్కతి హాయిగా వెళ్ళిపడుకొంది" మనసులోనే గొణుక్కొసాగాడు శేఖర్.

వీధిలో బెల్ మ్రోగడంతో తలుపు తీసాడు శేఖర్.

"ఒరేయ్! మా ఫ్రెండ్ వైఫ్‌కి చాలా సీరియస్‌గా ఉందిరా! ప్రొద్దునుండి మనమీద తెలినేలేదు. నువ్వు ఒక్కసారి తొందరగా రారా" అన్నాడు గాభరాగా కిషోర్.

"ఇంకా ముఖమే కడుక్కోలేదురా, ఇదిగో ఒక్క నిముషంలో వస్తాను, కూర్చో" అని వెనుతిరిగాడు.

"అయ్యగోరు! ఎంతపని అయిపోనాది. అమ్మగోరు ... అమ్మగోరు..." అని ఏడవసాగింది గుండెలు బాదుకుంటూ లక్ష్మి.

"ఏమయింది అమ్మగారికి, చెప్పులక్ష్మి" అని కంగారుగా ఇందిర పడుకున్న గదివైపు నడవసాగాడు.

"ఇంకెక్కడి అమ్మగోరు! భగవంతుడా! ఎక్కడున్నావయ్యా ... దేవత లాంటి అమ్మగారిని తీసుకెళ్ళిపోయావు" అని గుండెలు బాదుకోసాగింది లక్ష్మి.

కిషోర్ లక్ష్మి మాటలు విని కంగారుగా శేఖర్ వెళ్ళిన గదివైపు పరిగెత్తాడు కిషోర్.

"ఇందిరా! ఎంత పని చేసావు! ఇందిరా! నువ్వు... నువ్వు ఇంత పని చేస్తావు అనుకోలేదు" అని మంచంమీద స్పృహ లేకుండా పడివున్న ఇందిర వైపు చూస్తూ, ప్రక్కనే ఉన్న డైరీని తీసి ఆత్రుతగా చదివి, "నేను మనిషిని కాను ఇందిర, పశువుని. అందరు ఆడవాళ్ళు లతలాంటి ఆడవాళ్ళే అనుకున్నాను కాని కొందరు నీలా మనసుకే ప్రాధాన్యత ఇస్తారు అని తెలుసుకోలేకపోయాను. నా కళ్ళనిండా అనుమాన పొరలు కమ్ముకున్నాయి. కాని మంచీ - చెడు ఆలోచించలేకపోయాను. నా ఆస్తి — అంతస్తు చూసి నువ్వు నన్ను వివాహం చేసుకున్నావు కాని నా రూపం అంటే ఏహ్యభావం నీ మనసులో ఉండే వుంటుంది అని నా మనసు శంకించేది. అందుకే ఏ మగాడు నిన్ను చూడకూడదు అని, నువ్వు ఏ మగాడిని కన్నెత్తి చూసినా నా రూపంమీద అసహ్యం బయలుదేరుతుంది అని, దాని ఫలితంగా నువ్వు నాకు కాకుండాపోతావు ఏమో అని భయం బయలుదేరింది. నేను బ్రతకడం వ్యర్థం" అని ఇందిరపై ఒరిగి, రెండు చేతులమధ్య ఇందిర ముఖం ఉంచుకొని, బోరున ఏడ్వసాగాడు శేఖర్.

ఇందిర ప్రక్కనే ఉన్న డైరీలో వ్రాసినది అంతవరకు చదివిన కిషోర్ నిశ్చేష్టుడయ్యాడు.

"శేఖర్!... నువ్వు ఇంత నీచుడివి అనుకోలేదు. దేవతలాంటి భార్యను చేజేతులారా చంపావ్! నేనెంత తిరుగుబోతునైన, జులాయివాడినైన అది ఇప్పుడు కాదే! కాలేజి జీవితం కొందరిని అధఃపాతాళానికి త్రొక్కుతుంది. కొందరిని ఉన్నత స్థానంలోకి తెస్తుంది. అధఃపాతాళానికి వెళ్ళినవాళ్ళు నిలద్రొక్కుకొని నిలబడినవాళ్ళు ఉన్నారు. స్నేహితుడి భార్య చెల్లెలితో సమానంరా! అయినా ఆ దేవత చెప్పినట్లు నీవు సంస్కారహీనుడివి" అని ఆవేశంగా అన్నాడు కిషోర్!



# మనోహరమైన సరికొత్త రూపంలో...

PONDS VANISHING CREAM

## పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్

బయటకు సన్నగా కనిపిస్తే లోపల తక్కువ క్రీమ్ వున్నట్లు అర్థంకాదు. 70 గ్రాం, 40 గ్రాం. 20 గ్రాం సైజ్‌లలో జాడీలు వస్తున్నాయి. అందమైన అట్టపెట్టెలో వస్తున్న ఈ జాడీలు విరగవు మరియు తేలికయినవి.

మీ చర్మాన్ని ఎప్పుడు మృదువుగానూ, సున్నగానూ, తాజాగాను వుంచేటట్లు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ అందించే వాగ్దానం. అది ఎప్పుడు కాపాడుతున్నది.




* కొన్ని ప్రదేశాలలో మాత్రమే లభిస్తుంది.

**పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్**

HTM-PIL-2474

# ప్రశ్నావళి

**—కె. రామలక్ష్మి**

**వి కె ఎమ్. – మార్యాపేట**

నా స్నేహితుడు ఒకడు న్యూయార్క్‌లో ఉన్నాడు. ఈ మధ్య వచ్చినప్పుడు ఆదివారం ఎక్కడికేనా వెడదామంటే— సినిమాథియేటర్ దగ్గరకి పోయాము. అక్కడి జనాన్ని చూసి ఏమిటిరా ఇక్కడ సంత జరుగుతోందా? అన్నాడు.

లేదు. న్యూయార్క్‌నుంచి వచ్చారు కదా తమని చూడ వేచి ఉన్నారీ జనం అని చెప్పలేదా మీరు! మీ మిత్రుడు న్యూయార్క్‌లో సంతలెన్ని చూశాడట? పుట్టి పెరిగిన ఊరు వదిలి ఎన్నేళ్లయి వెళ్లాడట!?

**కబీర్. – అనంతపురం**

తల్లిగా, చెల్లిగా, సతిగా ఎవరికున్న స్థానం వారు నిలుపుకుని ఆయా స్థానాలలో గౌరవింపబడాలిగాని ఏదోపోగొట్టుకున్నట్టు బాధపడకూడదు.

మీ సూక్తిముక్తావళి విన్నాను. అలాగే— తండ్రిగా, అన్నదమ్మునిగా, భర్తగా మాత్రమే గౌరవ మర్యాదలిచ్చిపుచ్చుకోవడం మగవాడికి మనుగడ ధర్మం కాదా అంటే— అది ఆడిపోసుకోవడమూ సాధించడమూ ఎలా అవుతుందో అర్థంకాదు. స్త్రీపురుష సమానత్వానికీ చుట్టరికాలకీ సంబంధం లేదు. స్త్రీపురుష విచక్షత లేకుండా వ్యక్తులుగా గౌరవించుకోవడమన్నదే- స్త్రీ స్వేచ్ఛావాదుల కోరిక. అంతేగాని భర్త తాగుబోతు కనుక నేనూ తాగుబోతునవుతాను. అతగాడు తిరుగుబోతు కనుక నేనూ తిరుగుబోతునవుతానన్నది కాదు— నిజానికి అలాటి భర్తల వెనుకపడి కుటుంబాలు నాశనం అయిపోకుండా పాటుపడుతున్నది ఎవరనుకుంటున్నారు? స్త్రీలే!

**ఆర్. డి. వి – రాయగడ**

కె. ఆర్. ఎల్.డిఫైన్ లా?

తెలుగులో అడక్కూడదటయ్యా?! ప్రేమంటే ఏమిటి? అదొక అగ్ని. అయితే— కొంప కాలుస్తుందో గుండె వెచ్చబరుస్తుందో— ప్రేమలో పడేదాకా తెలియదు. ప్రేమ పెళ్లితో కాని కుదరని జబ్బు. అందుకే ప్రేమలో పడ్డవాడు అటో ఇటో తేల్చుకోక తప్పదు.

**ఎ ఎస్. – బేతంచెర్ల**

నా స్నేహితుని భార్య చదువుకుంది... తిట్టు — నిర్భయంగా నిరభ్యంతరంగా బజారులోనే తిట్టేస్తుంది. వాడేమో వెంటేసుకుని తిరుగుతూనే ఉంటాడు. వాళ్లెలా కలసి జీవించగల్గుతున్నారు?

మీవంటి దయామయులు తలదూర్చకుండా ఉంటే— వాళ్ల బ్రతుకు వాళ్ల కిష్టం వచ్చినట్టు బ్రతుకుతారు. వారికి లేని బెంగ మీకెందుకు?

**రవి – జైపూరు**

రామలక్ష్మిగారూ, ఇదే పేరుగల ప్రఖ్యాత రచయిత్రి [కేవలం మహిళల నుద్దేశించి మాత్రం మీలాగా రాయరనుకోండి] ఉందని మీకు తెలుసా?

ఎందుకు తెలియదు? పి.రామలక్ష్మి అర్పణ నాకు ఇష్టమైన నవల. (నేను ఆడాళ్ల కోసమే రాస్తే— జాడీ మూతల గురించి, చేతి సంచుల గురించి, తిరాకాల గురించి, చీరలపై కుట్లుగురించి మాత్రమే రాస్తూ ఉండేదాన్ని. అవి ఆడదాని జీవితంలో చాలా చిన్న భాగమని నా నమ్మకం. అయినా ఆడాళ్ల కోసమే రాస్తూంటే మీరెలా చదువుతారు? ఎందుకు చదువుతారు?!)

**కె ఎ – గుంటూరు**

సామాన్యంగా స్త్రీలు ఫొటో అనగానే ఎక్కడలేని మేకప్ చేసుకుని పోజులిస్తారు. మీరు దీపావళి వనితా జ్యోతిలో అలా దెయ్యంలా జుట్టు విరబోసుకుని దిగారు. కారణం ఏమిటి?

ఇక్కడో ఫొటోగ్రాఫరున్నాడు. భూషన్ అని. అతనెవర్ని ఎలా తీసినా ఇలాగే వస్తారు!! నన్ను నీలా మూడసి తల్లి జనాన్ని అని తీశాడు. కాదని ఎలా అంటాం?!

**ఎ య, ప్రసాద్ – తాడలూరు**

మా అభిమాన కవిని మీరు రాచి రంపాన పెట్టేస్తున్నారని మా అనుమానం. ఏమంటారు?

అబ్బా. రాచి రంపాన పెట్టేంత శ్రమపడలేనండీ, అమాత్రం ఓపికుంటే—ఇంకో నవల రాయనా?!

### శాపం!

మరువలేను మరచిపోయి మనలేను
నీ జ్ఞాపకాల సాగరంలో
మనసు వేసే రొద
సుడిగుండాల వ్యథ
ఈ జీవితనౌకలో
"నా" అనే వారెందరోవున్నా
ఎవరూ నావాళ్లు కారు.
హరంది? సాగర జలం
తీరలేదు నా దాహం!
ని పరిచయమే
నా జీవితానికో శాపం!

— మడమనూరి సుబ్రమణ్యం

**శేఖర్. – అనంతపూరు**

చెదరిన మనస్సు దైవానికి అంకితం చేస్తే కుదుటపడుతుంది. కుదురుగా ఉన్న మనస్సు స్త్రీకి అంకితంచేస్తే చెదిరిపోతుంది. కామెంట్?

చెదరిన మనసుకే కదా స్త్రీకి మీరు మనస్సు అంకితం చేసేది?

**బి. ఎస్ నైవేలీ**

ప్రతి వెయ్యి మంది మగ వారికి తొమ్మిదొందల ముప్పయి రెండు మంది ఆడువారున్న మన దేశంలో ఎందుకండీ ఇద్దరు భార్యలు ఒక భర్త థీమ్ మీద దండయాత్రలు సాగిస్తున్నారు— మన రచయిత్రులు?

స్కార్సిటీ కల వస్తువు ఒకటికి రెట్టింపు వుండడం గొప్పగా భావిస్తున్నారేమో మరి!

**ఎల్ వి ఎస్ ఆర్ – భువనేశ్వర్**

భర్త ఎంత చదువుకున్నవాడైనా భార్య పర పురుషునితో మాట్లాడితే సహించలేడంటారు.

పర పురుషునితో మాట్లాడితే కాదు. పర పురుషునితో—వెకిలిగా ప్రవర్తిస్తే. . .ఎవరికైనా సరే వెకిలితనం అనతలివారి ఆత్మ గౌరవం మీద దెబ్బతీస్తుంది.

**ఎ జె ఎస్ – ఎస్. వి. పురం**

కొన్ని సమయాలలో మాట్లాడకుండా ఉండడం కూడా సంభాషణా చాతుర్యం అంటాను నేను. మీరు?

నిజమేనంటాను శేఖర్‌బాబూ, చెప్పదలచినదంతా చెప్పి పెంపడమే— బోరింగు అంటే!

**టి ఆర్. – సికింద్రాబాదు**

నాకు పెళ్లయి ఇద్దరు పిల్లలున్నారు. అయినా నన్ను ఒకావిడ ప్రేమించింది. నేనూ ప్రేమించాను. మా పెళ్లికి నా భార్య ఒప్పుకుంది. మరి మీరేమంటారు?

పబ్లిక్‌గా చేసుకోండి! నాలుగక్షింతలు వేస్తాము. ఇంతకీ ప్రేమించినమ్మాయి—మంచి ఉద్యోగంలో ఉందా ఏమిటి!

**కబీర్ – అనంతపురం**

మీ టీనేజీలో ఏమయినా లవ్ లెటర్స్ పుచ్చుకోవడం, ఇవ్వడం జరిగిందా? రహస్యంగా ఉంచాలంటే చెప్పొద్దులెండి.

ఆ మీ కుర్రాళ్లు గర్ల్ ఫ్రెండ్సు గురించి డబ్బాలు కొట్టుకోవడం చూశాక— నిజం చెప్పడానికి దాపరికం ఎందుకోయ్ కబీరూ?... పాపం ఓ కుర్రాడు ఇచ్చాడు— నేను ఫస్టు ఫారమ్ క్లాసులో చదువుతున్నప్పుడు. కాని అది నేను చదవలేదు. మా జగన్నాథం మేస్టారు చదివి ఓ పాటం చెప్పేసినట్లు లీలగా జ్ఞాపకం ఉంది! అయినా చిన్నతనంలోనైనా నాకూ, సూర్యకాంతానికీ లవ్ లెటర్స్ ఇచ్చే దమ్ములు — చాలా తక్కువమందికే ఉంటాయి. ●





ఆరోగ్యంచిందే పళ్ళు, చిగుళ్ళకోసం నమ్మకంగా వాడబడేది లవంగనూనె

కొత్త

ఇదిగో

# ప్రామిస్ పళ్ళ పొడి

## అనాదిగా వాడబడుతున్న లవంగనూనెతో కూర్చినది

లవంగనూనెతో కూడిన ప్రామిస్ పళ్ళపొడి మీకెలా తోడ్పడుతుందో చూడండి.

- నోటిలో దుర్వాసనను, దంతక్షయాన్ని కలిగించే క్రిములను తొలగిస్తుంది. మీ నోటిని శుభ్రంగా రూపొందిస్తుంది.
- మీ చిగుళ్ళు ఆరోగ్యం చిందించేలా చేసి అతి మెల్లగా రుద్దుతుంది.
- మీ పళ్ళను తెల్లగా తళతళలాడేలా చేస్తుంది.
- పిప్పరమెంట్ మరియు లవంగనూనె యొక్క సాటిలేని రుచి.




బల్సారా
—సౌఖ్యమైన జీవనానికి ఆధునాతన సాధనాలు

## కొత్తది. సాటిలేనిది. లవంగనూనె గలది ప్రామిస్ పళ్ళపొడి

CHAITRA-BLS-436 TEL

( గత సంచిక తరువాయి )







దుశ్శాసనుడు పురిగొల్పటంతో శంఖ భేరీ మృదంగాది నిస్వనమ్ములు సెలంగగా, భీష్మునిరథం ముందంజ వేసినది. వెంటనే ద్రోణ, కృప, అశ్వత్థామలు, కృతవర్మ శల్యులు ఆవెన్క కురు మహావీరులందరు ఒక్కుమ్మడి అస్త్రముల సారించుచు మహోగ్రంగా ముందుకు రాసాగిరి.




వెంటనే భీమసేనుడు పాండవ బలంబులను పురిగొల్ప టంతో ఇరుపక్షములకు పోరుప్రారంభమయింది.

[ఇంకా ఉంది]





# ఎల్లప్పుడు చురుకుగా
# ఎల్లప్పుడు చైతన్యంగా

మీ బిడ్డ పెరుగుతున్నప్పుడు, ఆ బిడ్డ నిరంతరం అదనంగా శక్తి వినియోగించడం జరుగుతుంది.

బూస్ట్‌ను పాలల్లో కలిపితే, రుచికరమైన మాల్ట్ చాకొలెట్ పానీయం తయారౌతుంది. అది మీ బిడ్డకు కావలసిన శక్తిని సమకూరుస్తుంది. ఎందుచేతనంటే బూస్ట్, సంపూర్ణమైన, మీగడ పాలు, గోధుమ, బార్లీ మాల్ట్, కోకోలతో తయారైనది.

మీ బిడ్డకు, శక్తినిచ్చే ఈ ఇంధనాన్ని ఇవ్వండి. అది మీ బిడ్డ రోజంతా, ప్రతి రోజు కూడా చురుగ్గా, చైతన్యవంతంగా ఉండేటట్టు చేస్తుంది.




## చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం

# బూస్ట్

మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

HTD-HMM-6177




ఈ ఎకానమీ రీఫిల్ ప్యాక్ ద్వారా రు. 1/- ఆదా చేయండి

# షాక్షని డైరి

## తొడమీద స్తనం!

బెంగాల్‌లో వో ప్రభుత్వ ఆసుపత్రికి పిల్లలు పుట్టకుండా చేసే ఆపరేషన్‌కు వెళ్లిన వో 32 ఏళ్ళ ఆమెకు అంత పనీ చేయబోయిన డాక్టరు ఎగిరి గంతేసిందట. ఆమెకుడి తొడ మీద ఒక స్తనం ఉందట. ఉండాల్సిన రెండూ సవ్యంగా ఉండి, అదనంగా మూడోది ఆమె తొడ మీద ఉన్నదట. ఆశ్చర్యంనుంచి తేరుకున్నాకఆడాక్టరమ్మ ఆ స్తనాన్ని వివిధ కోణాలలో ఫోటోలు తీసి, ఆనక శస్త్ర చికిత్స ద్వారా తొలిగించిందట.

## టేప్‌ల దుష్ప్రచారం!

భారత ప్రధాని ఇందిరాగాంధిని అవహేళనచేసే పాటలుకొన్ని రాసి, ప్రఖ్యాత సినిమాపాటల వరసలో బాణీలు కుదిర్చి, ఆ పాటలను టేపులమీద ఎక్కించి ఆ టేపులు పాకిస్తాన్‌దేశం స్వదేశంలోనూ మరి కొన్ని మహమ్మదీయమత దేశాలలోనూ వేసుకునివిని ఆనందించడానికి అమ్ముతోందట. ఈ పాటలలో ఇండియాను, ఇందిరానూ పలు విధాలుగా అవహేళన చేసే సాహిత్యం ఉందట. ఈ టేపులను అబుదాబి, కువైట్‌వంటి దేశాలకు కూడా పాకిస్తాన్ పంపిందట. ఈ విషయంలో తమ ఆక్షేపణ తెలుపుతూ భారద్దేశం పాకిస్తాన్‌కు లేఖ వ్రాసిందనీ, ఆ పాటలు ఉరుదూ భాషలో ఉండటం వల్ల అరబ్బు దేశాలకా భావం అర్థం కాదనీ, పార్లమెంటులో కేంద్ర ఆర్థిక మంత్రి వెంకట్రామన్ అన్నారట. అరబ్బు దేశాలలో ఉరుదు వచ్చిన వారు అరుదా! ఏంపాడో!!

## ప్రాణం తీసిన నాటు మందు!

మనప్పార్టై కు చెందిన 16ఏళ్ల సుందరవల్లి అనే అవివాహిత 23ఏళ్ల శివకర్లో అనే వో యువకునితో ప్రేమాయణం సాగించి తత్ఫలితంగాగర్భం ధరించిందట. దాంతో ఆ శివకర్లు ఆమెను కమలమ్ అని వో 60 ఏళ్ల ఆమె వద్దకు తీసుకుపోయి గర్భస్రావానికి నాటు మందు యిప్పించాడట. ఆ మందు విషంగా మారి, సుందరవల్లి వాంతులు చేసుకుని అసలైన వైద్య సహాయం అందేలోగా ఆసుపత్రిలో చనిపోయిందట.

## యజమానురాల్ని హత్య చేసిన నౌకరు!

భువనేశ్వర్‌కు చెందిన ఒరిస్సా రాష్ట్రం లిఫ్ట్ ఇరిగేషన్ కార్పొరేషన్‌లో సూపరింటెండెంట్ ఇంజనీరుగా పనిచేస్తూన్న 43 ఏళ్ల లక్ష్మీకాంత్ ఆఫీసు పనిమీద తరుచూ వెళ్తూంటారట. ఆయన ఇంట్లో ఖన్నాబారిక్ అనే 30 ఏళ్ల పనివాడు పని చేస్తున్నాడట. ఈ ఖన్నా గత పదేళ్ళుగా టెంపరరీ ఉద్యోగంలో ఉంటూ ప్రతి ఆఫీసరు







విజయ్‌స్ప్రే. మాంసకృత్తులు. విటమిన్లు మరియు ఖనిజ పదార్థాలతో సమ్మిళితమైన శిశు ఆహారం. తేలికగా జీర్ణంకాగలదు. సులభంగా నీటిలో కరుగగలదు. ఆరోగ్యసూత్రాలకు అనుగుణంగా తయారుచేయబడింది. విజయ్‌స్ప్రేను చాలా సులభంగా కలుపుకోవచ్చు. అంతర్జాతీయప్రమాణాలకు అనుగుణంగా తయారుచేయబడిన విజయ్‌స్ప్రే భారతదేశపు పసి పాపలకు చాలా అనువైన శిశు ఆహారం. విజయ్‌స్ప్రే తల్లి పాలవలె తియ్యగా ఉండేట్లు తయారు చేయబడింది.

అవును. మీ పాప ఆరోగ్యానికి డాక్టర్లు సిఫారసుచేసే శిశు ఆహారం... విజయ్‌స్ప్రే!

# విజయస్ప్రే

కన్నతల్లి అనురాగానికి ప్రతిరూపం

ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి కార్పొరేషన్ లిమిటెడ్ వారి ఒక శ్రేష్ఠమైన ఉత్పన్నం (ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ యాజమాన్య సంస్థ)

అమ్మకందార్లు:
స్పెన్సర్ & కం. లిడ్.

FDS APDDC 3071A TEL

# ఘాతకుని డైరీ

ఇంట్లోనూ బాడుకా చాకిరీ చేస్తున్నాడట. తన కెన్నేళ్లకు ఉద్యోగం పర్మనెంటు అవటం లేదని అతనికి బాధగా ఉండేదట. ఆ బాధ తన ఆఫీసరు మీద కసిగా మారిందట. ఫిబ్రవరి రెండో తేదీ లక్ష్మీకాంత్ చౌదరిగారు వూళ్లో లేరట. పిల్లలు పదిహేళ్ల ఉమాకాంత్, 13ఏళ్ల అనితా స్కూల్లో ఉన్నారట. వంటవాడు బాసు సుమారు 11.30 గంటలకు వాళ్లకు అన్నం పట్టుకు వెళ్లాడట. ఆ ఇంట్లో యజమానురాలు 35 ఏళ్ల గౌరితిలోత్తమ, పనివాడు ఖన్నాబారిక్ మాత్రమే ఉన్నారట.

అలవాటు ప్రకారం గౌరి తిలోత్తమ పనివాడికి ఆపనీ ఈ పనీ పురమాయిస్తూ, బాత్ రూమ్‌లోకి వెళ్లి వాష్ బేసినులో చేతులు కడుక్కుంటూ ఏరా ఏమిటి వాష్ బేసినిలా ఏడిసింది! సరిగ్గా దీన్నికడిగిఏడు అన్నదటంతే. ఉత్తరక్షణంలో కెవ్వున కేక వేసే అవకాశంకూడా లేకుండా కుప్పగా కూలిపోయిందట. ఆమె వెనుక నిలబడిన ఖన్నాబారిక్ చేతిలోని కత్తి నిప్పులు చెరుగుతూ రక్తం బొట్లు కారుస్తూ ఉన్నదట. ఖన్నాబారిక్ క్రిందపడ్డ ఆమె మీద పడి ఆ కత్తితో ఆమె తలను మొండెంనుంచి వేరు చేసి, ఓ ప్లాస్టిక్ గోని సంచిలో ఆ మొండాన్నీ తలనూ పడేసి మూతి బిగించి కట్టి, బాత్‌రూమ్‌లో చిందిన రక్తాన్నంతా కడిగి శుభ్రం చేసి, ఆనక హాల్లోకి వెళ్లి ఆమె చెప్పులు, చేతి సంచీ తెచ్చి, అవి కూడా ఆ గోనె సంచిలోనే పడేసి, మళ్లీ మూతి కట్టేశాడట. ఆ మూటను బాత్‌రూములోనే ఓ మూల ఉంచాడట.

స్కూలునుంచి ఇంటికి వచ్చిన పిల్లలు అమ్మేదీ అని అడిగితే ఏదో ఓ కారు వచ్చిందనీ, ఇప్పుడే వస్తాననామె ఆ కారులో ఎక్కి వెళ్లిందనీ చెప్పాడట. సాయంత్రానికూడా తల్లి తిరిగి రాకపోయేసరికి పిల్లలు తమ మేనమామ డాక్టరు మహాపాత్రకు ఫోన్ చేసి చెప్పారట. ఆయనొస్తే ఆయనకూ ఈ కట్టు కథ చెప్పాడట. కానీ, ఆయన నమ్మక, తన చెల్లెలునెవరో ఎత్తుకుపోయి ఉంటారనీ, వారికి అతను సహాయంచేసిఉంటాడని అనుమానించి నిలదీసి అడిగేసరిసికి,ఆ ఖన్నాబారిక్ సమాధానంచెప్తూ చెప్తూ పరుగున గోడ దూకి, చీకట్లో అంతర్ధానమయి పోయాడట.

మర్నాడు పోలీసుల విచారణలో క్రితం రోజు లక్ష్మీకాంత్ ఇంటికి కారేదీ రాలేదని తేలిందట. ఇల్లంతా అనుమానంతో సోదా చేసే సరికి, ఆ గోనె మూట, మూటలో శవం కనుపించాయాట. ఆ హంతకుడు ఖన్నాబారిక్ ఓ పది రూపాయలు గౌరి తిలోత్తమ వద్ద హత్యకు ముందు రోజు అప్పు అడిగి, ఆ డబ్బుతో కత్తి కొని, ఆ కత్తితోనే ఆమెను చంపేశాడట. పారిపోయిన హంతకుణ్ణి భారత రాజధాని ఢిల్లీలో పట్టేశారట. ●

# కలువరేకుల్లాంటి తీరైన కళ్ళకోసం

కొత్త
## శింగార్
డీలక్స్-కాటుక

శింగార్ కళ్ళ సౌందర్యసాధనాన్ని ఎక్కువ అనుకూలమైన, పొదుపైన, మినిప్యాక్‌లో ప్యాక్ చేస్తున్నది. మిలమిలలాడే పెద్ద కళ్ళ కోసం చిన్న, సులువైన మార్గం.









## శింగార్

డీలక్స్-కాజల్ (కాటుక) అత్యుత్తమ పదార్థాలతో తయారైంది.
అంతేకాక దీని ప్యాకింగ్ కూడా ఆరోగ్యకరమైన పద్ధతులతో చేయబడుతుంది.

everest/81/SH/218-

# హైదరాబాదు నోట్‌బుక్

## ఉగాది ఉత్సవాలు :

ఈ సంవత్సరం పేరు దుర్మతి అయినా నగరంలో జరిగిన ఉగాది వేడుకలు చూస్తే సన్మతి గానే ఉండగలదనే ఆశలు మోసులెత్తుతున్నాయి. ఈ ఉత్సవాలు ఐదు రోజులపాటు రవీంద్రభారతి లోనూ, కళా భవన్‌లోని నిజాం కాలేజీ మైదానం లో నిర్మించిన శాతవాహననగర్‌లోను గోష్ఠులు, సదస్సులు, నాటకాలు, నాట్యాలు, సంగీతాలు జరిగాయి. గవర్నర్ శ్రీ అబ్రహాం ఈ వేడుకలు ప్రారంభిస్తూ "తెలుగు ప్రజలకు ఉగాది శుభాకాంక్షలు" అని తెలుగులోనే చెప్పి శ్రోతలను ఆశ్చర్యానందాలతో ముంచారు. ముఖ్య మంత్రి శ్రీ అంజయ్య తమ ప్రసంగంలో రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి అన్ని రంగాల ప్రముఖులు కృషి చేయాలని కోరారు. ఈ సంవత్సరం ఆంధ్రప్రదేశ్ అవతరణ రజతోత్సవ సందర్భంగనుక ఈ ఉగాదికి ప్రత్యేకత ఉందని ఆయన అన్నారు. అందరూ కృషి చేస్తేనే రాష్ట్ర ప్రతిభ ప్రపంచ వ్యాప్తమవుతుందని రాష్ట్ర సాంస్కృతిక వ్యవహారాల మంత్రి శ్రీభాట్టం శ్రీరామమూర్తి అన్నారు. ఈ సందర్భంగా రాష్ట్ర ప్రభుత్వ ఆస్థాన సంగీత విద్వాంసుడుగా శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ, రాష్ట్ర వైణికులుగా శ్రీ ఈమని శంకరశాస్త్రి, ఆస్థాన నాట్యాచార్యుడుగా శ్రీ నటరాజ రామకృష్ణ, ఆస్థాన ఉరుదూ కవిగా శ్రీ అవుజ యాకూబ్ పదవీ స్వీకరణ చేశారు. ఆస్థాన కవి డాక్టర్ దాశరథి కవిత పఠించారు. శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయ ప్రత్యేక సంచిక ఆవిష్కరించారు. ఈ సందర్భంలో వివిధ రంగాలలోని ప్రముఖులు పలువురిని సత్కరించడం జరిగింది. జూబ్లీహాలులో కవి సమ్మేళనం పిదప ముఖ్య మంత్రి నివాసమైన జై ప్రజా భవన్‌లో పంచాంగశ్రవణం జరిగింది.

## ప్రజాకవి వేమన ఆవిష్కరణ :

డాక్టర్ ఎన్. గోపి సిద్ధాంత వ్యాసం ప్రజాకవి వేమన ఆవిష్కరణోత్సవం ఏప్రిల్ 8సాయంకాలం ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆవరణలో శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షతన జరిగింది. శ్రీ గోపి ప్రతిభావంతుడైన కవి, పరిశోధకుడు అని శ్రీ రామానుజరావు ప్రశంసిస్తూ, నేడు ఆస్థాన కవుల, విద్వాంసుల నియామకం జోరుగా సాగుతున్న దని, సోషలిస్టు సమాజంలో ఈ ఫ్యూడల్ వ్యవస్థ సముచితంగా లేదని ఈ ఆస్థాన కవులంతా ట్రేడ్ యూనియన్‌గా వెలకొనే ప్రమాదం ఉందని చలోక్తి విసిరారు. గ్రంథాన్ని ఆవిష్కరించిన డాక్టర్ పి.

నారాయణరెడ్డి గోపీ పాట నిర్ణయంలో నైశిత్యంతో, తర్క సహమైన నేర్పుతో గ్రంథాన్ని రచించారని ప్రశంసించారు. గ్రంథాన్ని ప్రసిద్ధ నవలా రచయిత శ్రీ దాశరథి రంగాచార్యులు, రెవరెండ్ దాస్‌బాబు సమీక్షించారు. వేమన అనేక ఉద్యమాల సమాహారం. వేమన నాటి పరిస్థితులు నేడూ ఉన్నాయి. తోటకూర కొరకు దుగ్గలికూరకై కవులు కవిత్వం చెబుతారని వేమన అన్న మాట నేటికీ వర్తిస్తుంది. అలాటి వేమనకు ప్రజాకవి అన్నవాడు బహుశా తొలిసారిగా గోపీయే — అని శ్రీ రంగాచార్యులు అన్నారు. తెలుగువారిలో కమ్యూనికేషన్‌గా గ్యాప్ అనే దోషం ఉందని, దానిని పూరించడానికే వేమన పుట్టాడని రెవరెండ్ దాస్ బాబు అన్నారు. ఈ గ్రంథాన్ని యథాతథంగా ఆంగ్లంలోకి అనువాదం చేస్తే, క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీ [సి.ఎల్.ఎస్.] ప్రచురిస్తుందని ఆయన ప్రకటించారు. డాక్టర్ గోపీ కృతజ్ఞత తెలుపుతూ, తాను ఏ దృష్టితో వేమన విషయమై పరిశోధనకు పూనుకున్నదీ వివరించారు. విరక్తరాస్యులుకూడా ఉట్టంకించే కవి వేమన అని, అందువల్లనే ప్రజాకవి అని శీర్షిక పెట్టుకొని వేమనను అన్ని విధాలా అర్థం చేసుకోవడానికి చేసిన ప్రయత్నమే ఈ సిద్ధాంత వ్యాసమని, అన్నీ తెలిసినట్లుగా నటన చేయలేదని డాక్టర్ గోపీ అన్నారు. డాక్టర్ కె. కె. రంగనాథాచార్యులు ప్రారంభంలో స్వాగతం, చివర కృతజ్ఞత చెప్పారు. స్వరాజ్యలక్ష్మి అనే బాలిక సభ ప్రారంభంలో వేమన పద్యాలతోనే ప్రార్థన చేయడం చాలా ఔచిత్యం సంతరించింది.

**లోక్‌దళ్ నాయకుల సూచన :**

మలేషియా రాజధాని కౌలాలంపూర్‌లో జరిగిన ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలో జరిగిన అవకతవకలకు బాధ్యులైన వారందరూ రాజీనామా చేయాలని, అంతర్జాతీయ తెలుగు సంస్థను రద్దు చేయాలని రాష్ట్ర యువ లోక్‌దళ్ నాయకులు శ్రీయుతులు వై. శివాజీ, ఎం. రత్న ప్రసాద్, వి. సుబ్బారావు, కె. యుగంధర్ రెడ్డి ఏప్రిల్ 24న ఒక ప్రకటన చేశారు.

— తిరుమల రామచంద్ర

# ధర్మపథం

— బులుసు వేంకట రమణయ్య

## వాసుదేవుడనగా -

ఆనక దుందుభి అనే నామాంతరం గల వసుదేవుని పుత్రుడైనందున శ్రీకృష్ణునికి వాసుదేవుడనే పేరు వచ్చిందని చాలామంది అభిప్రాయం. శ్రీకృష్ణుని కాలంలోనే వాసుదేవుడనే పేరుగల మరొక వ్యక్తి వుండేవాడు. అతడు పౌండ్రకుడు. శ్రీకృష్ణుని విరోధియై "వాసుదేవు"డనే పేరును విడిచిపెట్టాలని దురహంకారంతో ఆదేశించి శ్రీకృష్ణునివల్లనే మరణం పొందినాడు. వాసుదేవ నామం కలవారు మన పురాణాలను బట్టి శ్రీకృష్ణ పౌండ్రకులిద్దరే కానవస్తున్నారు.

వాస్తవానికి వాసుదేవుడనేది వ్యక్తికి సంబంధించిన పేరయినట్లు తోచదు. ఆధ్యాత్మిక తత్త్వవేత్తలు ఈ పదాన్ని తరుచుగా వాడుతూ ఉంటారు. వారు ఈ శబ్దానికి అర్థాన్ని ఈ విధంగా వివరిస్తారు.

"సర్వాణి తత్ర భూతాని
వసంతి పరమాత్మని,
భూతేషుచ స సర్వాత్మా
వాసుదేవస్తతః స్మృతః"

సంస్కృతంలో "వస-నివాసే" అనే ధాతువునుబట్టి 'వస' అంటే నివసించడమని అర్థం, సమస్త భూతములందూ ఆ పరమాత్మ నివసిస్తూ ఉన్నాడు. మరిన్ని సర్వభూతములయందున్నూ అతడు నివసిస్తూ ఉన్నాడు. ఆ కారణాన్ననుసరించే పరమాత్మకు వాసుదేవుడనే పేరు వచ్చింది.

పై శ్లోకానికి అభిప్రాయం ఇది—

పరమాత్మయే వాసుదేవుడు కావడంవల్ల భగవంతుడంటే వాసుదేవుడని స్పష్టమవుతూ ఉన్నది.

భగవచ్ఛబ్దానికి అర్థాన్ని నిర్ణయించే సందర్భంలో 'భగ' అనే దానికి షడ్గుణైశ్వర్యాలూ చెప్పి ఆ తర్వాత 'వ' శబ్దానికి ఇలా అర్థం చెప్పబడింది.

"వసంతి తత్ర భూతాని
భూతాత్మ న్యఖిలాత్మని.
స చ భూతేష్వశేషేషు
వకారార్థస్తతోఽవ్యయః"

అఖిలాత్ముడు, భూతాత్ముడు అగు అతని యందే — ఆ భగవంతుని యందే సమస్త భూతములు నివసిస్తున్నవి — అతడు సమస్త భూతముల యందున్నూ నివసిస్తూ ఉన్నాడు. ఇట్లు వకారానికి అవ్యయుడైన ఆ పరమాత్మయే అర్థం — అని దీని అభిప్రాయం.

వాసుదేవ శబ్దానికి అర్థం చెప్పేటప్పుడు కూడా ఈ విషయమే చెప్పబడినది. భగవంతుడు - వాసుదేవుడు - అని పేర్లు వేరు వేరుగా ఉన్నా రెండూ ఒకే అర్థాన్ని చెప్తున్నట్లు విష్ణుపురాణంలో వివరించబడి ఉన్నది. ఈ విధంగా భగవంతుడంటే వాసుదేవుడనీ, వాసుదేవుడంటే భగవంతుడనీ గ్రహించవలసి ఉన్నది.

వాసుదేవుడంటే — కేవలం వసుదేవుని పుత్రుడు అని అనుకోరాదు. అలా అయితే వసుదేవుని మిగిలిన పుత్రులు కూడా వాసుదేవులవుతారు. కాని ఆ పేరు శ్రీకృష్ణుని యందే రూఢమై ఉన్నది. కాబట్టి వాసుదేవుడనే శబ్దానికి భగవంతుడనే అర్థాన్నే గ్రహించవలసి ఉంటుంది.

# ★ వారఫలం ★

**29-5-1981 శుక్రవారం మొదలు**
**4-6-1981 గురువారం వరకు**

మేషం:— ఎన్ని విధాల అభివృద్ధి కార్యక్రమం, వ్యాపార రంగాన చేపట్టినా, ఏదో లోటు కనిపించనున్నది. డబ్బు సమయానికి అందటం, అవసరాలు తీరటం, గమనించ గలరు. రాజకీయంగా కొందరకు, క్రీడావనిలో కొందరకు అవకాశాలు లభించ గలవు. స్త్రీలకు : కుటుంబంలో సుఖశాంతులు, ఉద్యోగాభివృద్ధి చెప్పదగిన వారం.

వృషభం:— ఆలోచనలు ఫలించే వారం. అభివృద్ధికి దారితీసే వారం. వ్యాపార విస్తరణకు అవకాశం గల వారం అనవసరమైన ప్రస్తావనలకు పోకుంటే, అన్ని రంగాలలో సుముఖత కనిపిస్తుంది. స్త్రీలకు: వృత్తిలో వృద్ధి, కార్యసిద్ధి, ధన సమృద్ధికి అవకాశం గల వారం. ఆరోగ్యలోపం లేదు.

మిథునం:— కంటిబాధయో, పంటినొప్పియో బాధాకరమై, పనులు సాగక పోవటం, చేసేవ్యవహారాలలో విలంబన జరగటం గమనించ గలరు. ఆదాయం అంతంత మాత్రమే. సొంత వ్యవహారాల కన్నా, పరుల విషయాలలో జోక్యం కలుగజేసికోవలసిన వస్తుంది. తద్వారా కాలయాపన. స్త్రీలకు: ఉద్యోగ వృత్తులందు సుముఖత కనిపిస్తుంది.

కర్కాటకం:— ఆరోగ్య లోపం లేదు. అవసరాలకు కావలసిన ధనం, అందిపుచ్చుకున్నట్లు సమకూరుతుంది. సాహిత్య రంగంలో చేయి తిరిగిన వారికి నూతనావకాశాలు లభించ గలవు. తోడి వారి సలహాలను పాటించండి. బంధువుల సహాయం, ఈ వారం,లభిస్తుందనుకోవటం పొరబాటు. స్త్రీలకు: అన్ని విధాలా మేలైన వారం. ధనాదాయం గల దినాలే.

సింహం: — ఆరోగ్య లోపం ఏర్పడుతుంది. వయసు మీరిన వారు ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మంచిది. క్రయ విక్రయాలలో కొంత ఇబ్బంది కలుగుతుంది. అధికారుల బెడద కూడా ఉంటుందనే చెప్పాలి. స్త్రీలకు : నూతనోద్యోగ ప్రయత్నాలు ఫలవంతం కాగలవు. క్రీడావనిలో, కళారంగంలో అనుకూలత సంభవం.

కన్య:— దూర దేశాన్నుండి శుభవర్తమానం అందుతుంది. అంతే గాక ఉత్తరాల మూలాన అనేక విషయాలు తెలిసికోగలరు. సభా కార్యక్రమంలో జోక్యం కలుగ జేసికొనుటకు కొందరకు, క్రీడారంగావకాశాలు కొందరకు, కళారంగంలో కొందరకు అవకాశాలుండ గలవు. స్త్రీలకు : కుటుంబ ఆనందం, ఇంట శుభకార్య ప్రస్తావన, కించిత్తు ద్రవ్యాదాయం సంభవం.

తుల:— మీ ప్రయత్నాలు కొనసాగుతాయి. అపూర్వ వస్తు సేకరణకు అవకాశమున్నది గాని వ్యయం కూడా అత్యధికమే అని చెప్పాలి. మనశ్శాంతి కొరకు తాపత్రయ పడటం అనవసరం. గ్రహానుకూల్యత లేనప్పుడు అలాగే ఉంటుంది. స్త్రీలకు: కుటుంబ పరిస్థితులందు ఇబ్బందులు, ప్రయత్నాలకు ఆటంకాలు, దొరికినట్లే దొరికి అవకాశాలు జారిపోతాయి.

వృశ్చికం:— గ్రహించండి. అన్ని రంగాలలో అనుకూలత చెప్పదగిన వారం. మీ బంధువర్గీయులు, ధనం గుంజాలనీ, మీ సహాయం అర్థించాలనీ ప్రయత్నిస్తారు. నూతన వ్యాపారానుకూలత ఏర్పడుట నిశ్చయం, స్త్రీలకు రాజకీయంగాకొందరకు, క్రీడావనిలోకొందరకు, ఉద్యోగ వృత్తులందు కొందరకు అవకాశాలుండ గలవు.

ధనుస్సు:— వ్యాపారం, బాహాటంగా చేయుటకు అవకాశాలుంటాయి. క్రయ విక్రయాలలో మీ నేర్పు ప్రదర్శితమవుతుంది. ఆలోచనలు ఫలించే అవకాశమున్నది. 'అపకారికి ఉపకారం చేయుటమే' మీ ప్రకృతి. అన్ని విధాలా శ్రేయోదాయకమైన వారమే స్త్రీలకు : నూతన విషయాలు గ్రహించటం, కుటుంబ వ్యవహారాలు శ్రద్ధాసక్తులతో జరుపుకొనుట వారఫలం.

మకరం:— ప్రతి విషయంలోను అనుక్షణమూ ఎంతో శ్రద్ధ వహించి కార్యాలను సాధించుకోవాలి. చివరకు శ్రమ మాత్రమే మిగిలిందని గ్రహించ గలుగుతారు. ఆట పాటల్లో ప్రతిభ గలవారికి రచనా విధానంలో అనుభవం గలవారికి, భిన్న మార్గాలలో లాభదాయకమైన వారం. స్త్రీలకు: మొదటి రెండుదినాలు,పనుల హడావుడి, కించిత్తు లాభం, ఉద్యోగవృత్తులందు అనుకూలత సాధించ గలుగుతారు.

కుంభం:— మాటలచాకచక్యంతో, నిబ్బరంతో మిత్ర సహాయంతో కొన్ని వ్యవహారాలలో అనుకూలత సాధించ గలుగుతారు. సమయానికి డబ్బు అందుతుంది. ఒకానొక విషయంలో విజయసిద్ధి గలవారమే. స్త్రీలకు : ఉద్యోగ వృత్తులందు, వ్యాపారం చేసేలాగైతే, అందులో కూడా అనుకూలత గలదు.

మీనం:— మీ వృత్తి ఉద్యోగాలలో అనుకున్న ఫలితాలు సాధించ గలుగుతారు. సంకల్ప కార్యం విజయసిద్ధి నందగలదు. చేతికి ధనం అందే మార్గమున్నది. ప్రయత్న లోపం చేయకండి. భూ సంబంధ వ్యవహారాలు బాగుండబోతాయి. స్త్రీలకు: క్రీడావనిలో విశేషించ కూలత, కొందరకు అధికారుల వలన మన్నన ఈ వారం ఎన్నదగిన విశేషం.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# Only for those who like to be sure






The VIP label. Your guarantee of comfort and confidence. Confidence that your anatomy demands from scientifically designed underwear.

Made from the choicest fabric. With the softness, the smoothness... and the feel that gives the VIP feeling.

Durable underwear from VIP.
A complete price range...
because every person is important.




UNDERWEARS

CASH/H-1-244

**Distributors for Andhra Pradesh**



**Mahavir Agencies**

4-1-938, Tilak Road
Abids, Hyderabad-1
Phone: 221198, 34819

ఉగాది (దుర్మతి నామ సం.) సందర్భముగా కరీంనగర్ జిల్లాలోని రామగుండం ఎరువుల కర్మాగారమువారు జరుపుకున్న తెలుగు నాటిక పోటీలలో "నాన్నా పులి" అను నాటికకు "ఉత్తమ ప్రదర్శన" బహుమతి లభించింది.

ఎడమనుండి కుడికి :

మొదటి వరుస: 1. M.V.S. Sastry 2. V. Suryanarayana(Best-Villan)
రెండవ వరుస : 1. Smt. Prethi Madan 2. Sri K.C. Madan, General Manager. 3. Sri P. Radha Krishna Dy. General Manager.
మూడవ వరుస: 1. T.V. Rao (నిర్వహణ) 2. Ch. Sitaramaiah 3. T.D. Prasad 4. J.K.L. Narasimha Rao 5. D.K.D. Papa Rao 6. S. Radha Krishnan (దర్శకత్వం) 7. M. Subba Rao.

**"గురూ!** నువ్వు కొంప కావా అన్నావ్ కదూ!" అంటూ వచ్చాడు రామారావు.

ట్రాన్స్ఫర్ అయి వచ్చిన ఆ వారం రోజుల్లోనూ అతిచనువుగా — ఏకవచన సంబోధన లోకి దిగింది రామారావు ఒక్కడే. నేను అప్పుడే ఆఫీస్ కొచ్చి, టేబిల్ దులిపి, చిందర వందరగా ఉన్న ఫైల్స్ అనబడే కాగితాలు గుట్టా సర్దుతున్నా

తలెత్తి చూసి నవ్వి "అవును"అన్నాను.

మేనేజర్ గదిలోకి ఒకసారి తొంగిచూసి "ఈరోజు శెలవా?" అన్నాడు.

"నేనింకా ఆ ఎంక్వయిరీ చెయ్యలేదు" అన్నాను నవ్వుతూ.

"అర్జయ్యా! శెలవా?" అన్నాడు అటుగా పోతున్న మెసెంజర్ని కేకేసి. వాడు చిన్న సైజ్ పోజిచ్చి-చేతిలో వున్న కాగితాల్ని చదవబోయిన పోజిచ్చి- "ఆఁ ఏమిటన్నారు? అయ్యగారు... శెలవూ!" అన్నాడు "ఆ మాత్రం తెలియదా? ఏం ఎక్స్కెంటెంట్ వయ్యా?" అన్నట్టుగా చూస్తూ. అర్జయ్య అటుగా వెళ్ళగానే మళ్ళీ తిరిగాడు రామారావు.

"వరస్ట్ ఊరు బ్రదర్ ఇది. ఈ ఊళ్ళో కొంప దొరకడం బహు కష్టంసుమీ! గత జన్మలో ఏ ముని కుమార్తెనో ప్రేమించగా—ఆ ముని ఆగ్రహించి శపిస్తే తప్ప ఈ ఊర్లో ఉద్యోగం చెయ్యం. — అద్సరే! స్టేట్ బ్యాంక్ కాలనీలో పదమూడో నెంబర్ ఇల్లు అద్దెకుంది. జేరతావా?" అన్నాడు.

ఈ ఊరు ట్రాన్స్ఫర్ అయివచ్చిన వారం రోజుల్లోనూ శ్రీమతి దగ్గర్నుంచి ముత్యాల్లాంటి మూడుత్తరాలొచ్చాయి.

"ఆరోగ్యం జాగ్రత్త! త్వరగా యిల్లు చూడండి, వెంటనే తీసుకెళ్ళండి" అంటూ.

"థాంక్స్ బ్రదర్! నీ ఋణం ఈ జన్మలో తీర్చుకోను. అద్దెంత? పోయి చూద్దామా?" అన్నాను హుషారుగా.

"నువ్వు చూడవల్సిందేంలేదు. ఇల్లు సలక్షణంగా ఉంటుంది. అద్దె కూడా తక్కువకే యిప్పిస్తాను. నే నొకటి అడుగుతా — చెప్పు. నీకు సెంటిమెంట్స్ పిచ్చి వి క్కు వా?" అన్నాడు.

"అంటే?..." అన్నా నాకు అర్థం కాక.

"లేవగానే అద్దం చూసుకోడం, శకునం చూసుకోడం, తుమ్మితే ఆగిపోడం,




దేవతలూ—దెయ్యాలు వగైరా..." అన్నాడు.

"నాన్సెన్స్—ఈ ట్వెంటీయత్ సెంచరీలో దెయ్యాలూ-దేవతలూ ఏమిటింకా" అన్నాను చిరాగ్గా.

"అలా తేలిగ్గా కొట్టిపారేయకు. పట్టపగలు నలుగుర్లో దెయ్యాలు లేవని బల్ల గుద్ది గట్టిగానే వాదిస్తావ్. అర్ధరాత్రి ఊరి చివర్న ఒక్కణ్ణి నుంచోపెట్టి 'ఇక్కడో ఆడది ఆత్మహత్య చేసుకుంది' అన్నాననుకో... అపుడు ఎక్కడలేని దెయ్యాలు నిన్ను ఆవరిస్తాయి. మొదట్లో ఆ యింట్లో జేరిన ఇద్దరూ అలా అన్నవాళ్లే. జేరిన వారం రోజులకే 'బిచానా' ఎత్తేసారు. నువ్వు మూడోవాడివవుతావ్" అన్నాడు రామారావు నవ్వుతూ.

"రామారావ్! నువ్వేం మాట్లాడుతున్నావ్? తెలుగేనా!" అన్నా చిరాగ్గా.

"తెలుగే. స్పృహలో ఉండే— తాగొచ్చేం మాట్లాడంలేదు. గతంలో ఆ పదమూడో నెంబరు ఇంట్లో ఓ యువ దంపతులుండే వారు. చిలకా గోరింకల్లా ఉండే ఆ దంపతుల్లో — గోరింక లేని సమయం చూసి చిలక వళ్ళంటుకొని చచ్చిపోయింది. ఆత్మహత్యని కొందరూ — ప్రమాదవశాత్తు అని కొందరూ కూసారు. ఆ తర్వాత గోరింక ఎక్కడ్కో ఎగిరిపోయింది. ఆ చిలక మాత్రం తీరని కోరికలతో దయ్యమయి ఆ ఇంట్లో తిరుగుతోందని చుట్టుపక్కల వాళ్ల కథనం" —రామారావు ఆగి నా మొహంలోకి చూసాడు.

నా మొహంలో అతడు ఊహించిన

భావాలేం కన్పడకపోవడంతో కొంత నిరాశ చెందాడు. నేను నవ్వుతూ మరింత ఉత్సాహంగా ముందుకు వంగి కూర్చున్నా.

"నీకా సెంటిమెంట్స్ లేకపోతే మరీ మంచిది. ముందు ఓ వారం రోజులు ఆ ఇంట్లో కాలక్షేపం చెయ్యి. నచ్చితే ఆ తర్వాత నీ అర్ధాంగిని తీసుకొద్దువు గాని. ఏమంటావ్?" అన్నాడు.

"ఓ.కే!" అన్నాను నవ్వుతూ – చేతో 'థమ్స్ అప్' ఫోజ్ పెడ్తూ.

ఆసాయంత్రం ఆఫీస్ అవగానే రామారావు, నేనూ కల్సి పదమూడో నెంబర్ క్వార్టర్స్ యజమానిని కల్సుకున్నాం. పరిచయలయ్యాక వచ్చిన విషయం తెల్సుకొని 'విన్నాళ్లుంటాడీ వెర్రిబాగులోడు' అన్నట్లుగా చూసాడు ముసలాడు. ఎవరూ రాని ఆ యింటికి అద్దె ఆయన తగ్గిస్తూంటే, మూడు నెలల అడ్వాన్స్ ఇవ్వబోయిన నన్ను చూసి ఆయన వింతగానూ, రామారావు చికాగ్గాను చూసారు. ఓ మూడొందలు అడ్వాన్స్ యిచ్చి అమావాస్య అయినా ఆ రోజే జేర్తానని చెప్పి బయట పడ్డాం.

* * *

కాలనీ కాబట్టి ఇళ్లన్నీ క్రమశిక్షణ కల్గిన సైనికుల్లా బారులుతీరి వరుసగా ఉన్నాయి. ఊరుకు చివర తోటలు నరికి కట్టారు కాలనీ.

ఇల్లు చాలా చక్కగా ఉంది. ముందు వరండా, తర్వాత డ్రాయింగ్‌రూం, దాన్ని ఆనుకుని బెడ్‌రూం, దాని వెనుక కిచెన్ కం డైనింగ్ రూం కం స్టోర్ రూం. ఆవలి ప్రక్క ఎటాచ్‌డ్ బాత్‌రూం కం టాయ్‌లెట్. దొడ్లో రెండు మామిడిచెట్లు, అడ్డదిడ్డంగా పెరిగిన పూల మొక్కలు ఉన్నాయి. వెనుక మొన్నిమధ్య తుఫాన్‌కు కూలిపోయిన ప్రహారీ గోడ. దాని నానుకొని మామిడితోట. చిన్నదైనా ఇల్లు చాలా పొందికగా ఉంది. నేనూ, సుజాత, బాబే కదా! మా ముగ్గురికి చక్కగా సరిపోతుంది. రామారావుకు మరోసారి మనస్సులోనే 'థాంక్స్' చెప్పుకున్నా.

ఇంటి ఓనరు తాలూకు పనిమనిషి అప్పుడే ఇల్లు వూడ్చి వెళ్లింది. క్రొత్తగా అమర్చిన బల్బులన్నీ దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. స్నానం చేసొచ్చి యింటి ఓనరు పంపిన మంచంపై నడుం వాల్చాను ఏం తోచడంలేదు. కాసేపు వరండాలో నుంచున్నాను. ఆ మసక వెల్తుర్లో చుట్టుప్రక్కల

**డాక్టర్ల గురించి సందేహాలు**

పశ్చిమ జర్మనీలో ప్రజలకు రోజు రోజుకు డాక్టర్లమీద నమ్మకం తగ్గిపోతున్నది. దేశంలోని రెండు కోట్లమందికి అంటే దేశ జనాభాలో మూడో వంతు ప్రజలకు డాక్టర్ల సామర్థ్యం మీద సందేహాలేర్పడుతున్నాయి. అసలు వారు దేనిని గురించి మాట్లాడుతున్నారో వారికితెలుసా? అని అడుగుతున్నారు. డాక్టర్లమీద నమ్మకం తగ్గటంచేత వీరు నాన్ మెడికల్ ప్రాక్టీషనర్సును సంప్రదిస్తున్నారు. అంతే కాదు, వీరే డాక్టర్లకంటే ఎక్కువగా శ్రద్ధ చూపిస్తున్నారని అంటున్నారు.

## పదమూడో నెంబరు ఇల్లు

ఇళ్లవాళ్లు వరండాల్లో నుంచొని నే ఉన్న ఇంటికేసే చూస్తున్నట్లు కన్పించింది. బహుశ, వాళ్లు ఈ దెయ్యాల కొంపలో చేరిన అమాయకుడెవరని ఆశ్చర్య పడుతూ ఉండొచ్చు. నిజానికి వాళ్ల అమాయకత్వాన్ని చూసి నేను జాలిపడాలి.

ఆకాశం మేఘావృతమైంది. నల్లని మబ్బులు గంభీరంగా కదులుతున్నాయి. తుంపర్లు ప్రారంభమయ్యాయి. గాలి గట్టిగా వీస్తోంది. గాలికి దుమ్ము వచ్చి కళ్లలో పడటంతో యింట్లోకి కదిలాను. రానురాను వర్షం భారీగా తయారయ్యింది. ఉండుండీ మెరిసే మెరుపుల్లో కిటికీలోంచి వెనుక ఉన్న చేలూ, చెట్లూ వర్షంలో తడుస్తూ వింతో అందంగా కన్పిస్తున్నాయి. 'ఈ సమయంలో సుజాత దగ్గరుంటే ఎంత బాగుండును' అన్పించింది. అలా ఆలోచిస్తూండగానే, ఆ చల్లని వాతావరణంలో ఎపుడు పట్టేసిందో నిద్ర పట్టేసింది.

మెలుకువ వచ్చేటప్పటికి గదిలో లైట్లు లేవు. బహుశ, కరెంటు పోయుండాలి. వర్షం తగ్గినట్లుంది. చెట్లమీద కురిసిన వర్షం బొట్లు ఆకులమీద, క్రింద నీటిలోను పడి టప్‌టప్‌మని చప్పుడు విన్పిస్తోంది. కొండ మీద నుంచి బండరాళ్లు దొర్లించినట్లు ఉండుండి ఉరుములు శబ్దం చేస్తున్నాయి. రేడియం డైల్ సరిగా పన్నెండు గంటలు చూపిస్తోంది. మెరుపులకాంతిలో వీధిగుమ్మంకేసి చూసి ఉలిక్కి పడ్డాను. తలుపులుబార్లా తీసున్నాయి. నిద్ర పోయేముందు వేశానోలేదో గుర్తులేదు. కొంపదీసి దొంగాడెవరూ దూర

లేదు కదా అన్పించింది. ఆ ఆలోచన రాగానే వళ్ళంతా గగుర్పొడిచింది. అంతలావు మనిషిని నా ఆలోచనకు నాకే ఆశ్చర్యమేసింది. గదులన్నీ బ్యాటరీ లైట్‌తో వెర్చివేసి వీధి తలుపులు బిగించి వచ్చి మరల మంచంపై నడుంవాల్చా.

ఆలోచనన్నీ గజిబిజిగా ఉన్నాయి. అందరూ భయపడుతున్న ఈ యింటిని తనెందుకు తీసుకున్నట్టు? దెయ్యాల్ని చూడాలని చిన్నప్పట్నుంచి తనకున్న కుతూహలం, మొండి ధైర్యం తనతో ఆ పని చేయించింది మొదట్నుంచి తన కొక విధమైన మొండి పట్టుదల ఎక్కువ. ఆ అలవాటు కొద్దీ చిన్నప్పుడు తాతయ్య రాత్రిళ్ళు వీధి అరుగు మీద కూర్చోపెట్టుకొని చెప్పే దెయ్యాల కథలను తను ఖండించేవాడు. హైస్కూలు చదువు తను పట్నంలో చదివేటప్పుడు రోజూ శ్మశానం దగ్గరగా నడిచి వెళ్ళవలసి వచ్చేది ఆ రోజుల్లో నే స్నేహితులతో పందెం వేసి అర్ధరాత్రి శ్మశానానికి వెళ్ళి కూర్చున్నాడు తను. ఆ దెయ్యాలేమిటో ఉన్నాయన్న వాళ్లకే కన్పిస్తాయి. లేవన్న తన కెందుకు కన్పించవో!

కిరుమన్న శబ్దంతో ఆలోచన్ని ఆపి అటుగా చూసాను. కిటికీ తలుపులు బారా తెరుచుకొని గాలి విపరీతంగా వీస్తోంది. లేచి వెళ్ళి తలుపులు వేసి వచ్చాను. వీధి తలుపులు దబ దబ బాదుతున్నారు. ఒక్క క్షణం ఆలోచించాను. ఇంత రాత్రి వచ్చేవాళ్ళెవరో అర్థంకాలేదు. పైగా, తను ఈ ఇంట్లో చేరినట్టు ఇంకా ఎవర్కీ తెలియనే తెలియదు. ఎవరొచ్చి ఉంటారు?

తలుపులు ఇంకా బాదుతూనే ఉన్నారు. 'దెయ్యం' అనే ఊహ నాకే అవమానంగా తోచింది. తలుపులు తీద్దామనుకునేటప్పటికి బాదడం ఆగిపోయింది. వచ్చి మంచం మీద కూర్చున్నానో లేదో మళ్ళీ తలుపు చప్పుడు టార్చ్‌లైట్ ఆన్‌చేసి తలుపు తీసా. గుమ్మం ఎదురుగా- గుమ్మానికి నిండుగా- గుమ్మం కంటే ఎత్తుగా ఆజానుబాహుడైన విగ్రహం నించొనుంది.

"ఎవరు కావాలి?" అన్నాను సాధ్యమైనంత గట్టిగా.

"సుబ్బారావుగారిల్లిదేనా?" అన్నాడా వ్యక్తి.

"కాదు!" అన్నాను.

"క్షమించండి" అని వెనుదిరిగాడు.

ఆ వ్యక్తి అంతదూరం వెళ్ళేదాకా చూసి, తలుపు వేసుకొని నిర్భంగా మంచం పై వాలాను

* * *

మర్నాడు రామారావు పిలుపుతో మెలుకువ వచ్చి తలుపు తీసా.

"గుడ్మార్నింగ్ బ్రదర్!" అన్నాడు రామారావు.

"రాత్రి సరిగా నిద్ర పటలేదనుకుంటాను" అన్నాడు తనే మళ్ళీ.

"శుభ్రంగా పట్టింది" అన్నా నవ్వుతూ.

"ఈజిట్? దెయ్యాలున్నా – లేకపోయినా వాటి ఆలోచన్లతో అయినా నిద్ర రాకూడదే" అన్నాడు.

రాత్రి జరిగింది చెప్పాను.

"సుబ్బారావు అని 18వ నెంబరు ఇంట్లో ఉంటున్నాడు. బహుశ 13 చూసి 18 అనుకొని ఉంటాడు" అన్నాడు రామారావు.

"కావొచ్చు" అన్నాను.

ఆ సాయంత్రం ఆఫీస్ అయిపోగానే రామారావు నాతోబాటు కాలనీకి వచ్చాడు

"అందరూ దెయ్యాలకొంప అంటోంటే నువ్వు స్వర్గసీమ అంటున్నావ్. ఈ రోజు నీతోబాటే ఉండి నేకూడా చూస్తే" అన్నాడు.

"తప్పకుండా. ఒక్కడ్నీ బోర్ కొటి ఛస్తున్నాను" అన్నాను.

భోజనాలయ్యాక చర్చ చాలావాటి మీదకు పోయింది. రాజకీయాలు, సిన్మాలు, క్రికెట్, ఉద్యోగాలు— అయ్యాక దెయ్యాల మీదకు మళ్ళించాడు రామారావు. రామారావుకు అవి ఉన్నాయనే నమ్మకంతోబాటు వాటి గురించి భయం కూడా ఎక్కువే ఉంది. అన్నిటినీ 'కాకమ్మ కథ'ల క్రింద కొట్టి పారేసి 'గుడ్ నైట్' చెప్పి మేను వాల్చా.

మంచి నిద్రలో వుండగా రామారావు తట్టి లేపాడు.

"ఏదో చప్పుడవుతోంది చూడు" అన్నాడు నెమ్మదిగా. చెవులు రిక్కించి విన్నాను. ఏదో గజ్జెల శబ్దంలా ఉంది.

"ఏమంటావ్?" అన్నాను.

"గజ్జెలు ఆడవాళ్ళు కట్టుకుంటారు. ఇంత రాత్రివేళ గజ్జెలు కట్టుకొని తిరిగే ఆడ మనుషులెవరు?" అన్నాడు రామారావు. అప్పటికే అతనికి అనుమానంగా ఉంది.

"ఏ రిక్షాకో మువ్వలు కట్టి ఉంటారు. సెకండ్ షో సిన్మా అయ్యాక ఇంటికి పోతూండొచ్చు. పడ్కో" అన్నాను ముసుగు తన్ని.

రామారావుకు నిద్ర పట్టలేదనుకుంటా. లేచి గదిలో పచార్లు మొదలు పెట్టాడు. సరిగ్గా మళ్ళీ నాకు నిద్రపడ్తున్న సమయంలో తట్టి లేపాడు చికాగ్గా "ఏమిటి?" అన్నాను.

"ష్! ఆ కిటికీలోంచి చూడు" అన్నాడు.

కిటికీ పెరటి వైపుకుంది. కిటికీలోంచి చూసా. ఏదో మానవాకారం తెల్లటి బట్టలు ధరించి పెరడు దాటి వెనుక మామిడి తోటలోకి ప్రవేశిస్తోంది. ఒక్క క్షణం ఆలోచించి, టార్చి తీసుకొని, పెరడు తలుపు తీయ



పోయాను. రామారావు ఒక్క గంతులో వచ్చి నా చెయ్యి పట్టుకున్నాడు.

"వద్దు. తలుపు తీయకు. దెయ్యం అయ్యుంటుంది. చాలా ప్రమాదం" అన్నాడు భయంగా చూస్తూ. అప్పట్కి ఆ ఆకారం



చాలా దూరం పోయుంటుంది. వచ్చి మంచం మీద కూర్చున్నా.

"బ్రదర్! దుస్సాహసం చెయ్యకు. అది ఖచ్చితంగా దెయ్యం. చాలా ప్రమాదం" అన్నాడు రామారావు మళ్ళీ.

రామారావు కేసి చూశా. భయంతో వణికి పోతున్నాడు. ఒక్కడ్ని ఈ యింట్లో వదిలేస్తే గుండె ఆగిపోయి ప్రాణాలు వదిలేటట్టున్నాడు.

"ఏకేం భయంలేదు, రామారావు! ఖంగారుపడకు" అన్నాను నవ్వుతూ.

రామారావు ధైర్యంగా ఊపిరి పీల్చుకొనే లోపల వీధి తలుపులు దబ దబ బాదిన శబ్దం అయ్యింది. రామారావు నాకేసి బిక్కు బిక్కు మంటూ చూశాడు.

"ఎవరది ?" అన్నా గట్టిగా.

శబ్దం ఆగిపోయింది.

కళ్ళతోనే రామారావుని ఖంగారు పడొద్దని సైగ చేసి, టార్చి తీసుకొని వీధి తలుపు వైపు వెళ్ళా. అంతలోనే డాబామీద టప టప రాళ్ళ వర్షం కురవడం ప్రారంభించింది.

నాలో నన్నగా అనుమానం ప్రారంభమయ్యింది. ఒకవేళ నిజంగా దెయ్యాలున్నాయా? లేకపోతే ఇంత అర్ధరాత్రి డాబా పై రాళ్ళు వేసే దెవరు అన్పించింది.

ఒక్క క్షణం తటపటాయించి నెమ్మదిగా వీధి తలుపు తోశా. అది కాస్తా కీచుమంటూ తెరుచుకుంది. వెంటనే రాళ్ళవర్షం ఆగిపోయింది. నెమ్మదిగా బయటకు వచ్చి చూశా. దూరంగా ఒక ఆకారం వేగంగా వెళ్ళిపోతోంది. ఆ నడక ... ఆ నడక ... ఎక్కడో చూసినట్టు ... బాగా పరిచయం అయినట్టుగా వుంది. ఎక్కడ? ఎక్కడ చూశాను? సరిగా గుర్తు రావడంలేదు. వీధి ప్రహరీగేట్ కేసి చూశా. తెరిచి ఉంది.

వెనక్కి తిరిగి గదిలోకి వచ్చా. రామారావు ముడుచుకు కూర్చున్నాడు. తలుపులన్నీ వేసి, రామారావు భుజం తట్టి "మరేం భయం లేదు" అన్నాను. "ఏమిటి ఆడపిల్లలా వణుకుతున్నావ్?" అని జోక్‌చేసి ముసుగు తన్ని పడుకున్నాను.

ఉదయం నేను లేచేటప్పటికి రామారావు స్నానం గట్రా ముగించుకొని రెడీగా ఉన్నాడు. రాత్రి నిద్ర లేకపోవటం మూలంగా అనుకుంటా అతడి కళ్ళు ఎర్రగా వున్నాయి.

"గుడ్ మార్నింగ్" అన్నాను.

"గుడ్ మార్నింగ్. త్వరగా రెడీకా. వెంటనే ఈ దెయ్యాలకొంప ఖాళీచేసేద్దాం" అన్నాడు చాలా హడావుడిగా.

"ఇది దెయ్యాల కొంపే నంటావా!" అన్నాను నవ్వుతూ.

"కాక? రాత్రి హడావుడి చూశావుగా" అన్నాడు.

"నా కెందుకో ఇది ఇంద్ర భవనంలా ఉంది" అన్నాను రామారావుని ఏడిపిస్తూ.

"నువ్వుంటే వుండు నాయనా ! నేను మాతం రాను. తెల్లవార్లూ కంటిమీద కునుకులేదు" అన్నాడు చికాగ్గా.

* * *

ఆఫీసులో అడుగు పెట్టగానే "గుడ్ మార్నింగ్, సార్!" అంటూ అర్జయ్య ఎదురొచ్చాడు.

"ఏమిటి అలా ఉన్నావ్? పొద్దునే గుర్రు మెక్కావా?" అన్నాను నవ్వుతూ.

"లేదు సార్! రాత్రి నిద్రలేదు... అదే సార్... సెకండ్ షోకు వెళ్ళా" అన్నాడు.

మధ్యాహ్నం లంచ్ టైంలో రాత్రి సంఘటనలన్నీ సినిమా రీళ్ళలా మనసులో మెదులుతూంటే ఆలోచిస్తూ కూర్చున్నా. రాత్రి ఆ ఆకారం నడక ఎక్కడో పరిచయమైనట్టుంది. "ఎవరిదబ్బా?" ఎంత ఆలోచించినా గుర్తుకు రావటంలేదు.

చిన్న ఆలోచన మెరుపులా మెరిసింది. ఈ రోజుతో ఈ పదమూడో నెంబరు యిల్లు మిష్టరీ తేలిపోవాలి.

మధ్యాహ్నం నుంచి శెలవ్ పెట్టా. రామారావుకి యింటి తాళాలిస్తూ "అర్జంటుగా మాఊరెళ్ళుతున్నాను. ఓ వారంరోజుల దాకా రాను" అన్నాను.

"నా కెందుకూ ఆ దెయ్యాల కొంప తాళాలు?" అన్నాడు ఓ మాదిరిగా మొహం పెట్టి.

"ఇంట్లో దెయ్యాలుంటే ఉండొచ్చుగానీ తాళం చెవుల్లో కూడా ఉంటాయా?" అన్నాను నవ్వుతూ!

"నీ ధైర్యాన్కి నా జోహార్లు గానీ-నన్ను చంపకు" అన్నాడు రామారావు చేతులు జోడించి. ఏమనుకున్నాడో ఏమో "సర్లే" అంటూ మూలుగుతూ తాళాలు తీసుకున్నాడు.

రామారావుకు 'గుడ్‌బై' చెప్పి, తిన్నగా మెయిన్ రోడ్డు ఎక్కాను. ఆటో కేకేసి బ్రోడీపేట పోనిమ్మన్నాను. విజయ్ భాస్కర్ ఇల్లు రాగానే ఆపి 'ఫేర్' యిచ్చి పంపేసా.

విజయ్ అప్పుడే వచ్చి ఉండాలి - కానిస్టేబుల్ మోటార్ సైకిల్ షెడ్లో పెడుతున్నాడు.

"అయ్యగారున్నారా ?" అన్నాను.

"ఉన్నారు సార్! కూర్చోండి" అన్నాడు కానిస్టేబుల్.

అంతలోనే "హల్లో !" అంటూ వచ్చాడు విజయ్.

"ఏరా ? ఇన్నాళ్ళదాకా మా యిల్లు పావనం చెయ్యడానికి తీరిక దొరకలేదా ?" అన్నాడు నవ్వుతూ.

కుశల ప్రశ్నలయ్యాక, వచ్చినపని చెప్పా.

కథంతా విని, గొల్లున నవ్వాడు.

ఇద్దరూ అలంకార్‌లో ఓ చెత్త తెలుగు సినిమా చూసి, సరిగా రాత్రి పదకొండు ప్రాంతాల్లో బయల్దేరాం. పదమూడో నెంబరు ఇంటి వెనుక మామిడి తోటలోకి వచ్చేటప్పటికి సరిగా పదకొండున్నర. చుట్టూ కటిక చీకటి. తడుముకుంటూ ఇంటి వెనుక భాగానికి వచ్చాం — కిటికీలోంచి చూసా. లోపల బెడ్‌రూం లైట్ కాంతిలో సన్నగా, లీలగా రెండు ఆకారాలు కన్పించాయి. ఉండుండి సీసాలు, గ్లాసులు చప్పుడు విన్పిస్తోంది. కళ్ళు బాగా నలుపుకుని చూసా. అంతకంటే మరేం కన్పించడంలేదు. అస్పష్టంగా మాటలు విన్పిస్తున్నాయి. విజయ్ కూడా వినడాన్కి ప్రయత్నిస్తున్నాడు.

కళ్ళు

కళ్ళు
నీళ్ళు వర్షిస్తాయి
నిరాశా, నిస్పృహ
మబ్బు లేసినపుడు—
కళ్ళు
పిడుగులు వర్షిస్తాయి
కసి, సంకల్పం
ఉరుము లురిమినపుడు—

— వెంపలి వెంకట శివప్రసాద్

"ఇదేటి బాబూ ! ఇట్టాంటి సన్నాసి నెట్టినావ్? ఈడు కొంప ఖాళీవేసేట్టునేడు. మన యాపారం వట్టేట ముంచేసేటట్టున్నాడు" తాగిన మైకంలో క్రింద కూర్చున్న వాడు అస్పష్టంగా అంటున్నాడు.

నా గురించేనని అర్థమయ్యింది.

"మన ఖర్మరా ! నువ్వు బయటుండ హడావుడి చేసినా, నేను లోపలుండి పిరికి మందు పోసినా - వాడు మొండి ముండాకొడుకు. కదిలేటట్టు లేడు"

"అంటే! మన యాపారాలు—యవహారాలు మరో చోటికి మార్చేయాలా ఏటి బాబూ?"

"నువ్వు నోర్మూయ్‌రా! మంచిగా ఖాళీ చేస్తే చేసాడు-లేకపోతే వీడో లెఖ్ఖా ! ఏదో దెయ్యాల కొంప అంటే దీని జోలికి ఎవరూ రారు కదా! మనం ఎవరి దృష్టిలో పడకుండా యాపారం నడుపుకోవచ్చు అనుకున్నాంగానీ. సరే, వాడు మర్యాదగా దెయ్యం పేరుమీద ఖాళీ చేస్తాడు. లేదా - ఆ దెయ్యం మూలంగా రక్తంకక్కుకు చస్తాడు. ఏమంటావ్?" అన్నాడు నవ్వుతూ కుర్చీలో కూర్చుని గ్లాసులు ఖాళీ చేస్తున్న ఓ ఆకారం.

పరిస్థితి అర్థమయ్యింది. విజయ్ నాకేసి చూసాడు. ఇద్దరం కర్లి వెనుక గుమ్మం దగ్గరకెళ్ళి నెమ్మదిగా తోసాం. లోపల గడియ వేసిలేదు. నెమ్మదిగా తెరుచుకొంది. గదిలోకి వెళ్ళగానే టపటపా స్విచ్‌లు వేసాం.

కుర్చీలో సగం త్రాగిన గ్లాసుతో రామారావు.

క్రింద— సగం ఖాళీచేసిన బాటిల్స్‌తో అర్జయ్య.

చుట్టూ— టేప్‌రికార్డర్‌లు, వాచీలు, ట్రాన్సిస్టర్స్, సిగార్ లైటర్స్ వగైరా విదేశీ వస్తువులు.

రామారావు ఆశ్చర్యంనుంచి తేరుకుంటూ "నువ్వు ఊరెళ్ళలేదా ?" అన్నాడు తడబడుతూ.

"నీ కథ ముగియందే" అన్నా సూటిగా చూస్తూ.

మరుక్షణంలో రామారావు, అర్జయ్య చేతులకు బేడీలు పడ్డాయి.

"నీకు కొంప చూపించి— నా కొంప ముంచుకున్నాకదటయ్యా" అన్నాడు రామారావు బాధగా — విజయ్ మెడ పట్టుకు గెంటుకు తీసుకెళ్తుంటే అంత దూరం వెళ్ళేదాకా చూస్తూండిపోయా.

మనిషి మరణించాక కొందరు తీరని కోర్కెలతో దెయ్యమయి తిరుగుతూంటారని అంటారు. బ్రతికున్న మనిషి కోర్కెల్ని తీర్చుకోడాన్కి దెయ్యాల్ని సృష్టించి త్రిప్పుతూంటారని ఇప్పుడర్థమయ్యింది.

# ఉత్తరాలు

### సీరియల్

24-4-81 సంచికలో చల్మాజీగారి "ఇంకో మంటో చరిత్ర" కథ చాలా బాగుంది. స. ఆనందారామంగారి ఇంద్రసింహాసనం, వేమకోటి సీతారామశాస్త్రిగారి రాగబంధితులు అను రెండు సీరియల్స్ ముఖ్యంగా మమ్మల్ని కుతూహలపరచుచున్నవి. మంచిసీరియల్స్ ప్రచురిస్తున్నందుకు ముఖ్యంగా మీకు మా ధన్యవాదాలు తెలుపుచున్నాం. ఇక పోతే ధర్మపథం' శీర్షికలో బులుసు వెంకటరమణయ్యగారు వివరించిన తాపత్రయం గురించి బాగా చెప్పారు. కార్టూన్లు కూడా బాగున్నాయి.

కొండదాడి వెంకట రమణమూర్తి (శ్రీకాకుళం)

*  *  *

1-6-81 నాటి పత్రికలోని 'చల్లగా వర్షించిన్న' యామినీ సరస్వతిగారి కథ హృద్యంగా ఉంది. కథ పూర్తి చేసేసరికి నయనాలు అశ్రు పూరితాలైనాయి. ఇంత చక్కని ఇతి వృత్తాన్ని ఎన్నుకొని అంత కన్నా చక్కగా కథ నడిపిన సరస్వతిగారికి ప్రత్యేక అభినందనలు.

మాటేకాన ప్రకాష్ (విజయనగరం)

*  *  *

శోభన్‌బాబు, జయసుధ ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వార పత్రిక అత్యంతాకర్షణీయంగా వుంది. 'రాగబంధితులు' సీరియల్ రసవత్తరంగ వుంది. రాంబాబులాంటి సామాన్యులు నేడు ఈ లోకంలో ఎందరో కనిపిస్తారు. కథ అయినా, కవిత అయినా గుండెకు కలిగే స్పందన నుంచే రావాలి. రాంబాబు లాంటి వ్యక్తులు కథలు, నవలలే కాదు— హృదయాలను సైతం కదిలింపచేసే రచనలు చేయగలుగుతారు. ఎందుకంటే రాంబాబు సామాన్యుడు కాబట్టి!

పి.వి. రామనాథరావు (మధిర)

### "ఉత్తరాలు"

అగ్ర నటులు రామారావు, అక్కినేని ముఖ చిత్రాలంకరణతో వెలువడిన 1-5-81వ తేదీ నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉన్నది.

అదే సంచిక ఉత్తరాల శీర్షికలో కాల్వ సత్యేంద్ర కృష్ణ [విశాఖపట్నం] గారు ఉత్తరాలశీర్షిక విజ్ఞానదాయకంగా ఉండాలి, ఫలానా ముఖ చిత్రం బాగుంది అని వ్రాసే ఉత్తరాలకు అవకాశ మివ్వకూడదు. పత్రిక అభివృద్ధికి చేయవలసిన మార్పులు, చేర్పులు, కూర్పులు మొదలగు విజ్ఞాన విషయాలకు ప్రాధాన్యత ఇచ్చినప్పుడే బాగుంటుంది. ఈ ఉత్తరాలు శీర్షిక అని వ్రాసిన వారు, తమరే ఆ విజ్ఞాన విషయాలను వ్రాసినట్లయితే చాలా బాగుణ్ణు కదా! క్షమిస్తే... "శిరంగి నీతులు చెప్పేవారే గాని అని ఆచరణలో ఉంచేవారు ఎవరు" పాఠకుడు ఈ శీర్షిక కొద్దిమందికే పరిమితమని కొందరి పేర్లు పేర్కొన్నారు. వారిలో కొందరి ఉత్తరాలు కొంత విజ్ఞాన, వినోదదాయకంగా ఉంటున్నాయి. ఆఖరుగా పాఠకులు కథలు, ముఖచిత్రాలు బాగున్నాయి అని వ్రాయడం వలన పై పాఠకునికి కలిగిన బాధ ఏమిటో నా కర్థం కావడం లేదు.

సరోజ [బరంపురం]

### జపమాల

20-3-81 తేదీ వారపత్రిక ధర్మపథంలో శ్రీ వెంకటరమణయ్యగారు జపానికి జపమాలతో అవసరం ఉన్నట్లు తోచదని వ్రాశారు. జపమాల అనాదిగా ఉపయోగింపబడుతున్నదే. కొందరు 108 సార్లు లేక 1008 నామ జపం చేయాలని నిర్ణయించు కొంటారు. అట్టివారికి జపమాల వద్దంటే ఉత్తమం కదా! టైము నిర్ణయించుకొనే విధానంలో లెక్క తక్కువ ఎక్కువలు కావచ్చును. మాల ఉపయోగిస్తే ధ్యానం అంతా లెక్క మీదనే ఉంటుందన్నారు. టైము నిర్ణయం పద్ధతిలో మాత్రం టైము ఎప్పుడు అవుతుందా అనే పరధ్యానం కలుగదా! జపం మీద దృష్టి నిలపడం అనేది అభ్యాసం మీద ఆధారపడి ఉంటుంది. దానికి జపమాల అవరోధం కాజాలదు. మాల త్రిప్పడం అలవాటైతే కనీసం కొలికిపూస తగిలే వరకైనా ఏకాగ్రత నిలుపుకోవచ్చును. లెక్క అవసరం లేనివారు టైము నిర్ణయం చేసికోవచ్చును. లెక్క అవసరం ఉన్నవారికి జపమాలయే ఉత్తమ సాధనం.

అయ్యగారి సూర్యనారాయణమూర్తి
[హైదరాబాద్]

### కథలు

"నాకు విడాకులు కావాలి" కథ ద్వారా ఆడది అబల కాదు సబల అని నిరూపించాడు రచయిత.

కనుమూరు రాజారాంరెడ్డి (అత్తివరం)

*  *  *

"నాకు విడాకులు కావాలి" చాలా నచ్చింది. నేటి సమాజంలో యిటువంటి ఒడుదుడుకుల జీవితాలు ఎన్నో వున్నాయి. అంత్య నిష్ఠూరం కల్పించిన మోహన్ ఆదిలో భార్యను ఉద్యోగానికై అనుమతించక పోవలసింది. ఈ గాడిలో ఒక్క మగ వాళ్ళే నడుస్తున్నారు అని ఖచ్చితంగా చెప్పలేము. ఉద్యోగం చేస్తున్న భర్త తన సహ ఉద్యోగినితో మాట్లాడటం చూసినా, ఆలోచనలకు పునాదులు వేస్తుంది భార్య. వాటి పై పొడి పొడి మట్టితో మేడలు కట్టి జీవితాన్నే కూల్చదోసుకుంది. కోరి విడాకులు పుచ్చుకోవడం స్వయంకృతాపరాధమే అవుతుంది. మంచి కథ అందించిన రచయితకు ధన్యవాదాలు.

గురువెల్లి గోవిందరావు, ఎ. దుర్గారావు,
ఎల్. రాజారావు (హల్దియా)




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

BONDED LEAD HB ✱ 621 ✱ NATARAJ ✱ H.P.P.LTD.

## పెన్సిళ్ళన్నీ ఆకారానికి సమానమే
## కాని ఈ రకం మట్టుకు దీర్ఘకాలం వ్రాస్తాయి.

# నటరాజ్ పెన్సిళ్ళు

గ్యారంటీ : చెక్కుతున్నప్పుడు విరగదు.
ఎందుకంటే, దీని "బాండెడ్ లెడ్", మిగిలిన వాటి కంటె ధాటీగా పని చేస్తుంది. మరి పెన్సిల్ ఎంత తక్కువ విరిగితే అంత ఎక్కువ కాలం మన్నుతుందన్న విషయం మీకు తెల్సుకదూ !




గ్యారంటీ: అతి మృదువుగా, అతినల్లగా వ్రాస్తుంది.
ఎందుకంటె, నటరాజ్ అనమానమైన లెడ్ ఫార్ములా కలిగివుంది. మైక్రొనైజ్డ్ గ్రాఫైట్ మరియు క్లేల మిశ్రమము.
ఇంకా, అతి ప్రత్యేకమైన శ్రేణిలో అప్సరా పెన్సిళ్ళు ! రాయుటకు, రంగులు వేయుటకు, డ్రాయింగుకు మరియు గ్లాస్ మార్కింగ్ ల కొరకు.

# నటరాజ్ దీర్ఘజీవంగల పెన్సిళ్ళు

హిందుస్థాన్ పెన్సిల్స్ ప్రైవేట్ లిమిటెడ్ 79 పాల్టన్ రోడ్, బొంబాయి 400 001.

OBM/4080/TL

# డిబెంచర్స్

## మీ పెట్టుబడికోసం 7 చక్కని కారణాలు.



1 సంపూర్ణ సురక్షితమైనవి: కంపెనీ స్థిరాస్తిని ఈ డిబెంచర్స్‌కి మదుపుగా పెట్టడం వల్ల, మీ పెట్టుబడి సురక్షితం.

2 కొనుగోలు, అమ్మకం సులభం: బొంబే, అహమ్మదాబాద్, ఢిల్లీ, కలకత్తా, బెంగళూర్ మరియు మద్రాస్ స్టాక్ ఎక్స్ఛేంజెస్‌లో ఈ డిబెంచర్లను 'లిస్ట్' చేయటం వల్ల, కొనుగోలు, అమ్మకం సులభం.

3 13.5% వడ్డీ: నికరమైన ఆదాయం

4 పెరిగే పెట్టుబడి: 31 ఆగష్టు 1982 నాటికి ప్రతి డిబెంచర్‌కి ఒక రిలయన్స్ షేర్ (ప్రస్తుత మార్కెట్ ధర రూ. 95) ఇవ్వబడుతుంది, రూ. 25కి మాత్రమే. దీనివలన మీ పెట్టుబడి విలువ పెరగటమే కాకుండా, దిన దినాభి వృద్ధి చెందుతున్న కంపెనీలో మీరు భాగస్వాములవుతారు.

5 అధిక ఆదాయం: 54 శాతం, లేక ఇంకా ఎక్కువ. పైన వివరించినట్లుగా, 31 ఆగష్టు 1982 నాటికి మీకు ప్రతి డిబెంచర్‌కి ఒక కంపెనీ షేర్ లభ్యమవుతుంది. దీని ప్రస్తుత ధర రూ. 95. అప్పటికి ఈ షేర్ ధర, రూ. 100 అనుకోండి—మీరు ఈ షేర్‌ని అమ్మినట్లయితే, ప్రతి డిబెంచర్ మీద మీ పెట్టుబడి ఒక్క రూ. 25 మాత్రమే. అయితే మీకు వచ్చే వడ్డీ మాత్రం రూ. 100కి—అంటే మీ రూ. 25 మీద రూ. 13.50 వడ్డీ అన్నమాట (54 శాతం.) మీ మిగిలిన పెట్టుబడి రూ. 100 (125 లోంచి, షేరు కోసం రూ. 25ను మినహాయించగా మిగిలిన మొత్తం) మీకు తిరిగి ఇవ్వబడుతుంది, దీని మీద టెక్స్ ఉండదు.

6 బోనస్: కంపెనీ నిల్వలు మరియు ప్రస్తుతం అమలులో ఉన్న బోనస్ ఇష్యు గురించిన నిబంధనలను బట్టి, 1982లో రిలయన్స్ టెక్స్‌టైల్స్ బోనస్ షేర్స్‌ను ప్రకటించవచ్చు. ఇది జరిగినట్లయితే; మీకు వచ్చే షేర్ల సంఖ్య పెరుగుతుంది.

7 ఇంతవరకు పెట్టిన పెట్టుబడుల మీద వచ్చిన లాభాలు:

| పెట్టుబడి | ధర పెరుగుదల ఆదాయం (ఏప్రియల్ 1981 వరకు) | పెట్టుబడి నాటి షేర్ ధర | ప్రస్తుత షేర్ ధర (ఏప్రియల్ 1981) |
|---|---|---|---|
| నవంబర్ 1977 ప్రతి షేర్ 10 రూ॥లు | షేర్ ధర 1155 శాతం పెరిగింది. ప్రతి షేర్ మీద రూ. 11.37 డివిడెండ్ లభించింది. ఇదంతా కేవలం 42 నెలల్లో | రూ. 10 | రూ. 95 |
| డిబెంచర్ సీరీస్-1 ఒక్కటి రూ. 500, అక్టోబర్ 1979 | 19 నెలల్లో రూ. 487 (97 శాతం) ఆదాయం | రూ. 55 | రూ. 95 |
| డిబెంచర్ సీరీస్-2 ఒక్కటి రూ. 125, నవంబర్ 1980 | 6 నెలల్లో మార్కెట్ ధర రూ. 160కి పెరిగింది. ఇదేకాక 12 శాతం వడ్డీ | రూ. 65 | 31-12-1981 నాటికి ఒక షేరు ఇవ్వబడుతుంది. ప్రస్తుత షేర్ ధర రూ. 95 |
| ప్రస్తుత డిబెంచర్స్ ఒక్కొటి రూ. 125 | 13.5 శాతం వడ్డీ | రూ. 95 | 31-8-1982 నాటికి ఒక షేర్ ఇవ్వబడుతుంది. ప్రస్తుత షేర్ ధర రూ. 95 |

కంపెనీలోని ప్రస్తుత షేర్ హోల్డర్స్‌కి, సీరీస్-1 మరియు సీరీస్-2 డిబెంచెర్ హోల్డర్స్‌కి, ఇంకా డిపాసిట్ హోల్డర్స్‌కి ఈ క్రొత్త డిబెంచర్స్ ఎల్లాట్‌మెంట్‌లో ప్రాముఖ్యత ఇవ్వబడుతుంది.

Mudra/RTI/273/Tel.




## రిలయన్స్ టెక్స్‌టైల్ ఇండస్ట్రీస్ లిమిటెడ్

రిజిష్టర్డ్ ఆఫీస్: కోర్ట్ హవుస్, తిలక్ మార్గ్, దోబీ తలావ్, బొంబే-400 002.

**దిన దినాభి వృద్ధి చెందుతున్న సంస్థలో పెట్టుబడి చేయండి.**

**1981 10 జూన్ పబ్లిక్ ఇష్యూ ప్రారంభం!**



# జ్యోతి

ఎమ్. ఎస్. రాజు

జ్యోతికి అసలు కన్నీరు ఆగటంలేదు.

"జ్యోతి!... ఛఛ ... ఏమిటి చిన్న పిల్లలా ఈ కన్నీరు!" ఆమె కన్నీరు తుడిచి అన్నాడు శేఖర్.

"అదికాదు శేఖర్, ఐదు సంవత్సరాలు ఎలా గడపాలా అని ఆలోచిస్తున్నాను. అది తలచుకుంటే భయంగా ఉంది, దుఃఖం వస్తున్నది" అన్నది దుఃఖ స్వరంతో.

"అదికాదు, నాకు తెలుసు నువ్వెందుకు ఏడుస్తున్నావో."

జ్యోతి ఏం మాట్లాడలేదు.

తిరిగి శేఖర్ అన్నాడు — "విదేశాలకు వెళ్ళిన ప్రతివాళ్ళు వచ్చేటప్పుడు అక్కడి అమ్మాయిల్ని వివాహం చేసుకొని ఇండియాకు తిరిగి వస్తున్నారు. అలా నేను కూడా నిన్నూ, నీ ప్రేమనూ కాదని ఎవరినైనా పెళ్ళి చేసుకొని వస్తానని కదూ నీ భయం ?"

తన మనసులోని అనుమానాన్ని గ్రహించిన శేఖర్ కళ్ళలోకి సూటిగా చూడలేక తల దించుకొన్నది.

"జ్యోతి... భగవంతుడి సాక్షిగా చెప్తున్నాను. నేను అమెరికా నుండి తిరిగి వచ్చాక అగ్నిసాక్షిగా నిన్ను నా అర్ధాంగిగా స్వీకరించి మన ప్రేమకు సార్ధకత చూపిస్తాను. నిజం జ్యోతి ... నీవు లేకుండా నేను బ్రతకగలనా ? ఈ జీవితాన్ని అనుభవించగలనా ? నీకు తప్ప ఈ హృదయ సామ్రాజ్యంలో మరెవరికీ స్థానం లేదు" అన్నాడు లాలనగా, ఆప్యాయంగా.

"చాలు శేఖర్...చాలు" అన్నది తృప్తిగా జ్యోతి.

మైక్‌లో ఎనౌన్సింగ్ వినిపించింది.

"ఆఁ... ఇక నేను వెడతాను" అన్నాడు తన రెండు సూట్‌కేసుల్ని తీసుకొని.

"శేఖర్, వెళ్తాను కాదు, వెళ్ళి వస్తాను అని చెప్పు" అన్నది జ్యోతి.

ఆమె మూఢ విశ్వాసానికి శేఖర్‌కు నవ్వు వచ్చింది. నవ్వుతూనే "ఆల్‌రైట్ వెళ్ళి వస్తాను" అన్నాడు.

అప్పటివరకు మౌనంగా ఉన్న తన మిత్రుల్ని భుజం తట్టి "ఒరేయ్ రాజా! వినోద్... అప్పుడప్పుడూ జ్యోతిని పలకరించి రండి" అన్నాడు.

"అలాగేరా ఆ మాత్రం మాకు తెలీదా?" అన్నాడు రాజా.

"శేఖర్... టైము అవుతుంది" కర్తవ్యాన్ని గుర్తు చేశాడు వినోద్.

"అమెరికా వెళ్ళగానే ఇండియాకు కేబుల్ పంపించు శేఖర్" అన్నది జ్యోతి.

"అలాగే..." అని ముగ్గురికీ వీడ్కోలిచ్చి ఫ్లైట్ వైపు అడుగులు వేశాడు డాక్టర్ శేఖర్.

కొన్ని నిముషాల్లో విమానం గాల్లో లేచి ఆకాశంలో లీనమైపోయింది.

"పదమ్మా... ఇక వెడదాం ?" అన్నాడు రాజా, జ్యోతిని ఉద్దేశించి.

ముగ్గురూ ఎయిర్‌పోర్టునుండి బయటకు వచ్చారు.

"నేను సిటీబస్సులో వెడతాను అన్నయ్యా ?" అన్నది జ్యోతి.




## అందర్నీ మీరు అలా ఆకర్షించేందుకు
## మదురా బట్టలు

పాలియెస్టర్ మిశ్రిత మదురా బట్టల విస్తృత శ్రేణిలోని
ప్రతి అంశం అద్భుతమైనదే. ఆ రంగులు,
ఆ ప్రింట్లు, ఆ డిజైన్లు, ఆ నాణ్యత, ఆ ధర...ఓహో!

# మదురా బట్టలు

MCL- 485 TEL

"అదేం!... ముగ్గురం టాక్సీలో పోదాము" అన్నాడు రాజా.

"అవునండి, రాజా చెప్పింది బాగుంది" అన్నాడు వినోద్.

"ఫరవాలేదు, నేను బస్సులోనే వెడతాను" అన్నది.

ఆమెను కాదనలేక "సరే..." అన్నారు మిత్రులు యిద్దరూ. జ్యోతి బస్సు ఎక్కి వెళ్ళిపోయింది.

కాలగర్భంలో ఐదు సంవత్సరాలు గడిచాయి.

* * *

రాజా, వినోద్ ఆతృతగా రాబోయే విమానం కోసం ఎదురుచూస్తున్నారు. వాళ్ళ చేతుల్లో పూలదండలు ఉన్నాయి. కొద్ది నిముషాల్లో విమానం లాండ్ అవుతుందని ఎనౌన్స్‌మెంట్ చేశారు. వాళ్ళ కళ్ళు ఆకాశంవైపే ఆతృతగా చూస్తున్నాయి. చెవులు చిల్లులుపడే శబ్దంతో ఎయిర్ ఇండియా బోయింగు విమానం వచ్చి లాండ్ అయింది.

ఒక్కొక్కరే విమానంలోనుండి దిగి వస్తున్నారు. శేఖర్ కన్పించలేదు. ఇంకా రాడేమిటి, ఒకవేళ రాలేదా? వస్తున్నట్లు కేబుల్ యిచ్చాడు. పరిపరి విధాల ఉన్నాయి రాజా, వినోద్ ఆలోచనలు.

అప్పుడే శేఖర్ స్టెప్స్ దిగి తమవైపే వస్తున్నాడు. శేఖర్‌లో చాలా మార్పు వచ్చింది. మనిషిలో ఒక విధమైన హుందాతనం కన్పిస్తున్నది. గతంకంటె ఇప్పుడు ఎర్రగా, దృఢంగా కనిపిస్తున్నాడు. ఎంత అయినా డాక్టరు కదా అనుకొన్నారు మిత్రులు.

శేఖర్ మెడలో పూలదండలు వేసి ఆప్యాయంగా కౌగలించుకొన్నారు. శేఖర్ జ్యోతి కోసం చుట్టూ చూశాడు కానీ... ఆమె లేదు.

"జ్యోతి రాలేదేం? నా కేబుల్ అందలేదా?" అన్నాడు.

"అందింది, ఆమెకు కాస్త అర్జంటు పని ఉండి – రాలేకపోయింది. అందుకామె ఎంతో బాధపడింది" అన్నాడు రాజా.

"అవును, రావాలని చాలా ట్రై చేసింది. కానీ వీలుకాలేదు" సమర్థించాడు వినోద్.

శేఖర్ బాధగా "జ్యోతిని చూసి ఐదు సంవత్సరాలు అయింది. ఇక్కడికి తప్పక వస్తుందని ఎంతో ఆశపడ్డాను" అన్నాడు.

అరగంటలో కస్టమ్స్ వాళ్ళను వదిలించుకొని, లగేజీతో బయటకొచ్చి టాక్సీ ఎక్కారు స్నేహితులు ముగ్గురూ.

# "జ్యోతి"

"ఆఁ...ఏమిట్రా మీ ఊరి సంగతులు?" అన్నాడు శేఖర్.

"ఏమిట్రో ... ప్రదేశం మారగానే 'మీ' అని సంబోధిస్తున్నావు!" అన్నాడు రాజా ఆశ్చర్యంగా.

"ఏదో సరదాకి అన్నాను లేరా; అరె! ... ఈ ఐదేళ్ళలో సిటీ చాలా అధునాతనంగా తయారు అయిందే!" కూలింగ్ గాగుల్స్‌లో నుండి బయటకు చూస్తూ అన్నాడు శేఖర్.

బయట నూతనంగా, ఎత్తుగా వెలిసిన బిల్డింగులు, ఏన్నో రకాల దుకాణాలు అతన్ని ఆశ్చర్యచకితుణ్ణి చేస్తున్నాయి.

## ఏమైనాయ్?

ఏమైనాయ్?
ఆ మధుర సంగీ
సల్లాప ఉల్లాసాలు?

ఏమైనాయ్?
ఆ విరి చూపుల
మదన తూపులు?

ఏమైనాయ్?
ఆ వసంతారాయ
విహార విలాసాలు?

కాకులు కూస్తుంటే
కోకిల గొంతు నొక్కి
పాతుకుపోయిన విష వృక్షానికి
నువ్వూ ఒక వేరువై
ధీరువుగా పాతిపోతున్నావా?
నన్ను ఒంటరిని చేసి?!

— మల్లిక్

"శేఖర్, అక్కడ నీకెలా ఉంది. ప్రదేశం బాగా పడిందా" అడిగాడు వినోద్.

"బ్రహ్మాండంగా పడింది. అదిసరే కాని జ్యోతివాళ్ళ అమ్మగారు ఎలా ఉన్నారు? హౌ ఈజ్ హర్ మదర్?"

హఠాత్తుగా శేఖర్ అడిగేటప్పటికి మిత్రులిద్దరూ ఉలిక్కిపడ్డారు. ఒకరి ముఖం, ఒకరు చూసుకొన్నారు.

"ఏమిట్రా మాట్లాడరేం! వాట్ హాపెండ్?" అడిగాడు శేఖర్.

ఏం జవాబు చెప్పాలో అర్థం కాలేదు – రాజాకు, వినోద్‌కు. చివరికి నెమ్మదిగా నోరు విప్పాడు రాజా "శేఖర్... మనిషి జీవితంలో ఒక్క ఘడియ ముందు ఏమి జరుగుతుందో ఊహించలేము. అలా తెలిస్తే మనం జాగ్రత్త పడి, తన సృష్టికి ప్రతిసృష్టి చేస్తారని భయం అనుకొంటాను ఆ భగవంతుడికి" అని ఆపి శేఖర్‌ను చూడసాగాడు.

శేఖర్‌కు ఏమీ అర్థం కాలేదు. "రాజా... వాట్ డు యూ మీన్...స్పీక్...టెల్ మీ?" ఆదుర్దాగా అడిగాడు రాజా భుజం కుదుపుతూ శేఖర్.

"నీవు అమెరికా వెళ్ళిన తరువాత జ్యోతి అమ్మగారు శాశ్వతంగా మనల్ని విడిచి వెళ్ళిపోయారు" అన్నాడు బాధగా.

ఊహించని ఆ జవాబుకు అదిరిపోయాడు శేఖర్ "మరి నాకు ఎందుకు ఈ విషయం వ్రాయలేదు" అన్నాడు బాధగా.

"జ్యోతి, ఈ విషయం నీకు వ్రాసి నీ చదువు పాడుచెయ్యవద్దు అన్నది" అన్నాడు వినోద్.

జ్యోతి అమ్మగారి మరణవార్త వింటేనే ఇంత చలించిపోయిన శేఖర్, జ్యోతి విషయం తెలిస్తే ఏమైపోతాడో ఊహించలేక పోతున్నాడు రాజా.

"నన్ను ఎంతగానో ఆదరించి, తల్లి–దండ్రుల్ని సైతం మరపించి, పై చదువులు చదివి గొప్ప డాక్టరు అయి, ఎంతోమందికి ప్రాణదానం చేయాలని దీవించిన ఆ మాతృదేవత ఇక లేదా? ఓ... గాడ్ ఇలా జరుగుతుందని కలలో కూడా ఊహించలేదు!" శేఖర్ కళ్ళు అశృపూరితాలయ్యాయి.

"శేఖర్... బాధపడకు" అని ఓదార్చారు మిత్రులు.

"డ్రైవర్... త్వరగా పోనీయ్" అన్నాడు శేఖర్.

"శేఖర్ ... మా యింటికి వెళ్ళి, తర్వాత జ్యోతిని చూడటానికి పోదాం?" అన్నాడు రాజా.

"వీల్లేదు, తల్లిపోయి ఒంటరిగా ఎంత దుఃఖాన్ని దిగమ్రింగి జీవిస్తున్నదో నా జ్యోతి. ముందామెను చూడాలి. నా కోసం ఎంత ఎదురు చూస్తుందో?" అన్నాడు శేఖర్.

"అవును ఎదురుచూస్తూ ఉంటుంది" అని నిట్టూర్చాడు వినోద్. ఆ నిట్టూర్పులో ఏదో ఉంది? భయంకరమైన నిజం ఉంది? లావా వంటి ఆ నిజం, భయంకరమైన ఆ

# "జ్యోతి"

సత్యం తెలిసి శేఖర్ ఎలా ఉంటాడో? పరిస్థితులు ఎలా ఉంటాయో ఊహించలేక పోతున్నాడు వినోద్.

జ్యోతి ఇల్లు దగ్గిర అయ్యేకొద్దీ రాజా, వినోద్‌లు ఏం జరుగుతుందో అని ఆలోచిస్తూ, భయపడిపోతున్నారు.

కారు ఆగింది.

శేఖర్ కారు దిగి ఆత్రుతగా, స్నేహితులు పిలుస్తున్నా విన్పించుకోకుండా యింట్లోకి పరుగుపెట్టాడు. తన హృదయ సామ్రాజ్యనిని చూడాలని, మాట్లాడాలని ఆత్రుతగా "జ్యోతి ... జ్యోతీ ..." అని పిలిచాడు. జవాబు లేదు.

హాలు గదిలో చాపమీద కొన్ని బొమ్మలతో ఆడుకుంటూ రెండేళ్ళ బాబు కన్పించాడు. ఈ క్రొత్త మనిషి ఎవరా అన్నట్లు ఉన్నాయి బాబు చూపులు.

బాబును చూస్తే శేఖర్‌కు ముచ్చట కలిగింది. అచ్చం జ్యోతిలా ఉన్నాడు.

శేఖర్ బాబును ఎత్తుకొని ముద్దు పెట్టుకొన్నాడు. అది చూసి గుమ్మంలో నిలబడి చూస్తున్న రాజా, వినోద్ ఆశ్చర్య పోయారు.

"రాజా ... ఈ బాబు ఎవరు ? భలే ముద్దు వస్తున్నాడు" అన్నాడు శేఖర్.

రాజా, వినోద్ ఏమీ చెప్పలేక నేలచూపులు చూడసాగారు.

"నా బిడ్డే !?" ఆ మాట విని, శేఖర్ ఎవరా అని వెనక్కి తిరిగి ఒక్కసారిగా షాక్ తిన్నాడు.

తెల్లచీరలో, జుట్టురేగి, చెమటతో ముఖమంతా అందవికారంగా ఉన్న జ్యోతిని చూసి ఇది కలా ? నిజమా ? అనుకొంటూ "జ్యోతి ... ఏమిటి అలా అయిపోయావు ? ఆ దుస్తులు ఏమిటి ? ఈ బాబు నీ బిడ్డా ? ఇది నిజమా ... కాదు ... కాదు ... ఇది నిజం కాదు. ఒక పీడకల అని చెప్పు జ్యోతి ! అంతా అబద్ధం అని చెప్పు జ్యోతి. ఓ...గాడ్ !... నేను భరించలేను" అంటూ కుమిలిపోయాడు.

"అవును శేఖర్! ఇది నిజం. నీవు నమ్మలేని నిజం !" అంది.

శేఖర్ ఆవేశంగా "జ్యోతీ ... ప్రతి క్షణం నిన్నే స్మరిస్తూ, నీవే నా ఆశాజ్యోతి అని, నీతోనే నా జీవితం అని ఎంతో ఆశతో కలలు కన్నాను. ఆ ఆశతోనే ఇంతకాలం నా హృదయంలో నీ రూపాన్ని నింపుకొని జీవించాను. ఆ రోజు ఎయిర్‌పోర్టులో నేను అమెరికాలో ఏ స్త్రీనైనా వివాహం చేసుకొని నిన్ను మోసం చేస్తానేమోనని అనుమాన పడ్డావు. కానీ ఇక్కడ నీవు నన్నూ – నా ప్రేమనూ కాదని వివాహం చేసుకొని నాకు అన్యాయం చేస్తావా ? అంటే... నేనేమైపోవాలనుకున్నావు జ్యోతీ... చెప్పు జ్యోతీ ?" అని గద్దించాడు శేఖర్.

ఒక్కొక్క మాట శూలంలా జ్యోతి హృదయాన్ని చీల్చివేశాయి. చీరకొంగును నోట్లో కుక్కుకొని గట్టిగా ఏడ్చేసింది జ్యోతి.

పరిస్థితిని అర్థం చేసుకున్న రాజు "శేఖర్, ఆవేశపడకు. విధి వ్రాత మనం తప్పించలేము. ఇందులో ఆమె తప్పు ఏమీలేదు. నీవు అమెరికా వెళ్ళిన తరువాత వాళ్ళ యింటిలోకి ఒక వ్యక్తి అద్దెకు దిగాడు. అతను స్వతహాగా చాలా మంచివాడు. ఒకనాడు అతని స్నేహితుల బలవంతంపై బాగా త్రాగి యింటికి వచ్చాడు. ఆ రోజు జ్యోతి ఒక్కతే ఇంటిలో ఉంది. త్రాగిన మైకంలో అతడు పశువుగా మారి ఆ అవకాశాన్ని ఉపయోగించుకొని తన తృష్ణ తీర్చుకొన్నాడు. మర్నాడు జరిగింది తెలుసుకొని వాళ్ళ అమ్మగార్కి క్షమాపణ చెప్పుకొని జ్యోతికి యిష్టమైతే వివాహం చేసుకుంటాను అన్నాడు. శీలం కోల్పోయి తన ముఖం నీకు ఎలా చూపాలని బాధపడి, నిన్ను మోసం చెయ్యలేక అతన్నే వివాహం చేసుకుంది. కానీ... కానీ... ?" రాజు గొంతు గాద్గదమైంది. ఇక చెప్పలేకపోయాడు.

"ఆ భగవంతుడికి జాలి లేదో, ఆ విధికే కన్ను కుట్టిందో జ్యోతి గర్భవతి అయిన ఆరు నెల్లకు అతను అనుకోకుండా లారీ ఆక్సిడెంట్‌లో పోయాడు. ఆ నిజం తెల్సి జ్యోతి అమ్మగారు కుమిలి, కృశించి ప్రాణం విడిచింది. ఈ విషయాలన్నీ నీకు తెలియచేస్తే నీవు భరించలేవని, ఆ షాక్‌లో నీ స్టడీ మానేసి ఇండియాకు తిరిగి వచ్చేస్తావని – భయపడింది. అందుకే మేము కూడా నీకు ఏ విషయమూ వ్రాయలేకపోయాము !" అని ముగించాడు వినోద్.

జ్యోతి కథ విన్న శేఖర్ ఆ వ్యక్తిత్వానికి ఎంతో ఆశ్చర్యపోయాడు. తన తొందర పాటుకు సిగ్గుపడ్డాడు. తలెత్తి ఆమెవైపు చూశాడు. తలుపును ఆనుకొని వెక్కి వెక్కి ఏడుస్తున్న ఆమెను, ఆమె కళ్ళను చూసి చలించిపోయాడు. ఆ కళ్ళలో మోసం లేదు.

కలకాలం పసుపు కుంకుమలతో పచ్చగా ఉండవలసిన జ్యోతి, నుదుట బొట్టు లేక కళా విహీనంగా ఉన్నది. ముత్తయిదువుగా, నిండుగా, తలలో తురిమిన పూలతో అందంగా ఉండే ఆమె కేశ సంపద అస్తవ్యస్తంగా రేగి వున్నది. శరీర సౌందర్యం మెరిసిపోతూ ఎంతో అందంగా, ఆకర్షణీయంగా ఉండవలసిన చేతులు గాజులు లేక మోడుబారిన చెట్ల కొమ్మలవలె బోడిగా వున్నాయి. పట్టుచీర కట్టి, నిండుగ స్వప్నసుందరిలా ఉండవలసిన జ్యోతి తెల్లని చీరలో బ్రతుకంతా ఇంతే అన్నట్లుగా ఉన్నది.

ఇంత చిన్న వయసులో ఆమె జీవితం చీకటి కాకూడదు. ఆమె జీవితంలో వసంతం చిగురించాలి. అమావాస్య వంటి ఆమె జీవితం పున్నమివెన్నెల కావాలి, నిత్యం ఒంటరిగా బ్రతుకుతున్న ఆమెకు తోడు కావాలి.

శేఖర్ ప్రక్క గదిలోనికి వెళ్ళాడు ? జ్యోతి, రాజు, వినోద్ ఆశ్చర్యంగా చూశారు. వాళ్ళకు ఏమీ అర్థం కాలేదు. రెండు నిముషాల్లో శేఖర్ బయటకు వచ్చాడు. అతని హృదయం తేలికగా ఉంది, ముఖంలో సంతోషం కన్పిస్తున్నది –

"డియర్ ఫ్రెండ్స్ ... నేను బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. ఒకవేళ ఇది మీ దృష్టిలోను, ఈ సమాజం దృష్టిలోను తప్పు అని అనుకొన్నా, నా దృష్టిలో ఇది ఒప్పు, సరైన న్యాయం. ఈ సమాజం ఏమనుకొన్నా నాకు భయం లేదు !" అని లోపలనుండి తెచ్చిన కుంకుమను బొటన వ్రేలితో జ్యోతి నుదుటపై పెట్టి, ఒక దండను జ్యోతి మెడలో వేసి, బాబును ఎత్తుకొన్నాడు.

జ్యోతి ఆశ్చర్యపోయింది. రాజు, వినోద్ నమ్మలేకపోయారు.

"జ్యోతీ ! నిన్ను నేను ప్రేమించాను. నిన్నే సర్వస్వం అనుకొన్నాను. నీకే నా గుండెలో గుడి కట్టాను. అందుకే నీకు భర్తగా, బాబుకు తండ్రిగా మిమ్మల్ని కోరుకుంటున్నాను !" అని ముగించాడు.

జ్యోతి తనకి అంత అదృష్టం కల్గించిన శేఖర్ గుండెలపై ఆరాధనగా చూస్తూ ఒదిగిపోయింది.



# KERAGEM

కేరాజెమ్ చాలాసార్లు వడకట్టిన అసలైన

# కొబ్బరినూనె

**100%** అసలైనది, చాలాసార్లు వడకట్టిన కొబ్బరినూనె-
విస్తారంగా కొబ్బరి పండే కేరళానుండి








E.P.K 102

వంటకు వినియోగమయే
రుచికరమైన ఆరోగ్యకరమైన
కొబ్బరినూనె. జాగ్రత్తగా
గమనించండి అది కేరాజెమ్
అసలైన కొబ్బరినూనె.

ఒత్తుగా నిగనిగలాడే
జుట్టుకి అసలైన తలనూనె
జాగ్రత్తగా గమనించండి
అది కేరాజెమ్ అసలైన
కొబ్బరి నూనె.




కేరళా స్టేట్ కోకోనట్
డెవలప్‌మెంట్ కార్పొరేషన్
లిమిటెడ్
(కేరళా ప్రభుత్వపు సంస్థ)
త్రివేండ్రమ్- **695 014** (కేరళా)

ఆంధ్రలో సెల్లింగ్ ఏజెంట్లు : **వరసయ్య & కం.,**

| | | |
|---|---|---|
| 3-5-784/6/5, కింగ్‌కోటి, బషీర్‌బాగ్ రోడ్, | 11-22-28, రాజారంగయ్యప్పారావు వీధి, | గంగానమ్మపేట, **తెనాలి-1.** |
| **హైదరాబాదు-500 001.** | **విజయవాడ-520 001.** | ఫోన్ నెం. 166 |
| ఫోన్ నెం. 220782 | ఫోన్ నెం. 77328 | ఏలూరు బజారు, **గుంటూరు-3.** |

# వారఫలం

**5–6–1981 శుక్రవారం మొదలు**
**11–6–1981 గురువారం వరకు**

మేషం : గ్రహ సంచారంలోని కొన్ని మార్పుల వలన మీకు ధన సేకరణలో కొన్ని అవకాశాలు లభించనున్నవి. భారీ వ్యాపారంలో చేసిన మార్పులు లాభదాయకాలు. పత్రికా ప్రకటనకర్తలకు, రచయితలకు ఏ ఆటంకాలు లేకుండా కాలం జరిగిపోతుంది. స్త్రీలకు : ఉద్యోగ వృత్తులందు అభివృద్ధి, కొందరకు ప్రమోషన్ లభించుట, లబ్ధి గల్గుట, క్రీడావనిలో విశేషాదరణం లభించగలదు.

వృషభం : ఆరోగ్య లోపం లేదు. అధికారులైనవారి ఆదరణ లభించే అవకాశం గల వారం. వ్యాపార, వృత్తులందు ఆదరణ. రాజకీయంగా కొందరకు మేలు, క్రీడావనిలో కొందరకు నూతనావకాశాలు లభించగలవు. నిశ్చయంగా భూముల వలన, ఇండ్ల వలన ఆదాయం లభించగలదు. స్త్రీలకు: కళా సాహిత్య రంగాలలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రగతికి అవకాశాలు నిస్సందేహంగా లభిస్తాయి.

మిధునం : కొన్ని విధాల లాభించే మార్గం. ఒకానొక విషయం, నిర్వివాదంగా పరిష్కరించగల అవకాశమున్నది. మీ ఇంట శుభ కార్యం జరిగే అవకాశమున్నది. సాహిత్య కళా రంగాలలో మీకు సదవకాశం లభించనున్నది. కార్మికులకు విజయ సూచన గలదు. స్త్రీలకు :విద్యా వైజ్ఞానిక రంగాలలో సుకరమైన మార్పులుండగలవని గ్రహించగలుగుతారు

కర్కాటకం : అనుకున్న ప్రణాళిక అలాగే అమలుపరచగలుగుతారు. వైద్య, విద్యా రంగాలలో, రచనా వ్యాసంగంలో, అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. గతంలో మీ వలన మేలు పొందిన వారు, ఏదో ఒక రీతిని ఆదుకొన జూడగలరు. ఆరోగ్య లోపముండదు. అందుచేత, విజృంభించి, కార్య సాధనకుపక్రమించండి. స్త్రీలకు : శుభ కార్యాచరణతో, వారమంతా హడావుడిగాఉండటం, వృత్తిలో అభివృద్ధి కార్యక్రమం అమలవుతుంది.

సింహం: మీ రాశ్యాధిపతి అనుకూల ప్రదాయకుడని అనుకొన వీలు లేదు. గురుశనుల యుతి ఏ మంత క్షేమకరంగాదు. ఆరోగ్య విషయంలో బాగా పట్టి చూడగలరు. వయసు మీరిన వారు మరీ జాగ్రత్తగా ఉండవలసిన వారమే. శని దశ అనుభవించే వారికి మరీ కష్ట ఫలాలు ప్రాప్తించనున్నవి. స్త్రీలకు: అనుకూలత చెప్ప వీలు లేదు. అన్ని రంగాలలో ఇబ్బందులు ఎదురు కాగలవు.

కన్య : శక్తికి మించిన వ్యయం చేయవలసి రావటం, కుటుంబ వ్యవహారాలు అస్తవ్యస్తంగా ఉండగలవు. భావికాలంలో మీకు మేలు జరుగనున్న విషయం గమనించగలుగుతారు. ఆరోగ్య విషయం

# వారఫలం

ఉత్సాహజనకం గాదు. శ్రమ అధికం. స్త్రీలకు : క్రీడావనిలో ఆశాభంగం, రాజకీయంగా కూడా సుకరమైన వారం గాదు.

తుల: ఈ వారంలో మొదటి మూడు దినాలు, వ్యాపార రీత్యా లాభదాయకాలు. ఆర్థికంగా వృద్ధి కనిపిస్తుంది. అయినా వ్యయం కూడా అధికమే. సాహిత్య ప్రియులకు అనుకూల కాలం. అంటే, అపూర్వావకాశాలు లభింపనున్నవి. ఆరోగ్యం మాత్రం తృప్తికరంగా ఉండదు. స్త్రీలకు : మానసికంగా ఉద్రేకం పొందటం, శుభ కార్యాలకు అంతరాయాలుండటం గమనింపగలుగుతారు.

వృశ్చికం : ఉత్సాహవంతంగా కార్యసాధన గావింపనున్నారు. అయితే కొంత నిరుత్సాహత కనిపిస్తుంది. అశాంతికి ఆకరమైన వారం. ఇతరులతో, బంధువులతో, అభిప్రాయ భేదాలు పొందనున్నారు. ధనాదాయం చెప్ప వీలు లేదు. అప్పులివ్వకండి. స్త్రీలకు : సకల సౌకర్యాలు, సకల రంగాలలో సమర్థవంతంగా సమకూరనున్నవి. శుభకార్యాల నిమిత్తమై చేసే ప్రయత్నాలు సత్ఫలదాయకాలు.

ధనుస్సు : వారం మొదటి రెండు రోజులు, వ్యాపారానికి అనుకూల దాయకాలు. అధిక వ్యయం కూడా సూచింపబడే వారం. ఉన్నతాధికారులతో గాని, పాటి భాగస్తులతో గాని మాట పట్టింపులుండగలవు. క్రయ విక్రయాలకు అనుకూల కాలం గాదు. క్రీడా రంగ పోటీలందు మీకు విజయమున్నది. స్త్రీలకు : అకారణ వైరాలు. అధిక వ్యయం, అనానుకూలత, అనుకోకుండా కొన్ని విధాల యిబ్బందులు ఎదురు కాగలవు.

మకరం : శక్తి సామర్థ్యాలు ప్రదర్శించి, నిరంతరంగా కృషి గావించి, విచ్చల విడిగా వ్యాపార రంగంలో విహరించి, అనుకున్న విధాన కార్య సాఫల్యం గావించుకోగలుగుతారు. మధ్య మధ్య ఎదురైన యిబ్బందులు, ఏమంత బాధాకరంగా ఉండబోవు. స్త్రీలకు : వృత్తియందభివృద్ధి, ఉత్సాహం, కార్యదక్షత, వయసులో ఉన్న వారికి శుభ ప్రస్తావనలుండగలవు.

కుంభం : నిబ్బరంగా వ్యాపారం చేయండి, నిరుత్సాహం తగదండి. నిశ్చయంగ చిత్ర రంగంలో లాభిస్తుంది. నియమ పాలనతో మీ కార్యక్రమాన్ని అమలు చేయండి, బాగా యోచించి చేసే కార్యాలు సఫలీకృతము కాగలవు. స్త్రీలకు: విద్యా వైజ్ఞానిక రంగాలలో ప్రగతి, దూర ప్రయాణాన్ని గూర్చిన ఉబలాటం గలవని చెప్పవచ్చు.

మీనం : అన్ని రంగాలలో అనుకూలత గలదు. అప్రయత్న ధన లబ్ధికి అవకాశమున్నది. ఆరోగ్య లోపం లేదు. అయినా వ్యయం అధికమే. అనవసరంగా చికాకులు, వ్యాపారస్తుల విషయంలో పొడసూపమన్నవి. గమనించండి. స్త్రీలకు : సుఖశాంతులకు లోపంలేదు. సుకరంగా ఉద్యోగ వృత్తులు జరిగి పోతాయి.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు



## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు

మీ బట్టలకు కళ్లు తిప్పుకోలేనంత తెల్లదనం—క్రమం తప్పకుండా సూపర్ రిన్‌తో ఉతికితే వాటి తెల్లదనం అద్వితీయం. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే మరింత తెల్లటి తెలుపునిస్తుంది సూపర్ రిన్. ఎందుకంటే, సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ.




దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే
ఋజువు చేసుకోండి :

మరే ఇతర డిటర్జంట్ బార్‌తోనైనా ఉతికినది





సూపర్ రిన్‌తో ఉతికినది

సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ

ధర్మపథం

# పరిహాసఫలం

— బులుసు వేంకటరమణయ్య

తమలో లోపాలున్నాసరే, వాటిని గ్రహించకుండా ఇతరుల వికార రూపాన్నీ, అంగ వైకల్యాన్నీ చూపి పరిహాసం చెయ్యడం తరచుగా కానవస్తుంది. ఇక, తామే చక్కగా ఉన్నామని గర్వించేవారు పరిహాసంచెయ్యడంలో ఆశ్చర్యం లేదు. ఇతరుల అంగ వికారాన్నిచూసి అపహాస్యం చెయ్యడం నాగరిక లక్షణంకాదు. మాటలచేతనే కాదు, భావంచేత కూడా ఆ హైన్యతను వ్యక్తం చెయ్యకూడదు. అటి పరిహాసానికి కాలాంతరంలో అయినా ప్రతి ఫలం ముట్టుతుంది. ఎంతటివారి కయినా అది అనుభవించక తప్పదు. భగవదవతార మూర్తి శ్రీకృష్ణుని భార్యలకే అది తప్ప లేదు. ఆ గాథ వినండి.

మహా ప్రభావ సంపన్నుడైన అష్టావక్రుడనే మహాముని పీకబంటి నీటిలో నిలిచి ఎంతోకాలం ఘోరతపస్సు చేయసాగాడు. ఒకప్పుడు రంభ, తిలోత్తమ మొదలైన అప్సరసలందరూ ఆ మార్గాన పోతూ, ఆ మహా నీయుని తపోమహిమకు మిక్కిలి ఆశ్చర్యపడి పెక్కు విధాల స్తుతించారు. ఆ స్తుతులకు సంతోషించి ఆ మహాముని "మీకేవరం కావాలో కోరుకోండి ఇస్తాను" అన్నాడు. రంభ, తిలోత్తమ మున్నగు కొద్ది మంది "స్వామీ! మాకేవరమూ అక్కరలేదు మీరు అనుగ్రహించారు. అది చాలును" అన్నారు. మిగిలినవారు "మీరు మాకు వరం యిచ్చే పక్షంలో శ్రీహరి మాకు భర్త అయేటట్లు అనుగ్రహించండి" అని అన్నారు. "సరే మీ కోరిక నెరవేరుతుంది లెండి" అని అతడు అన్నాడు. ఇలా అనిన పిదప ఆ ముని సమాధి చాలించి నీటి నుండి బయటికి వచ్చాడు.

అతని అవయవాలు అష్టవంకరలు కలిగి చూడడానికి అతని స్వరూపం వికారంగా ఉంటుంది. అందువల్లనే అతనికి అష్టావక్రుడనే పేరు వచ్చింది. బయటకు వచ్చిన ఆ వికార స్వరూపుని చూడగానే, అతని వల్ల వరం పొందిన అప్సరసలకు నవ్వు వచ్చింది. దానిని ఆపుకోలేక వారు ఫక్కున నవ్వారు. అది చూచి, ఆ అప్సరసలు కృతఘ్నులై తన్ను అపహసించారని అష్టావక్రునికివారి పై కోపం వచ్చి "మీరు శ్రీహరికి భార్యలయినా చివరకు దస్యులకు చిక్కుదురుగాక!" అని శపించాడు. వెంటనే వారు ఆయన కాళ్ళపై పడి తమ తప్పు క్షమించాలని ప్రార్థించారు. ఆయన జాలిపడి "భయపడకండి. మీరు దస్యులకు చిక్కినా ఎక్కువ బాధపడకుండా మానవ దేహాన్ని విడచి, నిజరూపాన్ని ధరించి స్వర్గానికి పోగలరు" అని చెప్పాడు.

శ్రీకృష్ణుడు తన నిర్యాణానికి ముందు అర్జునుణ్ణి పిలిచి, "ఇక ద్వారక మునిగి పోతుంది. నీవు స్త్రీలకు రక్షకుడవయివారిని హస్తినాపురానికి తీసుకొనిపో" అని చెప్పాడు. అర్జునుడు వారిని తీసుకొనిపోతూ వుండగా— దారిలో ఒక అడవిలో దస్యులు అతనిని అడ్డగించారు. శ్రీకృష్ణుని నిర్యాణంతోనే అర్జునుడి బలం పోయింది. ఆయుధాలేమీ పని చెయ్యలేదు. అందుచేత అతడు దస్యుల చేత ఓడింపబడ్డాడు. దస్యులు స్త్రీలనందరినీ బంధించారు. దస్యులకు చిక్కిన శ్రీకృష్ణుని భార్యలు దేహాలను విడిచి స్వర్గానికి వెళ్ళిపోయారు. రుక్మిణీదేవి మొదలైన అష్ట మహిషులూ అంతకు ముందే ద్వారకలోనే సహగమనం చేసి పరలోకంలో భర్తను చేరుకొన్నారు.

పరిహసించడం వల్ల ఎట్టి అపాయం కలిగేదీ విష్ణుపురాణంలోని యీ గాథ వల్ల తెలుసుకోవచ్చును.


ఆరోగ్యం, మజా, జోరూ తోడు జోడుగా
SPECIAL REFILL PACK
Save Re.1/-
Cadbury's
Bournvita
The tastier food drink
500 g net
Cadbury's
Bournvita
The tastier food drink
500 g net
OBM 6617 TL
మీ కుటుంబానికి రుచికరమైన బోర్న్‌విటా యివ్వండి.
బోర్న్‌విటాలో ప్రకృతిలోని మంచి లక్షణాలుగల కోకో,
మాల్ట్, పాలు, పంచదార సమృద్ధిగా వున్నాయి.
ఇప్పుడు ! ఎంతో పొదుపు పూర్తిగా ఒక రూపాయి
పొదుపు రీఫిల్ ప్యాక్ కొన్నప్పుడు
క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా
దీన్లోని మంచి లక్షణాలన్నీ మీకోసం

వనితలకు మనవి
కొత్తరకం వంటలు
క్లుప్తంగా వ్రాసి పంపితే
త్వరగా పరిశీలించగలము —సం.



# ఫాలాక్షుని డైరీ

## కోర్టులో హత్య !

వెస్ట్ జర్మనీకి చెందిన లూబెక్ నగరంలో 32 ఏళ్ల బాబ్‌మియర్ అనే ఆమె ఏడేళ్ల కూతురును 35 ఏళ్ల కాలస్ గ్రాబోస్కి అనే అతను చెరచాడట. తత్ఫలితంగా ఆ పిల్ల చని పోయిందట. ఈ కేసు విచారణ జరుగుతుండగా బాబ్ మియర్ బోనులో నిలబడిన ఆ గ్రాబోస్కిని స్రరువ లేచి తను సిద్ధంగా పెట్టుకున్న పిస్టలుతో ఆరు సార్లు కాల్చి చంపేసి, ఆ పిస్టలు కోర్టువారికి అందజేసిందట. 1975లో యీ గ్రాబోస్కి యిలాటి పసిపిల్లలను బలాత్కరించిన నేరానికి పట్టుబడితే కోపం వచ్చిన జడ్జిగారా కాలస్ గ్రాబోస్కి పురుష మర్మావయవాన్ని ఆపరేషను చేసి, తీసి వెయ్యమని తీర్పు యిచ్చారట. ఆనక అవయవమంతా తీయడం ప్రాణాపాయమని డాక్టరు అభిప్రాయ పడటంతో ఆ గండం గడిచిందట.

## చేతులు మారిన శవం !

అజ్మీరుకు చెందిన పురాణి మండి నివాసి గిరిరాజా అనే యువకుడు వో బస్సు గుద్ది రోడ్డు మీద చనిపోతే పోలీసులాతని శవాన్ని పోస్ట్‌మార్టం అయ్యాక యాభయి రూపాయలు కిరాయిచ్చి వో హరిజనుణ్ణి ఆ శవం పాతి పెట్టమన్నారట. ఆ హరిజనుడు నలభయి రూపాయలకు మరో హరిజనుడికి వప్పగిస్తే ఆ మేధావి ముప్ఫయిరూపాయలకింకో హరిజనుడికా శవాన్నప్పగించి చక్కాపోయాడట. అతనా శవాన్ని పాతేసి పోయాక ఆ గిరిరాజా తలిదండ్రులకు తమ పుత్రునిగతితెలిసి భోరు భోరుమంటూ ఆ శవాన్ని త్రవ్వి బయటికి తీసి, హైందవ సాంప్రదాయ అంత్య క్రియలు జరుపుకున్నారట. పోలీస్ రెస్పాన్సిబిలిటీ యీస్... అవన్నీ అన కూడదు.

## కట్నానికి ఆహుతైన మరో అబల !

కలకత్తా హవురాకుచెందిన ధర్మతోలా రోడ్డులోని వో మూడంతస్థుల మేడలోంచి ఫిబ్రవరి 15వ తేదీన తెలవారు జామున రెండున్నర గంటలకు గుప్పున నల్లటి పొగ రాడం చూసిన క్రింది అంతస్థులో వుంటున్న ఒకతను పరుగున పైకెళ్ళి తీగ లాగాడట. 19 ఏళ్ళ శశికళ అనే ఆమె ఆ అంతస్థులోని స్టోర్ రూములో పడుందట. ఆమె శరీరం కాలి వుందట. శవాన్ని పోలీసులు విచారణకు తీసుకున్న సందర్భంలో ఆమె భర్త కిశోరిచంద్ జైస్వాల్, అతని అన్నగారు తండ్రి తల్లీ అంతా చేరి శశికళ ఆత్మ హత్య చేసుకున్నదన్నారట. పోస్ట్ మార్టమ్ రిపోర్టులో కూడా ఆత్మ హత్యేనని వచ్చిందట. తమాషా ఏమిటంటే శవం అంతగా కాలనే లేదట. ఆమె వేసుకున్న ఏలం జాకట్టు అలానే వుందట. చీర చాలా భాగం అలానే వుందట. చేతులకు వున్న గాజు గాజులు ఒక్కటీ పగిలి లేదట. నోట్లోంచి నాలుక వికృతంగా బయటికివచ్చి వుందట. ఆమెను దారుణంగా హత్య చేసి యీ రకంగా ఆత్మ హత్యగా ఆమె భర్త, అత్తమామలూ చిత్రీకరించారనీ, యీ కేసులో న్యాయ విచారణ జరుగాలనీ జైస్వాల్ కులానికి చెందిన వారందరూ శ్రీమతి గాంధిని తంతి ద్వారా కోరారట. వారంతా ఆమె మామగారింటికి వెళ్ళే సరికి ఆయన వారి మీద తుపాకి గురి పెట్టి కాల్చి చంపేస్తానని అరిచాడట. పెళ్లినాడు శశికళ తండ్రి పెళ్ళి కొడుక్కి జపాను మోటారు సైకిల హోండా ఇరవై అయిదు వేలు పెట్టి కొనిస్తానన్నాడట.

అది కొన లేదని శశికళను ఆమె అత్త మామలు, భర్త రోజూచితక బాదే వారట. ఆమె నాలుగ నెలల గర్భిణి అట కూడా. ఈ విషయం మేం వదిలేది లేదు. న్యాయంజరిగి తీరాలి అని జైస్వాల్ సమాజం వారు పట్టు బట్టారట.

## భర్త తల నరికిన రెండో భార్య !

మెట్టూరుకుచెందిన తర్కాడు అనే గ్రామంలో ముత్తు అనే 30ఏళ్ల యువకుడు ఆ వూరిలో బ్రతలేక భార్యను, 2ఏళ్ల కూతుర్నీ ఆమె పుట్టింటికి పంపి, తాను ఢిల్లీ వెళ్లాడట. పని వెతుక్కోడంలో అతనికి సరసు అనే వో20ఏళ్ల అమ్మాయితో స్నేహం కుదిరి, ఆనకది ప్రేమగా మారిందట. ఆమెతో అతను వేరే ఇంట్లో కాపురం పెట్టి, వో రెండేళ్లు ఢిల్లీలోనే ఉండా ఆనక మనం తమిళనాడు వెళ్లిపోదాం పద అని ఆమెతో స్వదేశం[రాష్ట్రం] వచ్చేశాడట. సరసుతోను, ఆమెకు పుట్టిన అయిదు నెలల పిల్లతోనూ తర్కాడులో కాపురం పెట్టిన విషయం అతని నిజ భార్య బెల్లమ్మకు తెల్సి, ఆమె తన బిడ్డతోతర్కాడు వచ్చి వేరే ఇల్లు తీసుకుని ఉండి నీకిది న్యాయమా అని భర్తను వీలు చిక్కినపుడల్లా నిలదీయసాగిందట. ముత్తుకు రానురానూ అది న్యాయం కాదేమోనని పించి, చివరికి సరసుతో తాను తన నిజ భార్యను చేరదీయనిశ్చయించుకున్నట్టు చెప్పి ఆమెను ఢిల్లీ వెళ్లిపొమ్మని అన్నాడట. నువ్వే నా జీవిత సర్వస్వాని వని చెప్పి నాతో కాపురం చేసి, పిల్లను కనిచ్చి ఇలా మోసం చేస్తావా దుర్మార్గుడా అని ఆమె పోట్లాడిందట. ఈ పోట్లాట వోనాడు ఎక్కువై ముఖం కడుక్కుంటున్న అతన్ని వెదురు కర్రలు చీరే కత్తితో మెడ మీద ఒక్క దెబ్బ శక్తి వంచన లేకుండా కొట్టిందట. ఆ దెబ్బకు ముత్తు తల తెగి ఎగిరి క్రిందపడి, చెట్టునుంచి పడ్డ కొబ్బరి బోండాంలా దొర్లుకుంటూ పోయి, వో చోట స్థిరపడిందట.

# ప్రధానమంత్రి 20 అంశాల కార్యక్రమం
# లక్షలాది కష్టజీవులకు వరప్రసాదం



ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి ప్రకటించిన 20 అంశాల ఆర్థిక కార్యక్రమం, వాస్తవానికి ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి సుస్థిరమైన ప్రగతికి సంకేతం ఇది బడుగు వర్గాల అభివృద్ధికి జరుపుతున్న కృషిలో నూతన అధ్యాయాన్ని ప్రారంభించి, లక్షలాది మంది బలహీన వర్గాల ప్రజలలో కొత్త ఆశలను చిగురింపజేసింది.



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)

శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

### వాస్తవాలే ఇందుకు దర్పణం రికార్డుస్థాయిలో ఆహారోత్పత్తి :

1978--79లో రికార్డు స్థాయిలో 106.6 లక్షల టన్నుల ఆహారధాన్యాలను ఉత్పత్తి చేశారు. తుఫాను, దుర్భిక్ష పరిస్థితులు ఏర్పడినప్పటికీ తాత్కాలిక ప్రణాళికలను త్వరితగతిని అమలు జరపడంతో 79–80లో కనీసం 70 లక్షల టన్నుల మేరకు ఉత్పత్తి సాధించగలిగారు.

### ప్రజలకు చౌక వస్త్రాలు :

అరవై శాతం మంది చేనేత పనివారలను సహకార పరిధిలోకి తెచ్చారు : 1977–78లో 189 లక్షల చదరపు మీటర్ల చౌక వస్త్రాలను ఉత్పత్తి చేయగా 1978–79లో 2.3 లక్షలు, 1979–80లో 330 లక్షల చదరపు మీటర్ల చౌక వస్త్రాలను ఉత్పత్తి చేసి ఇప్పుడు 388 కేంద్రాల ద్వారా ప్రజలకు పంపిణీ చేశారు.

### చౌక ధర దుకాణాలద్వారా అత్యవసర సరుకులు :

ఇప్పుడు 22,009 చౌక ధర దుకాణాల ద్వారా ప్రజలకు అత్యవసర సరుకులను సరఫరా చేస్తున్నారు.

### భూ సంస్కరణలు :

రాష్ట్రంలో భూ సంస్కరణలను తీవ్రతరంగా అమలు జరుపుతున్నారు. ఇందువల్ల 3.79 లక్షల ఎకరాల మిగులు భూమిని స్వాధీనం చేసుకున్నారు. 1,74,125 కుటుంబాలకు భూమి పంపిణీ చేశారు. వారిలో చాలా వరకు షెడ్యూలు కులాలు, షెడ్యూల తెగలు, వెనుక బడిన తరగతులవారు ఉన్నారు.

### బలహీనవర్గాలకు ఇళ్లు :

ఈ పథకాన్ని ద్విగుణీకృతోత్సాహంతో అమలు జరుపుతున్నారు. 2.5 లక్షల కుటుంబాలకు 5,000 కొత్త వాడలలో వసతి కల్పించారు. 12 లక్షల పేద కుటుంబాలకు ఇళ్ల స్థలాలు కేటాయించారు.

---

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ : ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వముచే ప్రకటితము.

D.I.P.R 18656/Advt/Cl-3/81

# ఇంద్రసింహాసనం

(18 వ పేజీ తరువాయి)

అతని తాత్పర్యం. పరిస్థితులు ఇలాగే కొనసాగితే, ఇంద్రపదవిమాట ఎలాఉన్నా, తనవంశీకులు భూలోకంలోనయినా రాజ్యం చెయ్యటంకష్టం. ప్రజల ఆమోదంలేకుండా ఎవ్వరూ రాజ్యంచెయ్యలేరు.

యయాతి స్వర్గానికి విమానంలో బయలు దేరాడు. ఎప్పటిలాగే దారిపొడుగుతా, వినోదాలలో మునిగివున్న జంటలు—ఉద్యానవనాలు—చక్కని సెలయేళ్ళు—బంగారు రంగు తామర పద్మాలున్న సరోవరాలూ— ఆ సరోవరాలలో నౌకా విహారాలు చేస్తున్న జంటలు. ఎటు తలతిప్పినా, పాంథలూ — విలాసాలూ, వినోదాలు— అదీ, దేవలోకం.

నహుషుడు నివాసానికి సమీపంలో విమానం దిగాడు యయాతి. తండ్రిభవనం లోకి ప్రవేశించాడు. స్వచ్ఛమైన స్ఫటిక శిలతో చేసిన ఆ భవనం గోడలలో, మందిరం లోని మణిమయ ఆసనాలూ, మణిమయ పరికరాలూ ప్రతిఫలిస్తూ ఎటు చూసినా మణులకాంతులే కనిపిస్తున్నాయి. హంస తూలికా తల్పంమీద దిండ్లు ఆనుకొని, సగం వొరిగి మణులు పొదిగిన బంగారు పానపాత్రతో అమృతం సేవిస్తున్నాడు నహుషుడు.

"బ్రతకాలి! చాలాకాలం బ్రతకాలి! ఇంకా ఇంకా ఇలా వినోదాలూ, విలాసాలూ, అనుభవించాలి!" కాంక్షలతో తీవ్రంగా ఉన్నాయి నహుషుడు కళ్ళు. తండ్రిముందుకు వచ్చి నమస్కరించాడు. యయాతి.

"నువ్వా! మళ్ళీ స్వర్గానికి వచ్చావా రా! రా! నువ్వు నాపక్కన ఉంటే, నేను సాధించలేనిది లేదు." మైకంలో ఉన్నా, ఉత్సాహంతో అన్నాడు నహుషుడు

"నేను స్వర్గంలో ఉండటానికి రాలేదు. మిమ్మల్ని కూడా స్వర్గం వదలమని కోర టానికి వచ్చాను."

"ఏమిటీ?" కోపంతో అరిచాడు

"మీకు తెలియటంలేదో, తెలిసే ఉపేక్ష చేస్తున్నారో నాకు అర్థం కావటం లేదు. కానీ అన్ని లోకాలలోనూ, మీపట్ల వ్యతిరేక భావం తలెత్తింది. అందరూ ఏకమై మిమ్మల్ని పదవి నుంచి తొలగించకముందే, మీరు దిగిపోతే, మర్యాదగా ఉంటుంది."

కానీ, నహుషుడికి విలాసాల మైకమేగాక, అధికారమైకం కూడా తలకెక్కింది. యయాతి మాటలలో ఔచిత్యం అర్థమయినా అంగీకరించలేక పోతున్నాడు.

"పుణ్యకాలం... నేను చేసిన పుణ్యాలకు నేను అనుభవించవలసిన కాలం... ఆ కాలం పూర్తి కాకుండా నన్ను ఎవరు ఇంద్ర పదవి నుంచి తొలగించలేరు. ఇంద్రపదవిలో ఉండ గానే, మరి నూరు జన్మలకు సరిపడ సంపద లన్నీ పోగుచేసుకొంటాను. అనుభవించవలసిన వినోదాలన్నీ అనుభవిస్తాను."

తృష్ణగా చూస్తూ— అధికార దర్పం వెలారుస్తూ అన్నాడు నహుషుడు. ఆ దశలో ఉన్నవారికి తాము ఏం చెప్పినా ప్రయోజనం ఉండదనుకొన్న యయాతి, నమస్కారం చేసి వచ్చేసాడు. వెనుకనుండి "యయాతి!" అన్న తండ్రి పిలుపు మోహపిశాచి పాశంలాగ వెనా





ఆరోగ్యవంతమైన పళ్ళు, చిగుళ్ళకోసం నమ్మకంగా వాడబడేది లవంగనూనె

కొత్త

ఇదిగో

# ప్రామిస్ పళ్ళపొడి

## అనాదిగా వాడబడుతున్న లవంగనూనెతో కూర్చినది

లవంగనూనెతో కూడిన ప్రామిస్ పళ్ళపొడి ఏవిధంగా తోడ్పడుతుందో చూడండి.

- నోటిలో దుర్వాసనను, దంతక్షయాన్ని కలిగించే క్రిములను తొలగిస్తుంది. మీ నోటిని శుభ్రంగా రూపొందిస్తుంది.
- మీ చిగుళ్ళు ఆరోగ్యం చిందించేలా చేసి అతి మెల్లగా రుద్దుతుంది.
- మీ పళ్ళను తెల్లగా తళతళలాడేలా చేస్తుంది.
- పిప్పరమెంట్ మరియు లవంగనూనె యొక్క సాటిలేని రుచి.

3 బల్సారా
—సౌఖ్యమైన జీవనానికి
ఆధునాతన సాధనాలు




## కొత్తది. సాటిలేనిది. లవంగనూనె గలది ప్రామిస్ పళ్ళపొడి




## ఇంద్రసింహాసనం

డుతూ ఉంటే, అది తనను బంధిస్తుందేమో నని భయపడుతున్నట్లుగా త్వరపడుతూ విమానం ఎక్కి ఇంద్రాణి భవనానికి బయల్దేరాడు. ఇంద్రాణి అతడిని సాదరంగా ఆహ్వానిస్తూ "నువ్వు ఇక్కడికి వస్తావో, రావో అనుకున్నాను. వచ్చావు సంతోషం" అంది. యయాతి ఆశ్చర్యంగా "నేను స్వర్గం వచ్చినట్లు మీకు తెలుసా ?" అన్నాడు.

"తెలుసు. ఎందుకు వచ్చావో కూడా తెలుసు. నా దగ్గిర అత్యంత సమర్థులైన ముగ్గురు దేవకన్యలు గుఢచారిణులుగా ఉన్నారు. ఆ ముగ్గురికీ అనంతమైన పరివారం ఉంది. ముల్లోకాలలో ఎప్పుడు ఏం జరుగుతోందో, నేను తెలుసుకోగలను — నీకూ, దేవయానికీ, అన్యోన్యానురాగాలు లేవనికూడా నాకుతెలుసు!" ఉలికిపడ్డాడు యయాతి. రాజభవనంలోనే అందరికీ తెలియని అంతఃపుర రహస్యం తెలుసుకుందా ఇంద్రాణి!!!

చటుక్కున తన రెండు చేతులూ జోడించాడు.

"అమ్మా! ఇన్ని తెలుసుకొన్నదానివి, శర్మిష్ఠ ఎక్కడ ఉందో, చెప్పలేవా ?"

"శర్మిష్ఠ దేవయాని భూగృహంలో బంధించబడివుంది." ఆ మాటలు వింటూనే యయాతి ముఖం రగులుకుపోయింది. అతని చేయి ఖడ్గంమీదకు పోయింది.

"ఆ!... ఆ! ..." అంది ఇంద్రాణి హెచ్చరింపుగా. అప్పుడు తన చేయి జారిపోయింది. ముఖం వడలిపోయింది. రాణివాసంలో భూగృహం ఉన్నమాట అందరికి తెలుసు. కానీ దానిపై అధికారం మాత్రం పట్టపురాణిదే! మహారాజు కూడా ఆ విషయంలో కలిగించుకోవటానికి వీల్లేదు. అది అనాదిగా వస్తున్న ఆచారం. ఒకసారి భూగృహంలో బంధించబడిన తర్వాత, వాళ్ళు చచ్చారో, బ్రతికారో కూడా ఎవరికీ తెలియదు.

"శర్మిష్ఠ క్షేమంగా ఉంది. దేవయాని అంత క్రూరురాలు కాదు."

యయాతి మాట్లాడలేదు తన మనసులో దేవయానిపట్ల గల ద్వేషాన్ని అతడు మాటలలో చెప్పలేకపోతున్నాడు.

"నీ కార్యం సాధించుకోవాలనుకొంటే, దేవయానితో విరసంగా ప్రవర్తిస్తే లాభం లేదు. తన అహం గాయపడిన కొద్దీ, మరింత మూర్ఖంగా, మొండిగా ప్రవర్తించే స్వభావం దేవయానిది." హెచ్చరింపుగా అంది ఇంద్రాణి.

నిస్సహాయంగా చూసాడు యయాతి.

"నువ్వు నిశ్చింతగా ఉండు. కొద్ది రోజుల్లో నా దేవకన్యల్లో ఒకరు, శర్మిష్ఠ విడుదలయ్యేలాగ చూస్తారు."

యయాతి ఇంద్రాణికి నమస్కరించి తన నగరానికి వచ్చేసాడు. ఇంద్రాణి నిశ్చింతగా ఉండమని చెప్పినా, అతనికి ఊరట కలగటం లేదు. శర్మిష్ఠ విషయం తక్షణం తెలుసుకోవాలనే ఆరాటంతో పిచ్చివాడయిపోతున్నాడు

ఏం చెయ్యాలా, అని ఆలోచిస్తూ అంతఃపుర ప్రాంతంలో ఉన్న ఉద్యానవనంలో తిరుగు తున్నాడు. శర్మిష్ఠ పరిచారిక విమత కనిపిం చింది. చప్పట్లు చరిచి పిలిచాడు. ఉలికి పడింది విమత. విపరీతమయిన భయంవల్ల ముఖం తెల్లగా పాలిపోయింది. ప్రయత్నించి కూడా ముందుకు అడుగువెయ్యలేకపోయింది. తన ఆజ్ఞనే ధిక్కరిస్తున్నందుకు యయాతి కనుబొమలు ముడిపడ్డాయి. కానీ, ఆమె శర్మిష్ఠ పరిచారిక అనే జ్ఞానంతో, ఆగ్రహం అణచుకొని, రమ్మన్నట్లు సైగ చేసాడు. విధిలేక అతని ముందుకు వచ్చింది విమత.

ఆమె చేతిలో తిని వదిలేయగా మిగిలిన ఆహారంతో ఉన్న వెండి పళ్లెలు, వెండి గ్లాసులూ, బంగారు పానపాత్ర ఉన్నాయి. అవి క్రిందపెట్టి నమస్కరించి తలవంచి నిలబడింది.

"మీ రాణిగారికి ఆహారం తీసికెళ్తున్నావా?"

విమత ముఖం ఆనందంతో వికసించింది. శర్మిష్ఠ దేవయానికి దాసిగా మారింది మొదలు, ఇప్పటి వరకూ ఆమెను రాణిగా సంబోధించిన వారెవరూ లేరు. ఇప్పుడు మహారాజే ఆమెను అలా సంబోధిస్తున్నాడు. కృతజ్ఞతతో చూసింది. ఆ చూపుల్లో ఆమె మనసు చదువుకొన్న యయాతికి ఆమెలో విశ్వాసం కుదిరింది. తానొక చంద్రకాంత శిలా వేదికమీద కూచొని, మరొక స్ఫటిక శిలావేదిక ఆమెకు చూపి "కూచో" అన్నాడు. పరిచారికలకిది చాలా అసాధారణమైన గౌరవం. మరొకరయితే ఇంత గౌరవానికి భయపడే వారు. కానీ, ఇప్పటికి విమతకూ, రాజులో నమ్మకం కుదిరింది. వినయంగా కూచుంది.

"ఇప్పుడు చెప్పు, రాణి క్షేమంగా ఉందా?"

కళ్లెత్తిన విమత కళ్లనిండా నీళ్ళు. అది ఎవరికి పుట్టిందో, రాణివాసానికి ఎప్పుడు వచ్చిందో, దానికే తెలీదు. కానీ, జ్ఞానం వచ్చి నప్పటి నుండి శర్మిష్ఠ పరిచారికగానే ఉంది. కానీ, పరిచారికగా ఆమె ఎప్పుడు, ఏ అవమా నాన్నీ, దుఃఖాన్నీ పొందలేదు. శర్మిష్ఠ పరిచారికల నందరినీ చాలా దయగా చూసేది. ప్రత్యేకించి విమతను తోబుట్టువులా చూసేది. విమత శర్మిష్ఠ కోసం ప్రాణాలు వదలటాని కైనా సిద్ధంగా వుంటుంది.

"క్షేమమా? ఏమని చెప్పను మహారాజా! ఆమెకు అన్నపానాదులకు లోటులేదు. మిగిలిన సదుపాయాలూ ఉన్నాయి. కానీ, భాగ్యహీనం

## దేవుడా!

రోజురోజుకీ ఎండలు పెరిగిపోతున్నాయ్!
ఎండలతో పోటీపడి ధరలు
మండిపోతున్నాయ్!
ధరలతో పోటీ "పడిపోతోంది" జనాభా!
జనాభా పెరిగితే ధరలు ఆగవు
అంటున్నారు రాజకీయ ప్రబుద్ధులు!
కాలం కనికరించి ఎండలైనా
తగ్గుతున్నాయ్ కాని
ధరలూ, జనాభా... జనాభా, ధరలు
ఇవి తగ్గే మార్గం లేదా దేవుడా!!

— అన్నె రవికుమార్

## ఇంద్రసింహాసనం

దాటి రావటానికి వల్లేదు. అది క్షేమమేనా? మీరే చెప్పండి. అంత చిన్న వయసులో ఉన్న కన్నెపిల్ల— అల్లారు ముద్దుగా రాణివాసంలో పెరిగిన పిల్ల. అలా చీకటి ప్రాంగంలో మగ్గుతూ వింతకాలం క్షేమంగా ఉండగలదో మీరే చెప్పండి."

ఏదో చేసి శర్మిష్ఠను విడిపించమని కోరు కొంటున్నట్లుగా ఉన్నాయి, విమత చూపులు.

"దేవయానికి శర్మిష్ఠపైన ఎందుకింత పగ? శర్మిష్ఠ ఆమెకేమి అపచారం చేసింది?"

విమత మాట్లాడలేదు. తలవంచుకొంది. యయాతి మనసులో కుతుహలం పెరిగింది.

"చెప్పు" అన్నాడు.

"క్షమించండి, మహారాజా! ఆ విషయం మీతో చెప్పవలసిందికాదు-నన్ను నిర్బంధించ కండి."

ఈమాటలతో తన ఆరాటాన్ని ఏమాత్రం అదుపులో పెట్టలేకపోయాడు యయాతి.

"నీకేంభయంలేదు చెప్పు. నువ్వు నిజంగా శర్మిష్ఠను అభిమానించే దానివే అయితే, ఆమె విషయాలు ఏవీ దాచకుండా నాకు చెప్పు. ఆమె విముక్తికోసం నేను ఏమైనా చేస్తాను. ఎంతకైనా సాహిస్తాను."

ఈ మాటలతో విమతలో సంకోచం చాలావరకు తీరింది. అయినా వణుకుతోన్న గొంతుకతో నెమ్మదిగా అంది—

"చాలారోజులనాటి సంగతి— అప్పుడు గురుకులంలో శుక్రాచార్యులవారి దగ్గిర, చదువుకొనే, అనేకమంది విద్యార్థినీ, విద్యార్థు

లలో, కచుడు, దేవయాని, శర్మిష్ఠ కూడా ఉండేవారు. గురుకులంలో చదువుకొనేటప్పుడు రాజకుమారులైనా, రాజకుమారులైనా, సాధారణ విద్యార్థులలాగ మసలుకోవలసిందే! రాజకుమారి అయినా శర్మిష్ఠ నేటి విద్యార్థినీ విద్యార్థులతో కలిసిపోయి అందరితో స్నేహంగా ఉండేది. దేవయాని మాత్రం తానే మహారాణినన్నట్టు ఉండేది. ఆ ప్రవర్తన వారికి నచ్చకపోయినా, శుక్రాచార్యులమీద గౌరవంతో ఆమెను ఏమీ అనకపోగా, ఎదురు ఇచ్చకాలాడుకొనేవారు. ఆ కారణంగా ఆమె అహం మరింత పెరిగిపోయేది. సాధారణంగా ఆశ్రమ ప్రాంతంలో ఎవరూ వేటాడరు. అక్కడికి క్రూరమృగాలు రావు. వచ్చినా ఎవ్వరినీ ఏమీ చెయ్యవు. ఎందుకంటే, వాటిని రెచ్చగొట్టేవాళ్ళెవరూ అక్కడ ఉండరు. హోమాగ్ని ధూమానికీ, వేదపారాయణ సవ్వడికీ చెదిరిపోయి అవి దూరం నుండే బెదిరి పారిపోతాయి. పవిత్రవనంలోనే ఆశ్రమ ప్రాంతం చేరిన కొన్ని క్రూరమృగాలు సహితం అందరి మాలిమి అయిపోయి పెంపుడు జంతువులు లాగా మారిపోతాయి.

ఒకరోజు అందరూ శ్రద్ధగా అధ్యయనం చేస్తున్న సమయంలో వేటగాడి బాణం దెబ్బతిన్న లేడి అక్కడకు పరుగున వచ్చింది శరణు కోరుతున్నట్టు. చదువు ఆగిపోయింది. శర్మిష్ఠ రాజకుమారి కనుక, ఆమె విలువిద్యతో పాటుగా గాయపడిన వారికి అవసరమైన చికిత్సలు కూడా నేర్చుకొంది. గాయపడిన లేడిని శర్మిష్ఠ తన వడిలోకి తీసుకొంది. తన చీర అంతా రక్తసిక్తమవుతున్నా లెక్కచెయ్యకుండా, అతి నేర్పుగా, ములికి శరీరంలోకి దిగకుండా బాణం లాగింది. చెలికత్తెలను పంపి అవసరమైన లేహ్యాలు తెప్పించింది. తాను స్వయంగా గాయం కడిగి, ఆ లేహ్యం పూసి, జాగ్రత్తగా కట్టు కట్టింది. అప్పటికి కచుడూ, మిగిలిన విద్యార్థులూ మెత్తని గడ్డితో, ఆ లేడికి పడక సిద్ధం చేసారు. అందరూ కలిసి ఆ లేడిని, ఆ పచ్చిక పడకమీద విశ్రమింపచేసారు అదంతా జరుగుతున్నంతసేపూ దేవయాని చూస్తూ కూర్చుండే కాని, ఏ మాత్రం సాయం చెయ్యలేదు.

(ఇంకా వుంది)




# “పార్టీ” దొరతనం!

నేను “సామాన్యుణ్ణి” ప్రజాస్వామ్యంలాంటి పెద్ద మాటలకి నాకు అర్థం తెలీదు. అది జనాలకి చాలా అవసరమైనదైతే కావొచ్చునుగాని దేశ స్వాతంత్ర్యం కోసం, అది వచ్చాకా దాన్ని కాపాడుకుంది కోసం పొట్ట మాడ్చుకున్న వాళ్ళందర్నీ తల్చుకుని కూడా యీ ప్రజాస్వామ్యాన్ని అర్థం చేసుకుందా మన్నా; యిప్పుడా మాట నాకు అర్థం కావటం లేదు... ఎందుకంటే నేను సామాన్యుణ్ణి... ప్రజాస్వామ్యం అంటే నాకు అర్థం అవుతున్నదల్లా ఒక్కటే... ఎన్నికల్లో గెలిచిన పార్టీ వాళ్ళ “రాజ్యం” అని– దేశంలో ప్రతిపక్షాలకి, ప్రజలకి– ప్రతిపక్షాల నోటికీ, ప్రజల దుఃఖానికి కూడా విలువ లేదన్నదే నా అనుభవం. నేను “నేనే”నని రుజువు చేసుకుని వెర్రి వెంగళప్పలాగ గంటన్నరసేపు క్యూలో నుంచుని వోటుమీద ముద్రవేసి, వేలి మీద “మచ్చ” పెట్టించుకుని వస్తున్నప్పుడు నేను అనుకుంటాను... ఎవణ్ణో గెలిపిస్తున్నాను... నా వోటు అమూల్యమైంది అని. నేను అసామాన్యమైనవాణ్ణి అని– కాని అనక తెలుస్తుంది. ఒక పార్టీ నిరంకుశంగా నెత్తికెక్కి కరాళ నృత్యం చెయ్యడానికే నేని శ్రమ అంతా పడ్డానని అప్పుడు నాకు తెలీదు. ఎందుకంటే నేను సామాన్యుణ్ణి... నాలాంటి వాళ్ళు లేకపోతే యీ దేశానికి యింత జనాభా వుండదన్న వెర్రి గర్వం తప్ప నా దగ్గిర ఏమీలేదు... అధికారంలో వున్న పార్టీ మీద ప్రతిపక్షాలు చేసే ప్రహసనాత్మక దండయాత్రకి మురిసిపోడం ఒక్కటే నాకు యీవాళ లైబ్రరీకి వెళ్ళి పేపరు చూస్తే దొరికే ఉచిత వినోదం– ఆనందం!

గవర్నమెంటు అంటే అధికారంలో ఉన్న పార్టీ– దాని పేరు గెల్వక మునుపు ఏదైనా కావొచ్చును గాని గెలిచిన తర్వాత మాత్రం “గవర్నమెంట్!”–దానికి పార్టీ పేరు, జెండా ఎన్నికలప్పుడువుంటాయి; పరిపాలనలో అక్కర లేదు.

పాలధర పెంచే హక్కు గవర్నమెంటుది అంటే యీ పార్టీది నీళ్ళధర పెంచే హక్కు వాళ్ళదే! కాలినడకన పోవల్సిన సామాన్యుడు వాళ్ళు కొవ్వెక్కి బస్సెక్కుతానని, పాలు త్రాగుతానని అనడమేం? అంచేత బస్సురేట్లు తెల్లారిసరికల్లా దారుణంగా పెంచే హక్కు వాళ్ళదే! ఎందుకయ్యా అంటే– ప్రజాస్వామ్యం అంటారు!... దాన్ని బ్రతికించాలని యిట్లా రేట్లు పెంచుతారుట!

రూపాయి మారిస్తే గవర్నమెంటు వాళ్ళ ధర్మమా అని చిల్లర తిరిగిరాని దేశంలో “ప్రజాస్వామ్యం వర్ధిల్లాలి” అని అరవడానికి వోపికలేదు సామాన్యునికి. “ధరలు తగ్గాలి” అని అరవడానికీ వోపికలేదు... ధరలు పెంచే వోపిక, గుండెబలం, కండబలం– గవర్నమెంటుకున్నాయి. వాటిని వద్దని కేవలం అరిచే నోటిబలం ప్రతిపక్షాలకున్నది— ఏ బలం లేదు మనకి...!

[పీ రాజీ]






Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna

ఇదుగో...

# వజ్రంలాంటి అంచుగల

## వాడైన బ్లేడు









అత్యుత్తమమైన స్టెయిన్‌లెస్ స్టీల్ తీసుకున్నాం...దాన్ని పదును పెట్టాం, అరగదీశాం, సానపట్టాం, మెరుగు పెట్టాం—అయినా మాకు తృప్తి కలిగిందా అంటే లేదు. అందుకే, అంచుమీద వాక్యూమ్ స్థితిలో అతిసూక్ష్మ లోహ రేణువులను శక్తివంతంగా స్ప్రే చేసాం, టెఫ్లాన్ పూత వేశాం; ఆ విధంగా ఓ రత్నాన్నే సృష్టించాం—'వజ్రం లాంటి అంచుగల' వాడైన బ్లేడు.

కొత్త ఇరాస్మిక్ స్టెయిన్‌లెస్ సుప్రీమ్- మీ ముఖానికి అర్హమైంది ఇదే !

## ఇరాస్మిక్
### స్టెయిన్‌లెస్
## సుప్రీమ్

**సాంకేతిక ప్రావీణ్యం మరి ఇరాస్మిక్, సుఖమైన షేవ్ ఇది సుప్రీమ్!**

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA














నలుగురూ కలిసి
ఆనందించే
సమయము ఇదే !

థమ్సు అప్

కోలాయొక్క ఉల్లాసము
తాజాదనమునకు
నేస్తము